the 1st Edition. శ్రీరస్తు.

కృతి

# భారతసార రత్నావళి.

కృతిపతి:

చిత్పురము కటుమంచిపుర నివాసులగు

నార్తార్కాడు డిస్ట్రిక్టు కోర్టుప్లీడరు

## సుబ్రహ్మణ్యరెడ్డి.

సర్వజనంబులకు చతుర్విధ పురుషార్థ ప్రదంబుగ

శ్రీమహాభారతమునం గల సారతరపద్యంబుల నేర్చి

కూర్పఁబడి

రము గవర్నమెంటు హైస్కూల్ ఆంధ్రభాషా పండితులగు

శేషులూరు కుప్పనయ్యంగార్లవలన

సవరింపఁబడి

చెన్నపురి:

వి. శ్రీనివాసయ్యగారి

"ఎక్సెల్సియర్" ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపఁబడియె.




శకము ౧౮౦౭.

పార్థివాబ్దము.

1885.

FIRST EDITION.

శ్రీరస్తు

# శ్రీభారతసారరత్నావళి.

గ్రంథకర్త:

చిత్తూరము కటుమంచి పురనివాసులగు
నార్తార్కాడు డిస్ట్రిక్టుకోర్టుప్లీడరు
సుబ్రహ్మణ్యారెడ్డి.

ప్రకాశకులు:
వేంకటరాం అండ్ కో., బెజవాడ.

Third Edition.

బెజవాడ:
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యచే
ముద్రింపఁబడియె.

శుక్లసంవత్సరము.
1929.

# పీఠిక.

సహృదయులారా!

ఆంధ్రవాఙ్మయమునందు భారతమునకున్న ప్రశస్తి వేఱొండు గ్రంథమునకు లేదు. ఆదికావ్యమగుటచే లక్ష్యలక్షణ స్వరూపముల నిరూపించుటకు లాక్షణికులు ఈ గ్రంథరాజము నాదరించిరి. కవిరాక్షసుఁడు భారతనిబంధనముల నాంధ్రభాషలో నతిక్రమింపరాదని నియమంబుఁ జేసెను. కవిత్రయమును మూర్తిత్రయముగా నావలి కవులు భావించి కృత్యాదులలోఁ బ్రశంసించిరి. ఆంధ్రభాషాలోక మోన ఆంధ్రీకరించి భారతమును బ్రసాదించిన కవిత్రయము నెడఁ గృతజ్ఞుఁడుకాని యాంధ్రుఁ డక్షరాస్యులలో నుండఁ డనుట సాహసము కాఁజాలదు.

భారతమును దెలిఁగించి యాంధ్రలోకమును విజ్ఞానవంత మొనరించిన మహామహులగు నన్నయ, తిక్కన, ఎఱ్ఱనకవుల జీవితము నెఱుంగుట ప్రకృతము గాకపోదు. నన్నయభట్టారకుఁడు తొలుత భారతము జనిగింపఁ దొరకొనెను. నేఁటివఱ కుపలభ్యములగు తెలుఁగు పొత్తములలో నన్నయభారత భాగమే మొదటిది. ప్రాచీనాంధ్ర వాఙ్మయ స్వరూపముఁ దెలిసికొనఁగోరువారికి నన్నయభారతభాగము సిద్ధాంజనము. ఇమ్మహామహునిది నిరర్గళధార. మృదుమధురశైలి. ఈయన కవిత "కవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తితో నారసి మేలు మేలనఁ" దగినదె. ధార అష్టాదశపర్వనిర్వహణసంభృతమై పెనుపొందు నారయని సోమయాజి— "కవిత జెప్పి యుభయకవిమిత్రు మెప్పింపనరిది బ్రహ్మకైన" యని పేరొందిన తిక్కన సోమయాజి చెప్పినాఁడు. నన్నయభట్టారకుఁడు వేఁగిదేశమును రాజమహేంద్రవరము రాజధానిగఁ జేసికొని యేలిన రాజరాజనరేంద్రుని యాస్థానకవిగ నుండి ఆంధ్రభారతము ఆది, సభాపర్వములు, అరణ్యపర్వము నాలుగవ యాశ్వాసము నందలి 142 పద్యములవఱకు రచించెను. ఈ కవి రాజరాజనరేంద్రుని రాజ్యకాలమగు క్రీ. శ. ౧౦౨౨–౧౦౬౩ మధ్య కాలమున సుప్రసిద్ధుఁడై యుండెను.

విరాటపర్వము మొదలుకొని మిగిలిన పదునేను పర్వము లనన్య సామాన్యముగ నిరర్గళధారతో నవరసబంధురముగ దెలిగించి యాంధ్రవాఙ్మయమును సర్వతోముఖముగఁ బ్రకాశింప జేసినకవి తిక్కన సోమయాజి. ఇతనికాలమున నాంధ్రభాషకు నూతనవికాసము కల్గెను. తరువాతి కవిప్రపంచమునకు సోమయాజి భారతరచనమే మార్గదర్శక మయ్యెను. తిక్కన సోమయాజిని 'కవితాప్రపంచరవి' యని యొక యాధునిక విమర్శకవతంసుఁడు వ్రాసియున్నాఁడు. ఇతఁడాంధ్రసాహిత్య సౌధద్వారములఁ దెఱచి సారస్వత సర్వస్వము సర్వజనసాధ్య మొనరించెను. ఈ మహాకవి నెల్లూరుమండలమును బాలించు మనుమసిద్ధికడ మంత్రిగానుండి క్రీ. శ ౧౨౦౦-౧౨౫౭ మధ్యకాలమున భాషాకృషి సేయుచు సుప్రసిద్ధి వహించెను. ఇతఁడు 'ఉభయకవిమిత్ర' బిరుదాంకితుఁడు.

మూఁడవవాఁడు ఎఱ్ఱాప్రగడ. ఇతఁడు రచించిన హరివంశము వాఙ్మయమునఁ గల సమగ్రగ్రంథరత్నములలో నొకటి. ఆకృతిలోఁ జిన్నదైనను యోగ్యతలో భారతమునకు దీసిపోదు. నన్నయభట్టారకుఁడు విడిచిన యరణ్యపర్వభాగమును (నాలుగవయాశ్వాసము 142 పద్యము మొదలుచేసికొని) పూర్తిసేసెను. నన్నయ తిక్కనలయెడఁ గల కావ్యగుణములు ఇమ్మహాకవియెడఁ గలవు. భారతమునఁ గొంతభాగముపూర్తిచేసి సమానకీర్తి నన్నయ తిక్కనలయొద్దనుండి పంచుకొనుటకుఁ దగిన ప్రతిభ ప్రశస్తిధారాప్రాప్తవ మీకవిచంద్రునియెడఁ గల సహజసుగుణములు. క్రీ.శ. ౧౩౨౦-౧౩౪౦ మధ్యకాల మితని గ్రంథరచనకాలమని విశ్వసింపనచ్చును.

సుప్రసిద్ధులగు సీభారతకవులు ఆంధ్రమహాభారతమును బ్రసాదించి యాంధ్రవాఙ్మయము నుద్ధరించిరి. వీరి రచనా సందర్భములఁ గూర్చి తారకబ్రహ్మరాజమందు రాధామాధవకవి యీక్రింది విధముగాఁ బ్రశంసించి యున్నాఁడు.

"ఉ. భారతరత్నహార మొకభాగము నన్నయభట్టు గూర్చె ము
  క్తారమణీయవాక్యములఁ, దక్కినభాగము సోమయాజి సొం

పారఁగఁ గూర్చి, రెంటి గలయఁగ శివదాసుఁడు మధ్యనాయక
శ్రీ రచియించె శారద ధరింపఁ గవిత్రియకీర్తి మించఁగన్॥”

ఏతద్గుణ విశిష్టమగు నీ యాంధ్రభారతమున భారతరాజుల చరిత్రమేగాక ధర్మములు, న్యాయములు, ఆధ్యాత్మికములు, నీతులు, విరివిగాఁ గలవు. ఇందలి యుపాఖ్యానము లేదే నొక యుత్కృష్టధర్మమును బోధించుచున్నవి. ప్రతిపద్యము రసాస్వదమేగాక యపూర్వ ధర్మబోధకము. ఈ యుత్తమ గ్రంథమునుగూర్చి నన్నయభట్టారకుఁ డిటులఁ బ్రశంసించినాఁడు.

సీ॥ ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికుల్ సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితహాసమనియు
బరమపౌరాణికుల్ బహు పురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ

ఆ॥ వె॥ వివిధవేద తత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు॥ ఆది. ప్రథ. ప 31

పంచమవేదమని పేరెన్నికఁగన్న భారతమునలేని ధర్మము లెందును లేవు. ఐహికాముష్మికములకు సంబంధించిన యిందలి పద్యరత్నములు మానవజీవిత సంస్కారమునకుఁదగియున్నవి. చతుర్వేద సారభూతంబగు నీ భారతరత్నాకరమున నమూల్యరత్నములు లెక్కకు మించి కలవు. పలువు రీరత్నముల నేకరించి కంఠస్థ మొనరించిరికాని సర్వజన సామాన్యముగ నొనర్పరైరి. పదునెనిమిది పర్వములతో నతివిస్తృతముగనుండిన మహాభారతమునుండి నైతికాధ్యాత్మిక పద్యరత్నములను నేకరించుట సామాన్యకార్యము గాదు.

శ్రీ కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డిగారు భారతమును బలుమాఱు పఠించి యందలి పద్యములసారము గ్రహించి ఐహికాముష్మికము లకు సంబంధించిన పద్యముల నన్నింటిని నేర్చి భారతసారరత్నావళి యను నీ యుత్తమగ్రంథమును క్రీ. శ. 1885 లో ముద్రణ మొనరించిరి. వారు క్రీ. శ. 1863 సం॥ మదరాసులోని వాణీనికేతన మను ముద్రాక్షరశాలయందు ముద్రితమైన యచ్చుప్రతినాధారముఁ జేసికొని యందలి పద్యములను ఉత్పత్తి, సత్త్వాది, ప్రవృత్తి, నివృత్తి, స్తుతి యను ప్రకరణములక్రిందికి ఆయాశీర్షికల కనుకూలముగా సమకూర్చి యీయుద్గ్రంథమును ప్రచురించిరి. భారతనీతి తెలిసికొనుట కీగ్రంథ మొకటిమాత్రము పఠించిన జాలును. అష్టాదశపర్వసార మనఁదగు నీసంగ్రథిత గ్రంథము అవ్యవస్థగానుండి భారత ధర్మములు నెఱుంగదలఁచిన విద్యార్థులకు మిగుల నుపయోగకర మనుటలో సంశయములేదు. ఇటీవలఁ గొందఱు భారతములోని నీతి పద్యముల సేకరించి ప్రచురించిరిగాని విషయవివరణమునందుఁ బద్యజాలమునందును, సమగ్రసంగ్రహణమునందును నీపొత్తమున కెంతయో వెనుకబడి యున్నవి. ఇట్టియుత్తమగ్రంథరత్నము పునర్ముద్రణము నొంది యాంధ్రలోకము నలంకరించుట సుకృతాతిశయము.

తమతండ్రిగారు సమకూర్చి ముద్రించిన భారతసారరత్నావళి, భాగవతసారముక్తావళిఁ రెండుపొత్తములను మాయొద్ద కంపి శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు దయాపూర్వకముగ సంస్కరింపు మనిరి. వారియాజ్ఞ శిరసావహించి యీయుత్తమగ్రంథద్వితయము నెంత త్వరలోఁ బ్రకటించిన నంతమంచిదని తొలుత భారతసారరత్నావళిని మాత్రము సంస్కరింపఁ గలిగితిమి. పూర్వముద్రణమునందుఁ బద్యములకుఁ బర్వములు, పుటలె తెలుపఁబడినవిగాని వరుససంఖ్య యీయఁబడలేదు. పూర్వముద్రణ భారతప్రతు లటులుంటచే నటులఁ బ్రచురించిరి. ఆనందముద్రణాలయమువారు ప్రచురించిన భారతము ననుసరించి యందలి పద్యముల కన్నింటికి సంఖ్యలువేసి పాఠాంతరములను క్రింద నుదాహరించితిమి. స్వల్పమగు పాఠభేదములను బరిగ్రహింపక యభిప్రాయము మార్పుగాఁగల యవసరములగు పాఠముల నన్నింటి నిందు సమకూర్చితిమి. వ్రాఁతప్రతుల తోడ్పాటుతో నింకను

గ్రంథమును సంస్కరింప నెంచితిమిగాని యాలస్యమునకుఁ బ్రకాశ కులు సహింపకపోవుటచే నింకఁ గొంతసంస్కరణభారమటులె మాపై నుంచుకొంటిమి.

ఎన్నఁడో చదివి వదలిన భారతమును బద్యములకు సంఖ్య వేయుటకై పూర్తిగఁ జదువ నవకాశము గలుగుటచేతను ఈయుత్తమ గ్రంథ సంస్కరణమునకుఁ గొంతసేవ గావించు నదృష్టము గలుగుట చేతను ధన్యులము. మాయెడఁగల ననుగ్రహావశమున నీ గ్రంథసంస్కరణభారము మాపై నిడి మాకు మహాభారతసేవ గావింప నవకాశము గలిగించిన శ్రీ శ్రీ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, ఎం. ఏ గారియెడఁ గృతజ్ఞులము.

ఇట్లు భాషాసేవకులు,

శేషాద్రి రమణకవులు,

శతావధానులు.

నందిగామ,
1—9—26



శ్రీ ర స్తు.

# శ్రీ భా ర త సా ర ర త్నా వ ళి.

## అ వ తా రి క.

---

శ్రీమచ్చెన్నపురి రాజధానికిఁ జేరిన నార్తార్కాడు డిస్ట్రిక్టు చిత్తూరను చిత్పురము చేరువనుండు కట్టమంచిగ్రామమందలి పుడమితేఁడులైన పాకనాటివంశోద్భవులగు శ్రీమాన్ రామలింగారెడ్డి పౌత్రుండును, వీరరాఘవరెడ్డి పుత్రుండును నగు సుబ్రహ్మణ్యారెడ్డి అనునేను శ్రీమదాంధ్రభారతమునందుఁగల సారతరపద్యంబులను ఈక్రిందవివరించు హేతువులంబట్టి ప్రాచుర్యము సేయఁదగినవిగా నిశ్చయించినాఁడను

శ్రీ భారతము చతుర్వేద సారవంతమై యుక్తాయుక్త పరిజ్ఞానప్రదంబై ఐహికాముష్మిక ఫలప్రదంబులకు మిగుల నుపయుక్తంబైన గ్రంథ మగుటంజేసి యది తెనుంగున ముద్రితంబై యున్నయది.

ఈగొప్పగ్రంథము భరతవంశజుల చారిత్రమయంబై అనేకోపాఖ్యానేతిహాసములతోఁ గూడియుండుటవలనఁ దదభిగర్భితములుగా నుండు ప్రవృత్తి నివృత్తి మార్గములను గ్రహింపవలయునను శ్రద్ధగలవారు ఓపికతో విశేషకాలమును వినియోగింపవలసి యుంటున్నయది. అట్లుచేయుటకు కాల దేశవర్తమానముల ననుసరించి యనేకుల కలవిగా నుండనేరదు.

ఇందువలన శ్రీ భారతాష్టాదశ పర్వములం దచ్చటచ్చట వెదజల్లఁబడి ఇహపర సౌఖ్యములకు సాధకంబులై యుండు ముఖ్యాంశంబులన్నియుఁ దేటపఱచెడు తద్గ్రంథస్థ పద్యములనే యేర్చి ప్రచురించుట లోకులకు విశేషప్రీతికరముగా నుండునని నాబుద్ధికి గోచరించినది.

ఏతన్నిమిత్తము ఏను కూడినంత శ్రద్ధ పుచ్చుకొని సాత్వికాది గుణములయొక్కయు, ప్రవృత్తి నివృత్తి మార్గముల యొక్కయు యుక్తాయుక్త విధులును వాటి సాధకబాధకములును లోకులకు అనాయాసంబుగ గ్రాహ్యమగు తెలుంగున సదరు పద్యంబుల పంచప్రకరణంబులుగా విభాగించి అందొక్కొక్క భాగంబున నడఁగఁదగిన తర

గతుల పద్యములను వాటిక్రిందఁ జేర్చి ఆపద్యంబుల కన్నింటికి ౧౮౬౩ సంవత్సరమందలి వాణీనికేతన మను ముద్రాక్షరశాలయందు చెన్నపురమున ముద్రింపఁబడియుండు శ్రీమదాంధ్రభారతమునం దుండగల పుటలనుసంయుతము నిర్దేశించి యున్నాఁడను.

ఈ తెఱంగున నేర్పరుపఁబడియుండు శ్రీభారతసారాంశరత్నావళి యను నీగ్రంథము లోకులు ఇహపరసౌఖ్యానువర్తులగుటకు ముఖ్యాధారంబుగ నుండుటయగాక విద్యార్థులగువారు నీతిప్రయుక్తవిజ్ఞానభరితులై బుద్ధివైశాల్యులగుచు సౌఖ్యార్థులగుటకు మిగుల సహాయకారిగా నుండునని నమ్ముచున్నాఁడను.



# విషయసూచిక.



పుట.

# ఈ గ్రంథమున ప్రయోగింపఁబడియుండు సంగ్రహనామములు.



| | | | |
|---|---|---|---|
| ఆది. | ఆదిపర్వము. | స్త్రీ. | స్త్రీపర్వము. |
| సభా. | సభాపర్వము. | శాంతి. | శాంతిపర్వము. |
| ఆర. | ఆరణ్యపర్వము | అను. | ఆనుశాసనికపర్వము. |
| విరాట. | విరాటపర్వము. | అశ్వ. | అశ్వమేధపర్వము. |
| ఉద్యో. | ఉద్యోగపర్వము. | ఆశ్రి. | ఆశ్రమవాసపర్వము. |
| భీష్మ. | భీష్మపర్వము. | మౌ. | మౌసలపర్వము. |
| ద్రోణ. | ద్రోణపర్వము. | మహా. | మహాప్రస్థానికపర్వము |
| కర్ణ. | కర్ణపర్వము. | స్వర్గా. | స్వర్గారోహణపర్వము |
| శల్య. | శల్యపర్వము. | ఆ. | ఆశ్వాసము. |
| సౌప్తి. | సౌప్తికపర్వము. | ప. | పద్యసంఖ్య. |

ఆది. ఆ ౧. ప 1. అనఁగా ఆదిపర్వము, ఆశ్వాసము ౧, పద్యము 1 అని గ్రహింపవలెను.



| | | | |
|---|---|---|---|
| క. | కందపద్యము. | శా. | శార్దూలము. |
| గీ. | గీతపద్యము. | మ. | మత్తేభము. |
| సీ. | సీసపద్యము. | మత్త. | మత్తకోకిల. |
| వ. | వచనము. | శ్లో. | శ్లోకము. |
| చ. | చమ్పకమాల. | కవి. | కవిరాజవిరాజితము. |
| ఉ. | ఉత్పలమాల. | ల. | లయగ్రాహి. |



## కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డి యొక్క సంక్షేప

# చరిత్రము.

ఈ భారతసార రత్నావళిని సంపుటీకరించిన యతఁడు నాతండ్రియైన కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డి. వీరు చనిపోయి యిప్పటికి 32 సంవత్సరములైనప్పటికిని వీరిపేరు ఇంకను మాజిల్లాలోను, ఇతర స్థలములయందును పచ్చగానే యున్నది. 1923 వ సంవత్సరములో జరిగిన జనరల్ ఎలెక్షనునందు మద్రాసు శాసన సభికత్వమునకు అర్థులుగా నిలిచి పోటీసల్పినవారిలో నేనును ఒక్కఁడను. ఆవిషయమున గ్రామగ్రామ సంచారము చేయవలసినవాఁడ నైతిని. ఎక్కడకు వెళ్ళినను "కట్టమంచి సుబ్బారెడ్డికొడుకు వచ్చినాడు. ఆతనికి మనము వోట్లియ్యవలసియున్న"దని చెప్పి మాతండ్రిగారి పుత్రుఁడ నను సన్మానమే కాని, నాకు వేఱుగ నాపరమైన సన్మానము తఱుచు లభించినది కాదు. ఒకానొకప్పుడు కాళహస్తినుండి నామిత్రుఁడు కోటిగారి రంగయ్యసెట్టియు నేనును మోటారు బండిలో తిరుపతికి వచ్చుచుండఁగా, మార్గమధ్యమున మేళాలు తాళాలు వాయిద్యములతో కృష్ణాపాళ్యం జమీందారుగారు వేచి యుండిరి. వారికి నాకు పరిచయములేదు. ఉత్తర ప్రత్యుత్తరములును లేవు. పిమ్మట విచారింపఁగా ఈ సన్మానమునకు హేతువు పూర్వము మాతండ్రిగారు ఆ జమీందారుగారికి కొనర్చిన మహోపకార మని తెలిసినది. వీరివలె బ్రిటిష్ ప్రభుత్వమువెనుక చిత్తూరుజిల్లాలో విమలమైన యశస్సునార్జించినవారు ఇంకెవ్వరును లేరు.

మాయింటిలో ఆంధ్రభాషాభిమానమును, కొంతవఱకుఁ బ్రవీణతయు పారంపర్యముగ వచ్చుచున్నవి. ఈ సందర్భమునఁ దొలుతఁ బేర్కొనఁ దగినవాఁడు భాస్కరశతకాది కృతికర్తయగు పెద్దరామలింగారెడ్డి. వారికృతుల నిప్పుడే ముద్రింపించి ప్రచురించుచున్నాఁడను. అవి కవిత్వధోరణిగాఁగాని లాక్షణిక సాంప్రదాయముగాఁగాని పరిశీలించిన యెడల మిక్కిలి ప్రశస్తములుగావు. అయినను కుగ్రామ మయిన కట్టమంచిలో నూతేండ్లప్పుడు ఇట్టి చిల్లరకవియు గొప్పకాళిదాసుగాఁ బరిగణింపఁబడె నేమో. వీరి వంశావళి నిటఁ బ్రదర్శించినబాగు.

పెద్దరామలింగారెడ్డి ఒక్క కవిమాత్రము కాదు. సంస్కృతము, జ్యోతిషము, మంత్రశాస్త్రము, వైద్యప్రయోగములు మొదలైనవానిని అంగోండ కృష్ణమాచార్యుల యొద్ద నేర్చికొనినవారు. మా ముత్తాతయయిన ఆ రామలింగారెడ్డి శిష్యుడు కుప్పనయ్యంగారు. వీరు చిత్తూరు హైస్కూలులో తెలుగుపండితులుగా నుండి అఖండమైన పేరును సంపాదించిరి. వారి శిష్యమండలికిఁ జేరిన వారిలో నొక్కఁడను నేను. *

మా తాత వీరరాఘవరెడ్డి కాలమునకు మాయిల్లు కడుబీదస్థితికి వచ్చినది. ఇది హిందూ సహకుటుంబ దాయభాగాచార ప్రకారము. కోళందరెడ్డికి ఇరువ్వురు కొడుకులు. పెద్దరామలింగారెడ్డి చిన్నరామలింగారెడ్డి. వీరికి ఒక్కొక్కరికి ఆరుగురు పుత్రులు. కోళందరెడ్డియొక్క ఆస్తి పండ్రెండుభాగములు కావలసివచ్చెను. ప్రతిజ్ఞాతికి లభించినది కొంచెము నేలయు నొక్కవి యహంభావమును! చిన్నరామలింగారెడ్డి యొక్క వంశము నేటికి ఇంచుమించుగ నిరవశేషము. పెద్దరామలింగారెడ్డి సంతతిలో నాలుగు శాఖలు నిలిచియున్నవి.

బీదతనము కారణముగ వీరరాఘవరెడ్డి గుమాస్తాపనిలో దిగుటయకాక నాతండ్రులకు విద్యకూడ నేర్పింపఁ జొచ్చెను. అందులో మేధాశాలియైన సుబ్బారెడ్డి ఇంగ్లీషు విద్య సయితము నేర్చుకొననారంభింపఁగా, ఇంతసాహసమా పిసికి, ఇంతగర్వమా, మించిపోవుటకు ప్రయత్నించుచున్నాడా? యని పాలివారు ప్రతికూలించి తండ్రికి కొడుకునకు నానావిధములైన కష్టములను బెట్టిరఁట. సహకుటుంబముల యొక్క అనివార్యమైన విలక్షణము ఈర్ష్య. తండ్రి ఉద్యోగి, కొడుకు చదువరి. ఈదోషములకుఁ జేయవలసిన పరిహారము లన్నియుఁ బ్రయత్నించి చూచిరికాని సుబ్బయ్యయొక్క పట్టుదల చలితమైనది కాదు. ఉదయమున చద్దిఁ దిని పుస్తకము లెత్తుకొని ఒక్కమైలు దూరములోనుండు చిత్తూరునకు వెళ్ళి వారిని వీరిని ఆశ్రయించి ఇంగ్లీషు, తెనుఁగు అవకాశము కొలఁది అభ్యసించెను. నాతండ్రికి నాకువలె క్రమమైన శిక్ష లభింపలేదు. పాపము! ఒక్కనాఁడిక్కడ ఇంకొకనాఁడక్కడఁగా

* కుప్పనయ్యంగారి సర్వలక్షణసారసంగ్రహము యొక్క పీఠికను జూడనగు.

ముక్కలు ముక్కలుగా గ్రహింపవలసిన విధి వారిది. అయినను స్వయంకృషి ప్రధానమయిన విద్యగాన్న అది చక్కగా నాటి ప్రతిదిన ప్రవర్ధమానమై నిత్యవసంతోత్సవముగ నెగడినది. వీరు ఇంగ్లీషులో ప్యాసుచేసినది ప్రొఫిషెన్సీ టెస్టు. ఈ టెస్టు నేను పుట్టక పూర్వమే యెత్తివేయబడినది కాబోలు. వారు చదివిన ఇంగ్లీషువ్యాకరణము మరేగ్రాని కృతి. నాకాలమునాటికి అది మృగ్యము. నేను 5 వ ఫారములోఁ జదువుచున్నపుడు "రామలింగం! ఏవ్యాకరణము పనికిరాదు నీకు. Murray's Grammer చదువు. అదిచాలా మంచి పుస్తకము." అని కృతముగబోధ చేసిరి. గాని చెన్నపురి నంతయు గాలించి చూచినను ఆ యాదిమవ్యాకరణము దొరకలేదు. చిత్తూరు హైస్కూలు హెడ్‌మాస్టరుల కందఱికిని మిన్నయనఁ దగు తిరువేంగడసామి నాయఁడుగారియెడ మాతండ్రికి భక్తి యెక్కువ. భయము అంతకన్న రెండింతలు. ఆ నాయఁడుగారు సర్వంకషప్రతిభులు; ఇంగ్లీషునందు సంపూర్ణపాండిత్యము; గణిత శాస్త్రములో నసమానప్రజ్ఞ; తెనుఁగు, సంస్కృతము, సంగీతము, వీణ, బెత్తపుదెబ్బలు, ఏదైననుసరే, వారుపెట్టినదే బిచ్చము. వారిదెబ్బే దెబ్బ! "చిత్తూరుపులి" (Tiger of Chittoor) అను భీకరమైన పేరు వహించినవారు. కాలేజి లెక్చరరుపనిని పుచ్చుకొమ్మన్నప్పటికిని, చిత్తూరును విడనాడ నని నిగ్రహించిరి. భూస్వాములు. వారియొద్ద చదువు నేర్చుకొనుటకు విక్రమార్కుని సాహసముండవలయును. సాహసము శ్రద్ధయు నుండినయెడల 6 నెలలలో 6 ఏండ్ల విద్యాభివృద్ధి సిద్ధము. ఇట్లు ఖండవృష్టిగ విద్యాకృషిసల్పినవారయ్యును నాతండ్రి ఆంధ్రాంగ్లేయములయందు గొప్ప పాండిత్యమును బడయఁజాలిరి.

"పరమక్లేశమునఁ జేసివడసిన విద్యల్ । స్ఫురియించుఁగాక..."

వీరి యింగ్లీషు లాలైబ్రరీ (Law Library) యంత భండారము చిత్తూరు B. A. B. L. లు ఎవ్వరు సేకరించలేదు. తెనుఁగున వీరు జేసిన కృతులే వీరి రసికత్వమునకును వివేచనకును సాక్ష్యములు.

తొలుత మాతండ్రిగారు పిత్రాచారమును బట్టి గుమస్తాపనిలో డగిరి. కొన్నియేండ్లకు జిల్లాకోర్టులో రికార్డుకీపరైరి. త్వరలో ఆపనికి రాజీనామా యిచ్చి కార్వేటి నగరసంస్థానములో మేనేజరుగాఁ జేరిగి

అక్కడి రాజుల విపరీతరాజసము తనకు సరిపడనందున దానిని వదలి ఫస్టుగ్రేడు ప్లీడరు సన్నదును సంపాదించుకొని వకీలువృత్తి నాశ్రయించి దానికిని తనకును అసాధారణమైన కీర్తిని దెచ్చిరి.

తాను కోర్టులో గుమాస్తాగా నున్నపుడు జడ్జీలుగానుండిన కాలేటుగారును, రాబర్టుగారును తనయెడ చాల అభిమానము వహించి అన్నివిషయముల పోషకత్వమును జూపిరి. చాల క్లిష్టములైన వ్యవహారములలో రహస్యముగఁ బిలిచి తన యభిప్రాయములను అడిగెడివారు. వారి యందలి కృతజ్ఞతను చూపుటకై తాను నూతనముగ సృష్టికిఁ దెచ్చిన రెండు మామిడి రకములకు కాలేటు పసందు, రాబర్టుపసందు అని నామకరణముల నిడిరి. ఈ జాతులు మాతోఁటలలో నున్నవి.

సుబ్రహ్మణ్యరెడ్డిగారి వకీలువృత్తి అనన్యసదృశము. అది యొక క్రిమినల్ కేసులో తన కక్షిదారునికి ఉరిశిక్ష ప్రాప్తమైనది. ఆనాడు మొదలు క్రిమినల్ కేసులను గైకొనుటను విడిచిపెట్టిరి. నాతో నొక్కనాడీవిషయమై మాటలాడుచు, "నాక్లయంటునకు మరణదండనయను మాటవిన్నదే నాకంఠమునకే ఉరిత్రాడు బిగింపఁబడినట్లుద్భుడనైతిని. నాడు మొదలు మనఃక్లేశము నేమాత్రమైన కలిగి పంజాలు కేసులను స్పృశింపనని వ్రతముఁ దాల్చితిని." అని నుడివిరి. ఇది నిజముగా భీష్మవ్రతము. వీరిసత్యసంధతయొక్క ప్రభావ మెట్టిదనఁగా తాను ఏపక్కను వకీలుగా నుండిన నదియే సత్యమైన పక్షమని జడ్జీలు భావించువారు. సత్య మేదికో అదికే సుబ్బారెడ్డి. కాఁబట్టి వారి పక్షమునకు అనుకూలించునట్లు తీర్పు. ఈ భావధోరణి చిత్తూరుజిల్లా జడ్జీల నావేశించి యున్నందున, ఒకానొక మహాంతుపై గొప్ప క్రిమినల్‌చార్జి తేఁబడినప్పుడు, నేను మాతండ్రిగారి ఆఫీసుగదిలో నుండగా ఆ మహాంతుగారే వచ్చి, నాతండ్రిని ఆశ్రయించి "మీరు మాపరము వకీలుగా నుండేటట్లు పేరును అర్పణచేసినఁ జాలును. మీరుకోర్టునకు రాఁబనిలేదు. వాదింపనక్కఱలేదు. నాపక్షపు వకీలు అను మాట మాత్ర ముండినఁజాలును. ఇదిగో మూఁడువేల రూపాలఫీజు. చాలదంటే ఇంకా యిచ్చుటకు సంసిద్ధుఁడను. కోరినంత యిచ్చెదను" అని చిన్నిబాలుఁడనుగానున్న నాకుసయితము దుఃఖమువచ్చునట్లు దీనతతో

ప్రార్థించినను సుబ్రహ్మణ్యరెడ్డి ప్రతిభంగమున కోర్వ నని అంగీకరింపలేదు. వీరికి ధనాశ మొదలగు దుర్గుణరాశులు పట్టినవి కావు.

అయినను మాతండ్రియొక్క కక్షిదారులలో నొకఁడును, స్నేహితులలో ముఖ్యుడును అయిన నెమ్మలి వీరాసామి రెడ్డిగారి యొక్క మనుమఁడు కుప్పుసామిరెడ్డి, ఆ వీరాసామిరెడ్డిగారు తొందర పెట్టుటచే, ఒకానొక పెద్దమనుష్యుని, అన్యాయముగా ఆరోపింపఁబడిన క్రిమినల్ దావానుండి రక్షించుటకునై, మానాయన సబ్ మెజిస్ట్రేటుకోర్టునకు ఒక్కపర్యాయము పోయిరనియు, వీరినిచూచుటతోనే మేజస్ట్రేటు ఆశ్చర్యపడి అరగంటలో విడుదలతీర్పు చెప్పినారనియు, తన తాత తనతోఁజెప్పినట్లు అనేకవివరములతో నాతో రెండేండ్లక్రిందటఁ జెప్పెను. ప్రతిజ్ఞాభంగ మేనఁట. ఫీజు పుచ్చుకొనక స్నేహితకైంకర్యముగా ఈకార్యమునకు నిర్బంధము మై పూనిరఁట.

సివిల్ కేసుల విషయములో మాతండ్రిగారి సమయస్ఫూర్తులు రెండు. ఒక్కటి చిల్లరకేసుల గ్రహించుట లేదు. మునిసీఫుల కోర్టులలో గాలుపెట్టియెరుఁగడు. రెండవది గొప్పకేసులైనను, క్లిష్టములుగా సందిగ్ధములుగా నుండఁగూడదు. విస్పష్టమైన సత్యములుగా నుండవలయును. కాఁబట్టి మాతండ్రిగారు స్వీకరించెడు కేసులసంఖ్య ఎప్పుడును స్వల్పమే. ఆర్జనలో అందఱికన్న నెక్కువ. నెలకు రెండువారముల కన్న నెక్కువగాకోర్టునకుఁ బోరు. ఇట్లు మిగిలింపబడిన కాలమంతయు గ్రంథపఠనమందును, మామిడితోటల కృషియందును వినియోగించిరి.

తన సమయములకు విరుద్ధములైన కేసులు వచ్చినయెడలచిత్తూరులో నుండు గోపాలాచార్యులు, అరుణాచల మొదలి, శ్రీనివాసాచార్యులు మొదలగు వక్కీళ్ళయొద్దకు పొమ్మని కక్షిదారుల పంపివేయుచుండిరి.

తనపలెనే వక్కీలువృత్తిలో ప్రథమగణ్యుఁడుగా నుండిన వాఁడు నరసింగరావు. కక్షికొకరైన ప్రతికక్షికొకరుగా నిలిచి వాదము చేయుచుందురు. తన పార్టీల నందఱిని కట్టమంచికిఁబోయి రాజీచేసికొనుఁడని నరసింగరావు విపరీతభాషలతో తలకెక్కునట్లు బోధచేయు

టచేతను, సుబ్రహ్మణ్య రెడ్డిగారి సద్ధర్మ ప్రవర్తనము లోకప్రసిద్ధిగ నుండుటచేతను, నాతండ్రిగారు పట్టిన కేసులలో నూటికి తొంబది వంతు వారిచేతనే రాజీకాఁబడి ఉపసంహృతము లౌను.

జిల్లాలో గొప్పగొప్ప ఆస్తుల విభాగములకు కోర్టువారు కక్షిదార్లు కలిసి నాతండ్రిగారినే పంచాయితీదారు (Arbitrator) గా కోరుకొను చుండిరి. వీరిమరణపర్యంతము యింక నెవ్వరికి యీ గౌరవము లభించినదికాదు. తాను చావుపడకలో నున్నప్పుడు సైతము, పాళైగారు చెంగమనాయుడుగారి 5 లక్షల ఆస్తిని కొడుకులకు నిర్వివాదము రీతిని పంచిపెట్టుటయుగాక వారిసమ్మతిపై మిడిల్ స్కూలు నొక్కదానిని నగరిలో స్థాపించి తగిన మాన్యముల నేర్పఱచిరి.

తనకక్షిదార్లపట్ల తాను చూపువర్తనమును అనన్యసదృశము. పైనఁ జూపబడిన విశేషములనుబట్టి వీరియొద్దికి వచ్చువారు చాల మంచివారుగా నుండువారేగాని అల్పులుగార నుట స్పష్టము. మా యింటిలో భోజనము చేయఁగలవారెల్లరు మాయతిథులుగానే యెన్నాళ్లైనను సరే, యెన్ని పర్యాయములైనను సరే ఉండవలయును. కాళహస్తి, కార్వేటినగరము రాజులు, లాడ్ కృష్ణదాసుగారు, బ్రాహ్మణులు మొదలగువారికి ఊరి సత్రములో అన్ని సౌకర్యముల నడిపి సిబ్బందితో అతిథులుగా సన్మానింతురు. ఇది చాల పెద్ద ధర్మశాల. ఇప్పుడీ సత్రము వాడువారు లేక శిథిలమై పోయినది.

రెండవది క్రమమైన ఫీజును మాత్రము గ్రహించుట. చిత్తూరులో పూర్వము అగ్రగణ్యులుగా నుండినవారు కోటావారు. వైశ్యులు. వారింటివారు మాతండ్రియొక్క ధర్మగుణములఁగూర్చి నాతో ప్రసంగించెడివారు. ఒకానొకప్పుడు నాతండ్రిగారు కష్టపడి వారికి 5,000 రూపాయలు చెల్లునట్లు చేసిరి. వారు సంతోషపడి అధికమగు ఫీజు ఈయ రాఁగా, "క్రమవేతనముకన్న నెక్కువగాఁ గైకొన్నచో అది భిక్షముతో సమానము. నిజమైన వక్కీలు బిచ్చగాడు కాదు. ఆర్జితమునకన్న నెక్కువ పుచ్చుకొనను" అని నిరాకరించిరి.

మూఁడవది బలాఢ్యులచేత హింసింపఁబడు బీదలకు ఉచితముగా సహాయముచేయుట. ఈ తరగతికి చేరినవాఁడే పూర్వము

పేర్కొనఁబడిన కృష్ణాపాళ్యం జమీందారు. పాలివారు అన్యాయము చేసి ఇల్లు వెడలఁ గొట్టఁగా అయిదేండ్లు అన్ని కర్చులు భరించి కేసు జయించి వారిభాగము వారి కిప్పించుటయగాక ఫీజు పుచ్చుకొనలేదు. 1923 వ సంవత్సరపు ఎలెక్షనులో నన్ను జూచునప్పటికి ఆజమీందారుచాల వయస్సు చెల్లిన ముసలాయన. అట్లుండియు ఊరేగింపుగా నన్నును కోటిగారి రంగయ్య సెట్టిని ఇంటికి పిలుచుకొనిపోయి, దానే స్వహస్తములతో వడ్డించి, "మీతండ్రి పెట్టిన భిక్ష నాయనా! నీ కుండెడు సొంతము ఈయింట్లో నాకులే" దని చెప్పి, "నీ కెవరైనా వోట్లియ్యకుంటే తలపగులఁగొట్టిస్తాను, భయపడవద్దులే, సుబ్బారెడ్డికొడుకునకు లేని వోట్లు ఇం కెవ్వరికి" అని పరమానందభరితునిఁ జేసి నన్ను సాఁగనంపిరి.

ఇంక కక్షిదార్లుగ వచ్చినవారెల్ల స్నేహితులుగ నిలిచి రని వేఱుగఁ జెప్పవలయునా; మాతండ్రికి లభించినంత స్నేహిత సంపత్తు ఎవ్వరికి నుండదు.

లాడ్ కృష్ణదాసు, ఆనరెబిల్ పాలవాయి రంగయ్యనాయుఁడు మున్నగు ఘనులను పేర్కొనఁ బూనిన ఆత్మ ప్రశంసగ నుండు నేమో? ఆత్మప్రశంస ఆత్మహత్య తుల్యము. కావున సామాన్యులను కొందఱిని నిదర్శన ప్రాయముగ పేర్కొనెదను. (1) అరికెలపాడి మునిసామిరెడ్డి. వీరి అభ్యంజనస్నానము పిల్లవాండ్ర మయిన మాకు ఆశ్చర్యము కలిగించునది. వేళ్లుపెట్టిన ఖతుక్కని తునుగఁ జేయునంతటి వేఁడినూనెను ఉద్ధరణితో నెత్తి తలమీఁదఁ బోసికొనుచు ఒక్కగంట సేపు తలను దేహమును పట్టించుకొను చుండెడివారు. స్నానమైన తోడనే రెండుగంటల నిద్ర. (2) నెమ్మిలి వీరాసామిరెడ్డి. వీ రింకను సజీవులై యున్నారు, చాల మంచివారు. వీరికి భాస్కరుని నన్నును చూడవలయునను భ్రమ పెద్దది. మనుమఁడైన కుప్పుసామిరెడ్డి ద్వారా పదింబదిగ తండ్రివలె మమ్ము విచారించుచున్నారు. (3) కోటిగారి మునిసామి సెట్టిగారు. కాపురస్థలము తిరుపతి. మొట్టమొదట కక్షిదారుగా వీరు మాగృహప్రవేశము చేయుట నే నెఱుంగుదును. కొంతకాలమునకు నా తల్లిదండ్రుల మిత్రమండలిలో ప్రథములైరి. మా యక్కయొక్కయు, అన్నయొక్కయు వివాహములు విచారణకర్త

టుగ దగ్గఱనుండి నడిపిరి. నన్ను అప్పు డప్పుడు తిరుపతికి బిలుచుకొని పోవుచుండెడివారు. స్నేహ మిట్లు బంధుత్వమునకన్న నెక్కుడుగ ముదిరియున్నను మాతండ్రియందలి భక్తి లేత కాలేదు. వీరు పేకాట యందు చాలప్రియులు. మాతండ్రిచే నది అష్టమవ్యసనముగ నిరసింపఁ బడుచున్నందున వారికి తెలియకయ ఆయాట నాడెడివారు. (4) చిత్తూరు కాకర్ల రామయ్యసెట్టి. ఈయన మాతల్లిగారికి మంత్రియట్లు పనియున్నను లేకున్నను ప్రతిదినము మాయింటికి వచ్చి గృహవిచారణ చేసి కావలసినసరకులఁ దీసి పంపెడివారు. వీరును కోటిగారి రంగయ్యసెట్టియు ఇంటిపెత్తనగాండ్రు. నాతండ్రి సాంసారికచింతల పెట్టుకొనరు గావున, ఇట్టి మిత్రులసాహాయ్యముతో తల్లిగారే గృహభారము నిర్వహించుచు వచ్చిరి. (5) వీరందఱికిని స్నేహభావమున మిన్నయైన వారు మణియం సుబ్బయ్య యను బ్రాహ్మణులు. అరవవారు. మాయూరుచేరి కొన్ని సంవత్సరములు నాజ్ఞాతులలో నొక్కనికి ప్రతిగ మణియము చేసిరి. పిమ్మట ప్రైవేటు వక్కీలుగా కుదిరి తనకు కావలసినంత మితశ్రమతో నార్జించుకొనుచు సుఖజీవన కళాకోవిదులై యుండిరి. వీరును వీరిభార్యయు నాతల్లిదండ్రులకు ప్రాణస్నేహితులు. మాయింటినుండి ప్రతిదినమును కూరగాయలు మొదలగు సరకులు వారింటికి యెగుమతి; వారియింటినుండి మంచి వంటలు మాయింట దిగుమతి. సుబ్బయ్యగారు ఆకారమున ఏనుఁగుతల లేని విఘ్నేశ్వరులు. పొట్ట ఉల్లాసముతో ఉబికి దూఁకులాడునది, చాల పెద్దది. భోజనప్రియులు. పాపము! ఇంకేచింత లేనివారు. భక్తి, భుక్తి యివిరెండే వారిజన్మ ప్రపంచపు ధ్రువనక్షత్రములు. ఒకనాడు మాతండ్రితో ముచ్చటించుచు "ఆకలెక్టరు రెండువేల రూపాయలు తీస్తాడు. లాభమేమి? సుఖమేమి? నేను తినునంత వాఁడు తినఁగలఁడా? చెఱుకుగడను కఱకఱ మని నమలి తినఁగలను నేను. ఈవయ్సున! డబ్బుంటే యేమి ఫలము? సుఖమును అనుభవించే శక్తి యథాక్రమముగ నుంటేగద" అని తమ జీవితకళాసూత్రమును వెల్లడించిరి. ఆసుబ్బయ్యవంటి నిష్కల్మషచిత్తుఁడు, విశాలహృదయుఁడు యింకొకఁ డుండఁడు. తన సంపాదన యెక్కువగాదు. అందులో అమ్మవారు ఎంత వితరణగా వాడినను తమకై మిగులునది తక్కువ, ఆకొంచెమును ధారాళముగ

దానముచేసి "శివశివ" యని భగవన్నామస్మరణ సదాచేయుచు, తెల్లని జుబ్బా, తెల్లతలగుడ్డ, ఎఱ్ఱనిరుమాలు, తెల్లధోవతి ధరించి, మార్గములోనుండు విఘ్నేశ్వరునికి నమస్కరించి ఏదైన నేడు దేవునిదయ వలన కోర్టులో దొరకునా యని చిత్తూరునకు పోవుచుందురు. పిల్లల కందఱకు వారిని చూచినఁ బరమానందము.

వీరియొక్కయు, మాతండ్రియొక్కయు దైనందినచర్యలు ద్వంద్వసమాసములు. ఉదయము 5 గంటలకు లేచి, కాల్యకృత్యముల దీర్చి మణియము సుబ్బయ్యగారు వేదపారాయణము బిగ్గరగాఁ జేయుచు (వేదపారాయణమో కాదో నాకు తెలియదు. ఏదో సంస్కృతభాషాఘోష) మాయింటి అరుగుమీఁదగ వచ్చి కూర్చుందురు. ఆయరుగు నాతండ్రియొక్క పడకగదికి సమీపము. ఆదీర్ఘారావములు చెవినిఁబడగానే సుబ్రహ్మణ్యరెడ్డి లేచి ఎఱ్ఱని చిన్నదస్సుగుడ్డను (duster cloth కాఁబోలు) తలకు చుట్టుకొని, జుబ్బాను ధరించి వారితోఁ గలిసికొని, లౌకికసంభాషణలు సేయుచు తోఁటకుఁ బోదురు. మాకు తోఁట లనేకములు. దూరపుతోఁటలకు బండిలో ప్రయాణము. దగ్గఱవానికి నడిచి సుమారు 7 గంటలవఱకు తోఁటలో తిరిగి 7½గంటలకు ఇంటికి వత్తురు. పిమ్మట అయ్యగారు ఇల్లుచేరుదురు. రెడ్డిగారు కచ్చేరిపనికి దిగుదురు. పదిగంటలకు భోజనము. కోర్టుకు పోవుండినచో ఆమీఁద విశ్రాంతి కొంతసేపు. పిమ్మట భారత భాగవత పఠనము. సాయంకాలము మరల కచ్చేరి. రాత్రి 7 గంటలకు భోజనము. తదుపరి యేవ్యవహారచింతయుఁ గూడదు. భారత భాగవత పారాయణము. ఆపారాయణకు మణియము సుబ్బయ్యగారు, కోళంద రెడ్డిగారి తండ్రి రామయ్యగారు, అతిథులుగా నుండు కక్షిదార్లు, అందఱు సభగా సమావేశ మగుదురు కొంతవయస్సు వచ్చినవెనుక పాఠకత్వము తఱచు నాపనిగా నుండెడిది. 12 సంవత్సరముల వయస్సునకే భారత భాగవతముల ఎక్కువ గజిబిజిలేక చదువఁగలట్లు నాతండ్రి నన్ను తేర్చిరి. తన యితరకొడుకులకన్న నేను అర్థజ్ఞానముతో చదువువాఁడననియు, పదాది విభాగములను అన్వయసౌలభ్యము కలుగునట్లు చేయుదుననియు, వారి వాత్సల్యజనిత భ్రమ. చదువు పద్యములసంఖ్య కొంచెమే, వానిపైన నడచు వ్యాఖ్యానములు, వాగ్వాదములు మెండు.

ముఖ్యముగా కోళంద రెడ్డిగారి పెద్దనాయన, వేంకటసామి రెడ్డి, మాతండ్రి వేదాంతములు భారతములోనే ననియు, ఆకాలమువారును బాగుగ తిని కండక్రొవ్వెక్కి భోగపరాయణులుగా నుండిరే కాని శుష్కసన్న్యాసులు గా రనియు, పెద్ద కేకల వేయునపుడు మా కందఱికి ఆపరాని నవ్వుగా నుండెడిది. తక్కినవారు మాతండ్రి చెప్పినదే వేద మని ఊఁకొట్టువారు. మణియము సుబ్బయ్యగారు 'అమితాహార మనే దిలేదు. కడుపుపట్టేదానికంటే నెక్కువ నెవఁడు తినలేడుగదా! కాఁబట్టి అది తామసక్రియలలో చేరదు.' అని తమకు కావలసిన వికల్పసూత్రమును మాత్రము సమర్థింతురు. రామయ్య రెడ్డిగారు మాంసాహారప్రియులు. వారివాద మేమనఁగా "ఒక్క భీముఁడేగాదు, ధర్మరాజుఁగూడ మాంసము తినేవాఁడు. ఆకాలమున అందఱు తింటూ వచ్చిరి. అది తింటేనేగాని నిజంగా హిందూధర్మం చెల్లదు. ఈయొక్క విషయంతప్ప తక్కిన దంతా సుబ్రహ్మణ్య రెడ్డిబోధించునట్లే;" అని మాంసాహార నిషేధము సరిగా దందురు. రాత్రి 9, 9½ గంటలకు సభ ముగియును. వారివారి పడకలకు వారు పోదురు.

మామిడిపండ్ల కాలములో ఈధర్మవిచారణలతో ననుపానముగ మంచి మామిడిపండ్లను కోసి తినుచు వాని తారతమ్యచర్యలను నడు పుదురు. "ఒరే ముట్టెలలో నుండే రుచి చెంపలలో లేదురా! చూడండి ముట్టెను ఎట్లా తింటానో" అని మా మణియము సుబ్బయ్యగారు ముట్టెను చవులూరు నట్టు చప్పరించుటయే గాదు, ఖటుక్కని కొఱుకుటయు చూచి హర్షధ్వానములు చేయుచుంటిమి. మామిడి విత్తులను నాటితి మేని మొలకెత్తి, చెట్టయి 5, 6 ఏండ్లకు కాయలు కా యును. ఈకాయలు విత్తుయొక్క మాతృవృక్షపుకాయ లట్లుండవు. అందుకనే విత్తువేయక అంటుఁ గట్టవలసినవిధి. విత్తులనుండి యేవేవో నూతనరకములు కలుగును. ఇందులో 100 కి 99 నిష్ప్రయోజనములు. పరిపూర్ణమయిన మామిడిపండుయొక్క సాముద్రికలక్షణము లివ్వి. మంచిరంగు; పలుచని సున్ననితోలు, నార లేకుండుట; చిన్నముట్టె, ఘనమును బిగువును నైనకండ; మంచివాసన; మంచి రుచి; ఆలస్యముగా కాయ పక్వమునకు వచ్చుట; (అప్పుడే దానికి మంచివెల). నాతండ్రికి డార్విన్ గారిచే ప్రసిద్ధపఱుపఁబడిన "సహజవికృతి" న్యాయము

(Spontaneous variation) తెలియదు. వినికూడ నెఱుఁగరు. అయి నను సహజమైన వివేకమును ప్రయోగించి, ఆన్యాయముయొక్క ప్రయోగమును గ్రహించి, విత్తునుండి మొలిచెడు చెట్టులో ఏదయిన నూతనఫలము వచ్చునుగదా! అదృష్ట ముండిన మంచి క్రొత్తజాతి యేల యుద్భవింపరాదు? అని వితర్కించి, పరీక్షార్థము విత్తులను నాటి ఆచెట్టు ఫలించువఱకు వేచియుండి, ఆపండ్లను మాయూరి సభలో కోసి, తిని చర్చించి, —ఈకార్యమునకు ప్రధానమంత్రి రామారెడ్డిగారు. వారుతప్ప నింకెవ్వరు ఈనూతనసృష్టులను కోసి నివేదింపఁగా నేఁ జూచి యుండలేదు——మంచిదని నిర్ణయింపఁబడినయెడల దానికినామకరణము చేసి, ఆచెట్టునుండి అంటుకట్టి ఆజాతిని నిలుపుదురు; వ్యాప్తికిఁ దెత్తురు. తక్కినవానిని నిర్మూలము చేయుదురు. ఇట్లు అనేకసంవత్సరములుగా ఓపికతో పరీక్షలు సలిపి సలిపి నాకుఁ దెలిసినమట్టునకు అయిదు నూతనజాతులను సృష్టింపఁగలిగిరి. (1) రాజాపసందు; కాయ గుండ్రము, మల్గోవాకన్న రెండింతలు పెద్దది. మంచి రుచి. కాయ పెద్దది. కాడసన్నము. కాని కాయుట తక్కువ. గాలికి నిలుచుట కష్టము. నిలిచినకొన్నియు ప్రశస్తములు. (2) రెడ్డి పసందు. కాయ పెద్దది. చర్మము ఘనమును గడుసును. రంగు వికారము, అనాగరకము చూచుటకు. రుచి మంచిది. (3 & 4) రాబర్టుపసందు, కాలేటు పసందు. గుండ్రములైన మేలిమిరకములు. (5) భోగం పసందు; చూచుటకు మంచిరంగుతో నాణ్యముగా నుండును. రుచి మంచిది కాదు. వినోదార్థము కొన్ని చెట్లుమాత్రమే వేసిరి.

కోర్టునకు పోక మిగిల్చిన కాలమునంతను భారత భాగవతములకు మామిడితోఁటలకు వినియోగించిరి. రెంటను బ్రసిద్ధిఁ జెందిరి.

మణియము సుబ్బయ్యగారు పార్శ్వవాయు వ్యాధిచే పీడితులై తమ దేశమునకుపోవుట నాతండ్రికి శాశ్వత దుఃఖకారణ మాయెను. వారు బ్రాహ్మణులు; మేము శూద్రులము. ఏభేదములేక సహకుటుంబ మట్లుంటిమి.

చిత్తూరులో నారాయణయ్యంగార్లు అను వైష్ణవ బ్రాహ్మణులు పూర్వము డిస్ట్రిక్టుమునిసీఫుగా నుండిరి. వారికి మాతండ్రికి సంపూర్ణమయిన మైత్రి యుండెను. వారు చనిపోవునపుడు భార్య

కనకమ్మ. కూతురు కమలమ్మ. వీరికి, మాతండ్రిగారిని గార్డియన్‌గా నియమించిరి. భార్యను కూఁతురిని చెన్నపట్నము ఎళుంబూరిలోనుంచి తన మరణపర్యంతము వారి కెట్టికొదవయు లేకుండునటు తల్లిదండ్రుల కన్న నెక్కువగా రక్షించిరి. వారికై సంవత్సరమునకు రెండుమార్లు పట్నము పోవుచుండిరి. వారు పోవునప్పుడెల్ల నన్నును పిలుచుకొని పోవుచుండిరి. ఒక్కొకప్పుడు మాయక్కయువచ్చును. ఒకానొకప్పుడు కమలమ్మయు మాయక్క సుందరమ్మయు తా ముండుగదిలోనికి నన్ను రావలదనఁగా బాల్యవిపరీతకోపినై కొరడాతో వా రిద్దరిని కొట్టితిని. మాతండ్రితో చెప్పుకొనిరి గాని వారు న న్నేమియు ననలేదు. నే నెప్పుడు తండ్రితో నుండువాఁడను. వారికిని నాయందు ప్రీతి యెక్కువ. ఘటికుఁడనను నభిమానముకూడ. కాఁబట్టి కనకమ్మగారు నన్ను "మంత్రి"యని కించిద్ధేళనముగ పిలిచెడివారు. సుబ్రిహ్మణ్యారెడ్డి చనిపోయినపిమ్మట వారి వ్యవహారములలో చాల చిక్కులు వచ్చినవి. నేను 1902 వ సంవత్సరములో కేంబ్రిడ్జికి పోక ముందు పెంపుడు సహోదరియైన కమలమ్మనుచూచిసీమనుండి వచ్చిన తోడనే నాసమీపముననే ఆమెకు గృహమేర్పఱచి శక్తికొలది చూచుకొందు నని నమ్మిక చెప్పి ఓదార్చిపోయితిని నాదురదృష్టము, ఆప్రీతికార్యమును చేయనిచ్చినదికాదు. నేను వచ్చుటకు ఒక్కయేఁడు ముందు కమలమ్మగారు మరణించిరి ఆమెకుపూర్వమే తల్లి కనకమ్మయు తరలి పోయెను. ఈబ్రాహ్మణ కుటుంబమునెడ ప్రీతియు గారవముఁ దాల్చి మేమెంతయో చేసితిమిగాని, మనసు కోరినంత సుఖము సంపాదింప జాలమైతిమి. మాయింటిలోని ప్రతిశుభకార్యమునకు వారురానిది జరుపనెంచము. వారి కష్టసుఖములన్నియు మాయవిగా నెంచి మైత్రి నెఱవేర్చితిమి. చావుతో మాకు వియోగము సంభవించెనుగాని మాయెవరివలనను ఆమైత్రికి ఒక్కక్షణమాత్రభంగమైన రాలేదు.

కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డికి దైవభక్తి యెక్కువ. దానితోఁ బాటు ఛాందసములును.

ఫొటోగ్రాఫు తీయించుకొనిన ఆయుఃక్షయకరమని తనపటమును తీయనీయలేదు. వీరివలెనే మా చిన్నాయన రంగారెడ్డియు ఆకృతిపటమును తీయించుకొనకయ చనిపోయెను. ప్రతిబింబము

తీయించిన బింబమునకు హానియఁట! మానాయనకు గుఱ్ఱముల సంచుటయు ఆక్షేపణీయము. ఆయోగము రాజులకేగాని యింకెవ్వరికిఁ దగదు. తనగ్రంథములో రెడ్లను పుడమిఱేఁడు లని సంభావించి యున్నాఁడు. గుఱ్ఱములు కూడదనియు ప్రకటనే! తాను ఒంటెద్దు బండిలో నెన్నఁడుఁ గూర్చుండఁడు. అదిపాపము. మఱేవాహనత్వము చెల్లు ననఁగా తెల్లని రెండెడ్లబండి. తనకు ఆనుకూలించురీతిని పెద్దవిల్లు బండిని కట్టించి దానికి పెద్ద తెల్లనియెడ్లరెంటిని బూన్పించి అందులో రాకపోకలు చేయుట వారిపద్ధతి. నాదత్తుతండ్రి రామస్వామి రెడ్డికి గుఱ్ఱముల మీఁద వ్యామోహము ఎక్కువ. నాకుఁ దెలిపి ఒకదాని వెనుక నొకటిగా మూఁడు గుఱ్ఱములఁ గొనెను. కొనినప్పుడెల్ల అన్న గారియొద్ద క్షమార్పణార్థము కల్లసమాధానములు చెప్పుచుండును. మూఁడవగుఱ్ఱమును కొనినప్పుడు వేలూరులో (వారు వేలూరిలో వక్కీలుగానుండిరి) ఇంజనీయరు తనకు ఇనాముగా బలవంతపఱచి ఇచ్చి నాఁ డని సమ్మోహనాస్త్రము వేసినాఁడు గాని, దానివలన పెద్దాయ నకు కోపము రెండింతలై నాయెదురుగనే మాచిన్నాయనను, అప్పటికి 38 ఏండ్లవానిని, చెడదిట్టినాఁడు. ఈమంగళాశాసనములైన వెనుక మాచిన్నాయనయు నేనును మేడమిద్దెమీఁదికిపోవుచుండఁగా నే నూరక యుండక చనువుచేత కలిగిన చాపల్యముమై "చిన్నాయనా! చిన్నాయనా! నిన్నుమానాయన బాగాతిట్టినాఁడే" అని యంటిని. మాచిన్నాయన నవ్వుచు "అవి తిట్లుకాదురా తమాషామాటలు" అని త్రోసివుచ్చెను. ఆకాలపు అన్నదమ్ముల సౌహార్దము నేఁడుకలదా?

రామస్వామిరెడ్డి రాజసగుణుఁడు. సుబ్రహ్మణ్యరెడ్డికి సత్త్వ గుణ మెట్లు ప్రధానమో తమ్మునికి రజోగుణ మట్లు. వారికిని నాయందు ప్రాణసమానమైన ప్రీతిగావున అప్పుడప్పుడు నాచదువు ఎట్లువునను విచారణలేకయ వేలూరునకుఁ బిలిచికొనిపోయి మాసములకొలఁదిఉంచుకొనువాఁడు. అక్కడ నాకు మిఠాయిపొట్లములేమి, భోగమువాండ్రువచ్చి స్నానముచేయించి నయముగా నొప్పిలేనివిధమున తలదువ్వుటలేమి, చాల బాగుగ నుండునది కాలము! విరించిపురము కోవెలకు మాచిన్నాయన ముఖ్యధర్మకర్త. అక్కడకు వెళ్లినప్పుడెల్ల బ్రాహ్మణ ఫలహారములు, పసిబిడ్డగదా యని దేవదాసినులు చేయు

పరిచర్యలు ఇవన్నియు దట్టముగా పడుచుండెను. మాతండ్రి కీవిపరీతములు తెలియుటతో వేలూరునకు పంపుట మానివేసిరి. తొమ్మిదవ సంవత్సరప్రాయానంతరము ఈ రాజభోగములన్నియు నిలిచిపోయి సత్వగుణముల నభ్యసింపవలసిన కర్మము జెందిన వాఁడనైతిని.

కవిత్వము మహాసాహసకార్య మని నాతండ్రికి భయము. ఒక విధముగఁ జూచిన నిజమేకాని వారికాతణము వేఱు. విషగణములు పడి యెవరికే చేటు వాటిల్లునో యను వెఱపు పెద్ద. తెనుఁగులో నాకుండు పాటవమును జూచి వీఁ డెప్పుడు కవిత్వరచనకు ప్రారంభించి నాశనమగునోయని దిగులుచెందుచుండును. సాక్షాత్తు తనయొక్క కంఠస్వరముతోనే తానుచదివెడు మాడ్కినే భారతమును నేను చదువునప్పుడు పరమానందమును, ఈ తుంటరి కవిత్వమును మొదలు పెట్టి ఇల్లు గూల్చునో యను సంశయమును చనిపోవువరకుఁ దాల్చియుండెను. కవిత్వమనఁగా మరణయోగములలో నొకటి !!

ఇంక శకునములు మొదలగు పారంపర్య ఛాందసముల సంగతి చెప్పవలయునా! పిల్లి, కుక్క మొదలగు అన్నిజంతువులును, జ్యోతిశ్శాస్త్రములోని గ్రహములట్లు. మనుష్యజీవితమును ఆదేశించుచు శాసించుచు నిర్మాణమునకుఁ దెచ్చినవి. బ్రాహ్మణులు వారికి భూదేవతలు. ఎన్నితప్పులు ఎన్ని పాపములుచేసినను పూజనీయులే. పంచాంగము అయ్యవారు జీవితయాత్రకు మార్గదర్శి, అనఁగా త్రోవ చూపువాఁడు. "లగ్నాలు నిజమైతే ముండ మోపులెట్లయిరి." అని వేమన యొక్క ప్రశ్న. అట్టి లగ్నములు నిజములుకా వని నాతండ్రియొక్క సమాధానము !

దైవభక్తి, సత్వగుణము, ఇవి వీరికి వెన్నతోవచ్చిన వరములు. చిన్నవయస్సుననే మాంసాహారముమానిన జీవహింస మానునని—

ఉ॥ మ్రాన్ననుఁ రాతనుం గలదె మాంసము ప్రాణులమేనఁగాక య
మ్మేనుల నొంచునట్లు తమమేనులసోకినమాత్ర నెట్లగుం
దానిఁ దలంపఁగావలదె తా నది మానిన హింసలన్నియుం
మానవె యంచు నుత్తముఁడు మాంసముమాను దయార్ద్రచిత్తుఁడై.

భారతమున విని మాంసాహారమును విసర్జించెను. వీరికిముందే మాతల్లి నారాయణమ్మ వదలిపెట్టెను. వీరినిజూచి మాపినతండ్రులు పిన్నమ్మలు అందఱు శాకాహారవ్రతమును బూనిరి. మావేలూరు చిన్నాయనమాత్రము మఱుగుగాకోడిగ్రుడ్లు సకృత్తుగా ఔషధముగా తినెడువాడు. ఔషధముగా మాంసము పుచ్చుకోవచ్చు నను మాతండ్రియు నొప్పుకొనుచుండెను గాన అది వ్రతభంగముకాదు. సూర్యగ్రహణము, చంద్రగ్రహణము, ఇత్యాది పర్వదినములలో అనేకపర్యాయములు స్నానములుచేసి పితృతర్పణము విడిచి, భారతపారాయణము చేయుదురు. అందును ముఖ్యముగా అరణ్యపర్వములోని తీర్థప్రశంసాఘట్టమును. తాను అలసినప్పుడు నేను, నాగొంతు కీచైనప్పుడు వారు, ఇట్లు మార్చి మార్చి పుణ్యమును ప్రోగుచేసితిమి. తల్లియైన జ్ఞానమ్మ (అనఁగామాయవ్వ) చనిపోయినప్పుడు గోదానాదులవిశేషముగాఁజేసి బ్రాహ్మణులకును తనకును మన స్తృప్తి కల్పించుకొనిరి. ఈతృప్తి కృత్రిమమో యథార్థమో ఎవరు నిర్ణయింపఁగలరు? కట్టమంచి చిన్నయూరు. దేవాలయములుమాత్రము మెండు. చోళులచే ప్రతిష్ఠింపబడిన శివాలయ మొక్కటియున్నది. అది మిక్కిలియు పెద్దది. అందలి విగ్రహాదులు మనోహరములు. మణియము సుబ్బయ్యయు వీరును తరుచు సాయంకాలముల నచ్చట గడుపు చుందురు. ఆదేవళము శిథిలతకు వచ్చుచుండుటజూచి, మాతండ్రులుమువ్వురు, ఆస్తిలోనుండి పదివేలరూపాయలు కర్చుపెట్టి గాలిగోపురముతక్క తక్కిన యావత్తు భాగములను సంపూర్ణముగా బాగుచేయించిరి. కొళందీశ్వర కామాక్షమ్మ విగ్రహములను ధాన్యములో పాతిపెట్టి, కట్టడపుకార్యము ముగింపునకు వచ్చినపిమ్మట కంచినుండి వేదవేత్తలైన బ్రాహ్మణశ్రేష్ఠులను రప్పించి యజ్ఞములు చేయించి, పిమ్మట, దైవతములను అష్టబంధనాది కృత్యములతో పునఃప్రతిష్ఠింపించిరి. ఈకార్యము నిర్విఘ్నముగ కట్టమంచిలో యథార్థబ్రాహ్మణుఁ డని పేరువడసిన గురుకులము కుప్పయ్యగారి విచారణక్రింద, 1905వసంవత్సరములో జరిగెను. ఆయజ్ఞశాలలోనే ఒకానొక బ్రాహ్మణమిత్రుఁడు నన్నుఁజూచి "మీనాయనయొక్క పుణ్యము పరిపూర్ణమైనది. ఇంక వారు త్వరలో భావముతో కైలాసపదవి నందుదురు." అని గౌరవ గుటిచెప్పెను.

మఱుచటి సంవత్సరము డిశంబరు నెల 6 వ తేదిని నాతండ్రిగారు స్వర్గస్థులైరి.

కంచి వరదరాజస్వామి నామాంకితమయిన విష్ణ్వాలయము ఒకటియున్నది. మాయింటివారు శివమతము అనిపేరు గలవారుగాని వీరు కొలువని దేవతలు లేరు. మాకు దేవతలందఱు సమానాదరణ పాత్రులే. ఈ విష్ణుగుడిని బాగుచేయ నారంభించిరిగాని కార్యము ఎక్కువగ కొనసాగకముందే విగతజీవులైనందున, దానిని, చిన్ననాయన రంగారెడ్డిగారు నిర్వహించి ముక్కాలు మువ్వీసము పూర్తి చేసిరి. ఆకొదవను తీర్పవలసిన భారము మాది.

1892వ సంవత్సరమునందే, వేలూరుచిన్ననాయన, రామస్వామి రెడ్డిగారు 42 సంవత్సరముల వయస్సున చనిపోయిరి. వారు ధన సాహాయ్యము తప్ప ఈ దైవకైంకర్యములలో నింకేదియు చేయఁజాల రైరి. 1896వసంవత్సరములో నాతండ్రి మరణించిరి. అప్పుడు వారి వయస్సు ఏబది. కడగొట్టు చిన్ననాయన రంగారెడ్డి షష్ఠిపూర్తిననుభవించి 1913వ సంవత్సరములో దివంగతులైరి.

మాతండ్రిగారు శ్రీరామభజనమందిరమును స్థాపించిరి. శాస్త్రోక్తముగా లిఖింపబడిన పటమొకటి కార్వేటినగరమున రాజుగారు తన కిచ్చి సంభావించిరి. కొన్నినెలలకు నాయన్నయైన నరసింహారెడ్డి జ్వరగ్రస్తుడయ్యెనట. ఆపటమునకుఁ బూజయు నైవేద్యము లేనందున ఈ వ్యాధివచ్చె నని కుప్పనయ్యంగార్లు గుఱిపలుకఁగా, తత్క్షణమే భజనకు ఏర్పాటు చేయునట్లు మ్రొక్కుకొని కొంతకాలమునకే గొప్పమందిరమునుకట్టించి శ్రీసీతారాములపట్టాభిషేకపటమును అందు స్థాపించిరి. మాయూరిలోని పాఠశాలయు అందే నడుపబడుచున్నది. నేను పరీక్షలలో జయమునందినప్పుడెల్ల విశేషనైవేద్యములతో పూజ చేయుటకునై నాడు రెండురూపాయ లిచ్చుచుండురు. ఊరిపిల్లల నందరినిఁ జేర్చి వారి కాఱినువస్తువుల నిచ్చి కృతకృత్యుఁడ నౌచు నుంటిని.

తమ్ముడైన రామస్వామిరెడ్డి ద్వారమున నాగప్రతిష్ఠఁ జేయించెను. మఱియు విఘ్నేశ్వరుని గుడి యొకటి కట్టించెను. దేవపూజ

లన్నియు క్రమముగా నడచునట్లు విచారించుకొనుచు మా గ్రామములో ఋజువర్తనము నుద్ధరించుచుండెను.

వీరు ప్రచురించిన గ్రంథములు రెండు. భారతసార రత్నావళి, భాగవతసార ముక్తావళి. సొంతకవనముపొంతఁ బోఁగూడ దను నియమము దాల్చినవారగుటవలన, నీసంపుటీకరణములతోఁ దృప్తిఁ జెందిరి. ఈగ్రంథముల ప్రాశస్త్యమును గుఱించి నేను చెప్పబూనుట సమంజసముగానుండదు. ఆపనిని పండితులకు సమర్పించుచున్నాను. సాంప్రదాయానుసారముగా ప్రధాననీతులని తోఁచినవానిని ప్రోగుచేసి, వర్గీకరించి భారతసారమును తొలుత 1885 వ సంవత్సరములో ప్రచురించిరి, పిమ్మట మూఁడేండ్లకు భాగవతసార ప్రకటన. భారతముయొక్క నిజమైన సారమేది యను నంశము నానా మహాగాథ విమర్శనలకు ప్రకృతము లక్ష్యమైయున్నది. అయినను జన బాహుళ్య మెయ్యది దానియొక్క నిజతత్వమని యెంచుచున్నదో దానిని సుబ్రహ్మణ్య రెడ్డి గారు సంపూర్ణముగను, విశదముగను, వర్గీకరించి ప్రదర్శించినారు. భాగవతముయొక్క నిజమయిన భావమునుగురించిన అభిప్రాయభేదము లంతగా లేవు. కొందఱు అద్వైతపరముగను, మఱికొందఱు ఇతరదర్శనముల పరముగను సమర్థించి యున్నారు; కాని యిదియే యాభేదముల పరిమితి.

నాతండ్రికి అద్వైతమే పరమసిద్ధాంతము. అయినను ద్వైత విశిష్టాద్వైతములుగూడ సత్యమును వహించినవగుటయేకాక ఆవశ్యకములనియు వారినమ్మిక. ప్రతియొక్కనియు ఆత్మయొక్క పరిణామస్థితిని అనుసరించి అన్నియు గావలసినవే. కేవలత్వమునకు సంసిద్ధుడైయున్నవానికి అద్వైతమే అనుకూలించుమతము. దానికన్న తక్కువదశలలో నుండువారికి తక్కినమతములు అనుకూలించును. త్రిమతములకు నీరీతి అన్వయము కలిగించుట న్యాయమని నేను చెప్పజాలను. భక్తి, జ్ఞానము, కర్మ, ఈ త్రికాండములకుఁగల సంబంధములను గ్రహించుట యనఁగా తత్త్వశాస్త్రమథనము పరిపూర్ణముగా జేసి అమృతమును వడయుట. న్యాయవాదిగానున్నను వివాదములన్ని జడిసి వెనుకదీయు నాతండ్రి నిరాఘాట విమర్శనావ్రతమును అవలంబింపలేదు. ఏదోయొకరీతి అన్నింటిలో నీశ్వరుఁడున్నట్లే అన్నింటిలో

సత్యమున్నదని సంధిమార్గమును బూని ఒకరిని నొప్పింపక తా నొవ్వక తన జీవయాత్రఁ గడ తేర్చుకొనెను. ఎట్లు విచారించి చూచినను ఆతఁడు అజాతశత్రువు.

కుప్పనయ్యంగారు ఈగ్రంథములను సవరించినారని ముఖపత్రమున నున్నది. స్నేహభావముచేత వారిపేరున కాప్రాముఖ్యత నొసంగిరేకాని వా రెక్కువ యేమియు చేయలేదు. అయినను మాయూరిలోని ప్రసిద్ధాంధ్రపండితులును, మాముత్తాత రామలింగారెడ్డి శిష్యులును, అగుటచే సహకర్మగా గ్రహింపఁబడుట సహజమేకదా!

నాముత్తాతయైన రామలింగారెడ్డియొక్క కృతులను ముద్రింపఁగోరి 1889 వ సంవత్సరములో నెత్తి వ్రాయించ నాతండ్రి ఆరంభించెను. వారికృతులలో ముఖ్యమైనది భాస్కరశతకము. అప్పుడుపుట్టిన పుణ్యవశముచేత నాచిన్నతమ్ముఁడు, ఇప్పుడు డిస్ట్రిక్టు మునిసిపుగా నుండువాడు, భాస్కర నామధేయాంకితుఁ డయ్యెను. ఏకారణము చేతనో ఆముద్రణకార్యము నెఱవేఱినదికాదు. ఈ సంవత్సరమున ఆభాస్కరుని సాహాయ్యముచే రామలింగారెడ్డి కృతులను మదనపల్లెలో నే నచ్చు వేయింపగలిగితిని.

ఈ సంగ్రహజీవితమును, నేను కుప్పనయ్యంగారి సర్వలక్షణ సారసంగ్రహమునకును, రామలింగారెడ్డి కృతులకును వ్రాసిన పీఠికలను చదివినయెడల మావంశచరిత్రమేగాక పూర్వమున మాగ్రామవృత్త మేరీతినుండె ననుటయు కలఁగన్నమాడ్కి నైన గోచరింపక పోదు.

1895 వ సంవత్సరము డిశంబరు నెల 6 వ తేదిని నాతండ్రి కాలధర్మముఁ జెందెను. నే నప్పుడు చెన్నపురిలో నుంటిని. ఆనరబిల్ రంగయ్యనాయుఁడుగారికి తంతి రాఁగా కమలమ్మను నన్నును బిలుచుకొని బయలువెడలిరి. నాదుఃఖమునకన్న కమలమ్మయొక్క దుఃఖమే యెక్కువ. పాపము! ఆఁడుది. రక్షకులు లేనిది. పుట్టిననాఁటఁ గోలె యేచింతయు సోకకుండునట్లు కాపాడిన పెంపుడుతండ్రి చనిపోయె గదా! నా కింక గతి యేమని పనివి పనివి యేడ్చుచు వచ్చెను. నాడనఁగా రైలుబండి ఒకగంట ఆలస్యముగా చిత్తూరు చేరినది. మేము

వచ్చుసరికి చిత్తూరునుండి కట్టమంచివఱకు జనులు గుంపులు గుంపులుగ చీమలబారుల ట్లుండిరి. నరసింగరావు, సుందరయ్య, వెంకయ్య, అరుణాచలమొదలి, దొరసామిమొదలి మొదలయిన వక్కీళ్లు, వర్తకులు, బంధువులు, బీదసాదలు, కోటిగారి రంగయ్య మొదలయిన స్నేహితులు అందఱు ఆ మహనీయుని అంత్యదర్శనార్థము తండోపతండములుగ పరివేష్టించి కన్నుల నీరుఁ గార్చుచుండిరి. దహనసంస్కారానంతరము డిస్ట్రిక్టుజడ్జియైన రాబర్టు సివెల్ వచ్చి విచారించెను. ఒక నెల వఱకు మాయిల్లు సత్రముగా నుండెను. మాజిల్లావారి గొప్పతనమునకు సూచకమయిన ఒక్కవిషయ మిట అల్పమయినను చెప్పకతీరదు. కక్షిదారులెల్లరు మేము అడుగకయ తా మియ్యవలసిన పైకమును తామే తెచ్చి మాతల్లికి దేవుని ముడుపులట్లు చెల్లించిరి. దాదాపు ముప్పదియేండ్లు దాటినవెనుక నేను ఎలక్షన్ దండయాత్రకు వెడలఁగా కట్టమంచి సుబ్బారెడ్డికొడుకు అను ధ్వజమే అనాయాసవిజయావహమైనది. "తమ్ము కపిధ్వజప్రభల యంధీభూతులం జేయవే" అను మాడ్కి, నాకు తెనుఁగున నుండు విద్య వారిడిన భిక్షయేకాని వేఱు కాదు. భారత భాగవతములను మనసులో నాటి కాలక్రమమున వికసనకువచ్చునట్లుచేసిరి. రామాయణమునందు వారికి రక్తి లేశమాత్రము. ఏలనఁగా. అది కథ ; కావ్యము ; వేదాంతవిచారణలు, ధర్మాధర్మ ప్రసంగములు అంతగా లేని దని. వారెంతచెప్పినను భాగవతము యొక్క శైలి నా కంత రుచింపలేదు. వారి చావుపడకలో నారాయణకవచమును పదింబదిగఁ జదివితిని. కాని ఆచిన్నవయస్సునఁగూడ కవితాకళ అందు న్యూనమని కాఁబోలు మనసు భారతము మీఁదనే తఱచు ప్రసరించుచుండెడిది. భారతమును పునః పునః పారాయణము చేయించి నాయందు వారు సాహిత్యరసజ్ఞతను పుట్టించిరి. అందుచేతనే నాకవిత్వ తత్త్వవిచారమును నాతండ్రికి అంకితముచేయుచు నిట్లు వ్రాసితిని:—

క॥ నాతండ్రి సుగుణమణి ఖని
శ్రోత్రియుఁ డురువైభవుండు సుబ్రహ్మణ్యుం
డాతతగతి నాటిన వి
ద్యాతతుల ఫలంబుమీకు నభివేదింతున్.

ములోన ప్రచురణస్థితికిఁ దెచ్చిన, సుప్రసిద్ధపండితులును, కవులును అయిన శ్రీ శేషాద్రిరమణకవులయొక్క సాహాయ్య గౌరవమును శక్తికొలఁదిఁ బొగడఁగలన కాని అర్హతకొలఁదిఁ జేయఁజాలను. అట్టి విద్యావిశారదులు ఈకార్యమును సమర్థించుట నాతండ్రియొక్క సుకృత విశేషము కాబోలు! సంచితపుణ్యములు సఫలములుగాక పోనేర్చునా?

శ్రీ శేషాద్రిరమణకవులకు నాయొక్క ధన్యసూక్తులతో కృతజ్ఞతాభివందనములను నిండుమనస్సుతో సమర్పించుచున్నాను.

ధవళేశ్వరము,
26—4—27.

కట్టమంచి రామలింగారెడ్డి.





శ్రీ రా మ జ య ం.

# శ్రీ భారతసారరత్నావళి.

1 శ్లో. శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాంస్థితిమావహంత్యవిహతాంస్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితావ స్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరా శ్శ్రేయసే.

ఆది. ఆ ౧. ప 1.

2 ఉ. శ్రీయన గౌరినాఁ బరగు ♦ చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయతమూర్తియై హరిహ♦రంబగు రూపముదాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని ♦ పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చ మెచ్చు పర♦తత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

విరాట. ఆ ౧. ప 1.

3 ఉ. అంబ నవాంబుజోజ్జ్వల క♦రాంబుజ శారదచంద్రచంద్రికా
డంబర చారుమూర్తి ప్రక♦టస్ఫుటభూషణ రత్నదీపికా
చుంబిత దిగ్విభాగ శ్రుతి♦సూక్తివివిక్త నిజప్రభావ భా
వాంబరవీథి విశ్రుతవి♦హారి ననుం గృపఁజూడు భారతీ.

అర. ఆ ౪. ప 216.



# ౧ ఉత్పత్తి ప్రకరణము

## ౧ ఉత్పత్తి స్థితి లయములకు మూలము

4 ఆ. వె. వ్యక్తసప్తధార ♦ మవ్యక్త నాభంబు
షోడశకవికార ♦ సుపరిమండ
లంబు ధ్రువమధిష్ఠితం బాత్మచేతఁ జ
క్రింబుదిరుగుచుండుఁ ♦గాలవశత.॥ శాంతి. ఆ ౮. ప 279.

5 క. ఈ చక్రంబున సకల చ
రాచరమయమైన లోక ♦ మవశానిష్ఠా
గోచరమై చరియించుట
సూచికొనవ్వలయుఁదత్త్వ ♦ శోధనదృష్టిన్॥ శాంతి.ఆ౮.ప 280

6 క. శరనిధి తరఁగలభంగిం
బొరిఁబొరి నవ్యక్తమునన ♦ పుట్టు నడంగున్
సురనర ధరణీరుహాముఖ
చరాచరానేక భూత ♦ జాలము లెల్లన్॥ అశ్వ. ఆ ౨. ప 200.

7 క. భూతము లవ్యక్తంబున
జాతములగునందుఁ బెరుగు ♦ సమయుఁ దదీయా
స్థితత్త్వమునను బురుషుం
డతిద్వ్యధసాక్షి తా స♦మిద్ధుఁడు వత్సా॥ శాంతి. ఆ౮. ప 278

8 ఆ. వె. విను మవిద్య కామ♦మునకుఁ గామము కర్మ
మునకుఁ బుట్టబట్టు ♦ లనఘ యంత
వట్టుగారణముగ ♦ వచ్చుఁ బునర్జన్మ
మరుదురు తత్త్వవేదు♦లైన మునులు॥ శాం. ఆ ౮ ప 344.

9 ఆ. వె. తెలిసి లోభ మోహా♦ములు దోషసంసేవ
నం బొనర్పఁగా ఘ♦నప్రగాఢ
మగు నవిద్య భూమి♦యై బహుకర్మ బీ
జముల కంకురాది ♦ శక్తులొసఁగు॥ శాంతి.ఆ ౮. ప 344.

10 ఆ. వె. కర్మములకుఁగర్త ♦ గాఁ డాత్మ్యుఁ డతని స
త్త్వము రజస్సు దమము ♦ వాతపిత్త
కఫములెట్లు మర్త్య ♦ కాయగతమ్ములగు
నట్లుపొందుఁ గర్త ♦ లవియె చూవె॥ అను. ఆ౧. ప 139

11 క. అనఘా విధివిహితంబులు
దనచేఁ దగఁ దలఁప ఫలము ♦ దగులు నహంకా
రనిరూఢున కనహంకా
రున కదిలేమిఫలయుక్తి ♦ ద్రోవంజాలుణ్॥ శాంతి.ఆర. ప 378

12 క. దైవతమానుషతిర్య
గ్భావంబులఁబొందుచును వి♦కారిణియై భూ
తావలిదిరిగిన వెంటణ్
వేవిధములఁదిరుగుఁ గర్మ♦వివశత్వమునణ్॥ శాంతి. ఆ౫. ప 400

13 ఆ. వె. మాంసశోణితాస్థి♦మయశరీరంబులు
తారుగాఁగ నాత్మఁ ♦ దలచునట్టి
కృపణజనులు వీని ♦ కీడుగానఁగలేక
చిక్కి చెడుదు రింత ♦ నిక్కువంబు॥ ఆశ్వ. ఆ౨. ప 140.

14 క. ఆదిని సంయోగవియో
గాదిద్వంద్వములు [2]దేహు లగువారికిసం
పాదిల్లకతక్కవు పూ
ర్వోదితకర్మంబు లెట్టి♦యోగికి నయినణ్॥ ఆది. ఆ౬. ప 246.

15 తే. గీ. క్రియ లహంకారమువఁగల్గుఁ ♦ గ్రియలవలన
దేహసంబంధ [3]మొడపక ♦ తిరుగవలయు
జన్మపర్యాయములయందు ♦ జన్మ, మనఁగ
మిళితశుక్లశోణిత ♦ కలితవృత్తి॥ శాంతి. ఆర. ప 291

16 ఆ. వె. మాతృమునఁ బురీష♦మున నానుచును గర్భ
మునఁ బ్రవర్ధనమ్ము ♦ పొంది వెడలి

---

1 తారు గాలఁగ. 2 దేహాయువు వారికి. 3 మొదలక.

సంతతానుబంధ♦సంసారదుఃఖని
ర్మగ్నుఁ డగుచునుండు♦మానవుండు॥ శాంతి. ఆర. ప 292

17 క. జననార్త వేళ వెలువడి
తనతొల్లిటికర్మములకుఁ♦దగినవివిధవ
ర్తనపొలఁబొందు వవి దెగినఁ
జనిమఱియుంబుట్టుఁ గర్మ♦సంతతికిఁ దగన్॥ అశ్వ. ఆ౧. ప 190

18 ఆ. వె. అతఁడు గాఅకలిత♦మై కర్మమునను సం
సారవర్తనంబు ♦ సలుపుచుండు
స్వప్న సంప్రవృత్తి♦సలిపెడు నరుమాడ్కి
నింద్రియములతోడ♦[1] నెఱఁయుబొరసి॥ శాంతి. ఆ ర. ప295

19 క. బాలత్వంబున నవివే
కాలోలత శుచియు నశుచి♦యైనదియు సమం
బై లీల జుగుప్సితవిధి
శీలతనొందంగ దుర్వి♦చేష్టలఁదిరుగున్॥ స్త్రీ. ఆ ౧. ప 39

20 క. యౌవనమున విషయపర
త్వావేశము దుఃఖకారి♦యై యులఁపఁగ నా
నావిధదుర్వినయములకుఁ
దావలమై మెలఁగు నింది♦తప్రక్రియలన్. స్త్రీ. ఆ౧.ప40

21 మత్త. వృద్ధుడైనతరి న్బలంబును ♦ వీఁకయుం దఱుగంగ దు
ర్బుద్ధివాటిలమ్రగ్గి యింద్రియ♦ముల్విశ క్తతఁబొంద దో
షోద్ధతిన్ రుజ లుప్పతిల్లఁగ ♦ నొందురూపగు పాశసం
బద్ధుఁజేసి జముండు దివ్వఁగఁ♦బాయు నబ్భవము౦ దుదిన్.
స్త్రీ. ఆ ౧. ప 41

22 కవి. అనయములోలతమైవిషయప్రచ♦యంబనుదుస్తరపంకమున
స్మనుగుచుదేలుచునుండగగాలము♦ముట్టిరుజన్ జర నెవ్వగపై

[1] నెఱఁ బెరసి

కానదారకొల్పిక్రమంబున నంగము॥ క్రొవ్వను జెల్వను బాపి
ప్రయోజనరహితంబుగఁ జేసి యపాత్రుఁ ♦ జావొనరించుఁ
గురుపవరా! స్త్రీ.ఆ ౧.ప 55.

23 తే॥ గీ॥ నిత్యుఁ డాత్ముండు దేహ మ♦నిత్య మతఁడు
ముదిమి దెవులును వికృతమై॥నది వికలతఁ
బొందుటయు దానిఁ దొఱఁగి తాఁ ♦ బోవునట్టి
దశకుమరణము పేరయ్యెఁ ♦ దనులతాంగి॥ అను.ఆ౫.ప125

24 తే॥ గీ॥ మేను జీర్ణముగాఁ జేయుఁ ♦ గాని మరణ
మొందఁ జేయదు విను కాల♦మెందు నరుని
పూర్వకర్మంబు లాయువుఁ ♦ బొదలఁ జేయ
సన్నముగఁ జేయ బ్రదుకును♦జావుఁగలుగు॥అను.ఆ౫.ప128

25 క॥ జీవుఁడు జీర్ణశరీరముఁ
బోవిడిచి దివంబుఁ బొంద ♦ బుట్టను పేరం
దా వెలయుం దద్దశ జీ
వావలివర్తించు నిట గ♦తాగత [1]పదవిన్॥ అను. ఆ౫. ప126

26 క॥ ఈవిధమున వెడలి చనిన
జీవుఁడు నిజకర్మజాల ♦ సిద్ధగతులకున్
[2]బోవుఁ దదుద్భవ సుఖముకి
ఖావేశముఁబొందుచుండు♦నయ్యెయెడలన్॥

అశ్వ. ఆ ౧ ప 179.

27 చ॥ స్థిరమగు పుణ్యకర్మమున ♦ దేవ భవంబగుఁ బుణ్యపాపసం
కరమున మానుషత్వమగుఁ ♦ గల్మషము ల్పశుకీటభావమున్
బొరయఁగఁ జేయు నిప్పగిది ♦ బుట్టుచుచచ్చుచు మోహవార్ధిలోఁ
దిరుగుచునుండుఁ గాని యొక♦తీరము సేరఁడు జీవుఁ డెన్నఁడున్.
ఆర. ఆ ౫. ప 75.

28 చ॥ ఇది సకలంబుగాంచి బుధుఁ ♦ [3]డెప్పుడుఁ బాపముపొంతఁబోక ని
ర్మద నిరహంక్రియాత్ముఁడును॥ మత్సరదూరుఁడునై చరించుటెం

1 పదమై. 2 బోవుఁదదుద్భవ 3 డెన్నఁడు.

పొదవఁగ ధర్మమార్గమున♦నొయ్యనధర్మము తీ పెటింగి తా
వదలఁడుదత్క్రియావిధము♦వారకయెక్కు డొనర్చుధర్మముల్.
అర. అ౫. ప76.

29 చ॥ మనుజుఁడుపుణ్యపాపములు ♦మానుగనిందొనరించుచుం దుదిన్
దనువుదొరంగిపోవునెడఁ ♦ దప్పవు నీడయుపోలె గర్మముల్
వెనుకనయేఁగి భూరిసుఖ ♦ విశ్రుతియుంబటు[1]దైన్యదుఃఖముల్
దనుకఁగఁజేయుఁ గ్రమ్మఱక ♦ తానయొనర్చుభవంబుదేహికిన్.
అర. అర. ప 171

30 క॥ వినుజీవుండు సనాతనుఁ
డనఘుఁడు నిజకర్మవశత♦నధ్రువదేహం
బునుబొందు దేహపాతం
బున నెప్పుడుఁ జెడఁ డతండు ♦ భూసురవర్యా॥ అర.అ౫.ప72.

31 క. ఈయొడలువిడిచి వేఱొక
కాయముగై కొని శరీరి ♦ కర్మవశగతిన్
బోయి సుఖదుఃఖములు గనుఁ
బాయక వెండియును దేహ♦బంధముఁబొందున్॥ అర.అ౫.ప73

32 తే.గీ. అశుభములును శుభమ్ములు ♦ నైనకర్మ
ములఫలంబులు పుడుపక♦పోవఁ గాదు
మన్న్యవశగతమైన యా♦త్మకు నుదాత్త
చరితయుదికారణముసువ్వె ♦జన్మమునకు॥ అశ్వ.అ౧.ప186.

33 క॥ విను కర్మంబొనరించును
జననము మరణంబు నడితయు♦సౌఖ్యము దుఃఖం
బును గావించుం దనచే
సినదాఖం బుతకపోవ ♦ శివునకువశమే॥ అను. అ౧. ప 34.

34 ఆ॥ వె॥ కర్మవశత్వఁబూనె ♦ కలుగు దేహము దేహ
ర్త్తనలఁబు కర్మవశగలంబు

1 దుఃఖదైన్యములు.

దేహపాతమైన ♦ దేహస్థుం డగు జీవుం
డరుగుం గర్మవిహిత♦మైన దయెడకు. ఆర. అ౫. ప 70.

35 క॥ వినుమనుజున కెవ్విధమునం
దనచేసిన సుకృతదుష్కృ♦తంబులు నెరయం
దన కనుభవింపం బాలివి
తనువు సెడుంగాని కర్మ♦తతి సెడ దనఘా॥ ఆర. అ ౪. ప 172.

36 క॥ పురుషుండు కర్మాధీనత
నరుగక తనవశమ యునిన ♦ నాపదలు రుజల్
మరణంబును నివి యేమియు
బొరయక యుండంగ బ్రతుకం♦బోల దెచెపుమా॥ ఆర. అ౫. ప 69.

37 సీ॥ నీతిమంతులు ధర్మ♦నిరతులు దక్షులు
నగువారు చేయుకా♦ర్యములు గొన్ని
సిద్ధిఁబొందవు దుష్ట♦చిత్తులు క్రూరులు
జేయం గొన్ని విశేష♦సిద్ధిఁబొందు
నూరకయుండంగ ♦ నొందుం గొందఱ విపు
లార్థము ల్గొంద ఱా♦యాసపడియు
నిష్ఫలారంభులై ♦ నిలుతురు కొందఱు
పేదవారికిం బ్రజ ♦ పెల్లువొడము

తే. గీ. నర్థవంతులు కొందఱ ♦ కర్థి నధిక
దానములు ధర్మములు నుప్రి♦తములుఁజేయం
బ్రజలు పుట్టరు విను మట్టి ♦ భంగిస్తూవె
కర్మఫల మాత్మతంత్రంబు ♦ గాకయుండు॥ ఆర. అ౫. ప 68.

38 చ. వలనధికంబుగాఁగలుగు♦వైద్యులు శాస్త్రము లభ్యసించి మం
దుల నొడఁగూర్పనేర్చి తను♦దోషము లారయు బుద్ధిగల్గి యా
ర్తులకుం జికిత్స సేయుదురు♦రోగమువాయమిలేదె వారు రో
గు లగుట గాన మెట్లు ప్రతి♦కూలవిధి న్నరుసేర్పు దోంచునే॥
శాంతి. అ ౧. ప 215.

39 మ. శ్రుతివాక్యంబులు కర్మనిష్ఠ వినుతిం♦చుఁ నిష్క్రియత్వంబుస
ద్గతిఁగావించుటఁయూది చెప్పనిటుచి♦ త్తప్రక్రియల్ రెండుచో
దితము ల్వానిని వింటిమన్న [1]కలఁచుం ♦ దీపించు నేత త్త్వసం
గతబోధంబు సుకర్మతంగలుగు [2]నా♦కంబా ప్తవీరవ్రతా!
శాంతి. ఆ ౧. ప 138.

40 ఉ. ఆదటపూర్వశాస్త్రముల ♦ యర్థములారఁగఁగ్రోలి తత్వసం
వేదసుధారసంబునఁ జ♦విం జిరసౌఖ్యముఁ బొందనేర కి
మ్మేదని నెందునుం దిరిగి♦ మేలని [3]కర్మమ యూదిచెప్పచుం
గాదని శాంతి యొప్పనిది♦గాఁ జెడనాడుదు రల్పబోధనుల్.
శాంతి. ఆ ౧. ప 141.

41 ఆ. వె. విను ప్రవృత్తి కర్మ♦మనఘ నివృత్తి ని
ష్కర్మమరయ బంధ♦కంబు మోక్ష
ణంబునగుట బోధ♦నత్వసంపన్నులు
చేరరు కర్మతంత్ర♦కరణమునకు॥ శాంతి. ఆ ౫. ప 125.

42 క. కొందఱు కర్మకరణ మభి
నందింతురు వారలకు జ♦ననమరణములం
బొందకపోరాదు మహా
నందముఁబొందుదురు నిత్య ♦ నైష్కర్మ్యపరుల్.
శాంతి. ఆ ౫. ప 126.

43 క. మానుషజన్మము మే లది
హీనపుజాతిని జనించె♦నేని యనన్యం
బైన జననంబుకంటెను
దానసుగతివడయునగుటఁ♦ద త్త్వప్రవణా॥ శాంతి. ఆ౫. ప 522

44 క. నరుఁడు జరాయుజములలోఁ
దరుణీ! విను ముత్తముఁడు శ్రు♦తములేకున్నఁ

1 కలుషఁ, 2 నాకంబా త్త, 3 కర్మము చెల్ల.

సరిపశువునకుం గావున
వరిష్ఠమగునట్టి వినికి♦వలయు నరునకున్॥ అను. ఆ ౫.ప 145.

45 క. దుర్మతు లామిషగత మగు
కర్మమువాటించి బంధ♦కలితు లగుదు ర
య్యార్మిఁగడచి సువిచారులు
నిర్మమతను ముక్తివడయ♦నేర్తురు వత్సా! శాం.ఆ౧.ప126.

46 క. నేయి [2]పాలుపరిన దీవియ
మాయుకరణిఁ గర్మసిద్ధి♦మలిఁగిన హీన
త్వాయత్తంబై తానును
మాయును దైవానుకూల్య♦మహిమ మహీశా!
అను. ఆ ౧. ప 139.

47 క. తేరు శరీరము దానికి
సారథి సత్వంబు తురగ♦చయ మింద్రియముల్
దారుణతర బుద్ధి వ్యా
[3]పారంబులు దనరు జనుప♦పగ్గము లధిపా॥ స్త్రీ. ఆ ౧. ప 57.

48 క. నరవర! యేర్పడ విను మ
త్తురగంబుల పటురయంబు♦తో [4] ననుచరతం
దిరుగు పురుషుండు సంసృతి
పరుఁడై భ్రమియించు నవశ♦భావవ్యాప్తిన్. స్త్రీ.ఆ౧.ప58.

49 క. వానిఁ దమయిచ్చ నెందుం
బోనీకుండంగ నాఁగు♦పురుషుఁడు సంసా
రానేకదుఃఖభాజన
తానిరసనమునకు నేర్చు♦ధరణీనాథా॥ స్త్రీ. ఆ౧. ప 59.

50 క. యముని యధీనం బది దుః
ఖముల ననేకములఁ జేయఁ♦గానోపు నృపో
త్తమ! యీ [5] రథ మవియింతురు
విమల వివేకౌషధమున ♦ విను మార్యజనుల్. స్త్రీ. ఆ ౧. ప 60.

---

1 పరి వతెఁచు పశువు. 2 పొలుసుతిన. 3 పారము లానరంగగనకు. 4 ననుసరతన్ నడునడుతన్. 5 రథమది యనఁతురు.

# ౨ సత్త్వాదిగుణ ప్రకరణము

—:o:—

## ౧. సత్త్వరజస్తమోగుణములు.

1 సీ. సంయమివరులార! సత్త్వరజస్తమో
నామరూఢములు గుణంబులవియు
నన్యోన్య మిథునత్వ మన్యోన్య సంశ్రయ
మన్యోన్యసంకలితానువృత్త
భావ మన్యోన్యోపజీవనాచరణంబు
గలిగి దుర్బోధత్వగాఢభంగు
లై యుండు దమము నియమితమైనరజస్సు
దన్నియమమున సత్త్వంబు నడచు
తే. గీ. సత్త్వ[1]ముడిగినచోఁ [2]దమశ్చరణ మెసఁగు
లోభశోక సమ్మోహ నిద్రాభయములు
వికృతి దుర్మానమాఢ్య పాపకృతి క్రోధ
[3]శౌర్య మాత్సర్యములు దమస్సంభవములు.
అశ్వ. ఆ ౨. ప 611

2 క. తలఁపులు గ్రిందుగఁ బొడముట
గలగను లేమఱుట భ్రమము గదురుట జాడ్యం
బలసతయును నీభావం
బులు దామసకోటి యండ్రు బుధులు నరేంద్రా.
శాంతి. ఆ ౪. ప 352.

3 ఉ. పాములుఁ దేళ్లునుం బసులు బంధులు గుక్కలు మీలుగోళ్లులుం
జీమలుఁ గాకులుం గ్రిములు జింకలు నక్కలు గొంకనక్కలు
న్దోమలు మ్రాకులుం బొదలు నోవులఁ బీడల బొందువారు మున్
దామస [4] భావులట్ల మఱి తద్విధజంతువు లెన్ని యన్నియున్.
అశ్వ. ఆ ౨. ప 117.

---

1 మడఁగిన 2 దమశ్చరిత 3 శాఠ్య 4 భాగులట్ల.

4 తే. గీ. సంశయంబు విషాదంబు ♦ జడత నిద్ర
విను తమస్సువర్ధింపఁగాఁ ♦ బెనుపునొందు
నది విహీనతఁబొందిన ♦ నవియు హీన
భావమొందు వికస్వర ♦ పద్మనయన॥ అను. ఆ౫.ప 249

5 క. ఇవి తామసంబులని గుణ
నివహములోఁ గీడువాప♦నేర్చు నతఁడు త
ద్ద్వివిధ వికృతి నిరసనహే
తువివేకముగలుగఁగా న♦ధోగతిదలఁగున్॥ అశ్వ.ఆ౨ప. 118

6 క. అతినిందితము తమోగుణ
మతిమోహమయంబు సత్త్వ♦మనయంబు బ్రకా
శత నొప్పు నుభయగుణంమి
శ్రితఁబరగు రజోగుణంబు ♦ సన్నుతచరితా. ఆర, ఆ౫.ప96

7 క. పరితాప మనభితోషము
నరేశ్వరాశోచనము జననవ్యాపారా
దర మక్షమ మనియెడు నివి
యరయంగా రాజసంబు♦లగు భావంబుల్. శాంతి. ఆర.ప351

8 చ॥ బలమును శౌర్యము న్మదముఁ ♦ బ్రాభవమున్సుఖదుఃఖభాగితా
కలనము జెల్మి సేతయును ♦ గాంక్షయు నొల్లమియుం బ్రతాపముం
గలహమునీర్ష్యయున్బహు వి♦కల్పపుభాషలుఁ గామినీజనం
బులయెడ గాఢరాగతయు ♦బొంకును నుబ్బు రజఃప్రభూతముల్.
అశ్వ॥ ఆ౨॥ ప 119॥

9 చ॥ అవి తొలుబాయునం గలుగు♦నట్టి [1]జనంబులకీడు లెట్టి వి
ట్టివి యవినీతుల న్మతిప♦టిష్ఠతగల్గి త్రివర్గవర్తనం
బువెరవునొంది యర్థములఁ♦బొంపిరివోవుచుఁ గామసౌఖ్యవై
భవములఁ గాంచుచు న్మనుజ♦భావనిరూఢతఁబొల్తురెంతయున్.
అశ్వ॥ ఆ౨॥ ప 120॥

1 జనంబులు నీతంబిట్టి.

10 తే॥ గీ॥ క్రోధ లోభ కామానృత • ద్రోహచింత
తాపములకు రజోభివ•ర్ధనము వృద్ధిఁ
జేయువానికి నెల్ల సం•క్షీణభావ
మావహిల్ల రజక్షయ•మావహిల్లు॥ అను॥ ఆ౧॥ ప248॥

11 క॥ రాజసగుణములకుం గల
నైజమెఱుఁగువారు తజ్జ•ననకృతముల్
ధీజితములు గావింపఁగ
నోజగలిగిశుభదవృత్తి•నొందుదు రెందున్॥ అశ్వ॥ఆ౨॥ప121

12 సీ॥ వినుము రజస్తమో • వికృతులఁ దగిలిన
మానసంబులు గల • మానవులకుఁ
గలుగు ధర్మద్వేష • కలనంబు వారలు
నరకవాసాహర్ములు • ధరణినాథ
సత్త్వపరాత్ములు • సతతంబు ధర్మ ము
పాసింతు రూర్ధ్వ లో•కాధివాస
మునకు వా రుక్తులు • మునుమును పుట్టిన
[1] సుతుఁడు ధర్మము వద్మ•జునకు దాని
తే ॥గీ॥ పాకసంపద సుమతు లు•పార్జితగ ను
పాసనము సేయుదురు తియ్య•బంటిపరువ
మాదరించి తదుపచార • మాచరించు
వెరవుగలయట్టి జనముల•విధముదోఁప॥ అను॥ ఆ౧॥ప424

13 క॥ జపమును దానము యజ్ఞముఁ
దపమును గర్తృజనచిత్త • దశలను సత్త్వా
ద్యుపహితము లగుట నడచుం
ద్రిపథంబులసాత్త్వికపుగ•తియమేలెందున్॥ అశ్వ॥ఆ౨॥ప131॥

14 క॥ విను నృప హర్షంబు ప్రియం
బనూన సుఖవృత్తి నిర్భ•రానందము శాం
తినిరూఢియనఁగ మనమునఁ
[2]బనుపడు నవి సాత్త్వికాఖ్య•భావంబులగున్॥శాంతి॥ఆ౪॥ప350॥

1 సుతుఁడు పద్మను ధర్మజునకు, 2 పనుగొను.

15 సీ॥ సంతోషమును బ్రకాశత్వంబుఁ బ్రియమును
నానందమును గరుణాభిరతియు
క్షమయును సత్యంబు శౌచంబు ధృతియును
[1] గార్పణ్యమును దితిక్షయు నహింస
యును నార్జవంబును ననసూయయును గ్రోధ
రాహిత్యమును నసంరంభతయును
సమతదాక్షిణ్యంబు శ్రద్ధదానతయు న
కౄరభావంబు హ్రీగౌరవంబు
తే॥ గీ॥ సత్త్వజాతంబులివి పూర్వజన్మసంక
లితములైనట్టివా రహంకృతి మమత్వ
మర్థతృష్ణాకామార్తిలే కతులబోధ
భరితులై యూర్ధ్వలోకవైభవముగంద్రు॥ అశ్వ॥ ఆ౨॥ ప122

16 క॥ ధృతివిజ్ఞానశ్రద్ధలు
నతిశయసమ్మోహమును దయయు హర్షము నం
చితసత్త్వవృద్ధిఁ[2]బరివ
ర్తితంబులగు సత్త్వమరుఁగఁ దెరలుండారుఁ॥ అను॥ ఆ౫॥ ప24

17 క॥ ఇనురూపము జలములదో
చినక్రియబుద్ధిఁ బ్రతిబింబ సిద్ధత వెలుఁగొం
దినయాత్మను బరమార్థతఁ
గను సత్త్వస్థులకు నిజముగానంగనగుఁ॥ శాంతి॥ ఆ౫॥ ప196

18 సీ॥ సత్వగుణంబులు సంతోషమానంద
మారోగ్య మక్రోధ మార్జవంబు
శుద్ధిప్రకాశిత సుస్థిరత్వమహింస
నిర్మలశ్రద్ధ వినీతిలజ్జ
సత్యంబు శౌచంబు సమతయాచారంబు
కార్పణ్య పైశున్య కామవృత్తి
విను రజోగుణములు విగ్రహదర్పాభి
మాన కామక్రోధ మత్సరములు

1 నకార్పణ్య 2 పరివర్తితంబులగు

తే॥ గీ॥ కరుణలేమి భోగ♦కాంక్ష యహంకార
ముమ్మలిక తమోగు♦ణమ్ములప్ర
కాశ మోహ బహుళ♦రాశన వాదప్ర
[1]మాద మాంద్య మరణ♦ఖేదములును॥ శాంతి. ఆ౬. ప 98

19 మ॥ అసుఖాకారత నిద్ర దైన్యము విమో♦హం బత్తమత్వంబు తా
మసభావంబులు రాగ లోభ జడతా♦మానంబు లూహింప రా
జసవృత్తంబులు ధైర్య శాంతి కరుణా♦సంతోషవిద్యాదు లిం
పెసఁగన్ సాత్త్విక చేష్టితంబులు నిజం♦బిట్లాత్మఁగ న్మిన్నియున్.
ఆర. ఆ. ౫. ప 97

20 తే॥ గీ॥ సత్య శౌచ దయాదులు♦సాత్త్వికములు
రమణి లోభసంగాదులు♦రాజసంబు
లమృత హింసాపరత్వ భ♦యాలసత్వ
ధైర్యహాని నిద్రాదులు♦తామసములు॥ అను॥ ఆ౫॥ ప140

21 తే॥ గీ॥ స్మృతియు సంప్రీతియును బ్రస♦న్నతయు మఱియు
నీదృశములగు సత్త్వగు♦ణోదితములు
రాగలోభరోషాదులు♦రాజసములు
దర్పశోకప్రముఖములు♦తామసములు॥ శాంతి॥ ఆ౪ప288

22 తే॥ గీ॥ సౌఖ్యతుష్టిప్రకారము♦ల్సాత్త్వికములు
మోదఖేదాదిక ద్వంద్వ♦ములు లతాంగి!
రాజసము లప్రకాశ సం♦త్రాస[2]హేయ
ములునుదంద్రయుఁదామస♦ములుగ నెఱుఁగు॥అను॥ఆ౫ప246

23 క. కారణములుగలిగియు ని
ష్కారణకలితంబులయ్యు ♦ జనియించు ధరి
త్రీరమణ మూఁడుదెఱఁగులు
నారయ నివి యస్థిరంబు♦లై తిరుగఁబడున్॥ శాంతి. ఆ౪. ప 353

24 చ॥ జనవర సౌఖ్యముం బొరసి♦సాత్త్వికభావసముద్గతంబు సు
మ్మనియును దుఃఖముల్ గదిరె♦నప్పుడు రాజసభావభంగి సు

---

1 మాదమాంద్యమరణఖేద[illegible] 2 మోహ

ష్టానియు జడత్వసంగసమ♦యంబునఁ దామసభావవృత్తి సు
ష్టనియును దోఁచి వానిఁబడ♦కాత్మరతి న్నిలుపిచ్చు మోక్షముఁ॥
శాంతి॥ ఆ ౮. ప 354

25 క॥ కలగొన రాజసతామస
ములయిన భావములు వికృతిఁ♦బొందింపఁగ మ
ర్త్యుల కేకాంతికవృత్తిని
నెలకొనఁగానెట్లువచ్చు♦నిర్మలధిషణా॥ శాంతి॥ ఆ౬. ప 507.

26 క॥ వారికిఁ బ్రవృత్తిలక్షణ
తారూఢంబైన ధర్మ ♦ మలవడు వారికిఁ
గారుణ్య పాత్రములు గా
రారయ వారన్యపథస♦మాశ్రితులగుటఁ॥ శాంతి॥ ఆ౬॥ ప508.

27 తే॥ గీ॥ అరసిచూడ సత్త్వంబు [1]సు♦ఖాస్పదంబు
సాంద్రదుఃఖమయంబు ర♦జస్సు బోధ
మాంద్యమూర్తి తమస్సు స♦మత్వ మూఁది
యీయవస్థలఁ బొరయమి♦మాయపోక॥ శాంతి.ఆ౮॥ ప125

28 క॥ జ్ఞానమునకు నగ్గుణసం
తానం బడ్డంబు గానఁ ♦ దత్ప్రతిహతికై
పూని మును సాత్త్వికమునను
మానస[2] మూఁదంగవలయు ♦ మహనీయధృతిఁ॥
శాంతి॥ ఆ ౮॥ ప 289॥

29 క॥ విను సాత్త్వికమును మది నెల
కొని రాజస తామసముల♦కును విగతత్వం
బొనరించు పదంపడి స
త్త్వనిరూఢతబోధసంప♦దకు హేతువగుఁ॥ శాంతి॥ఆ౮॥ ప 290.

30 క॥ సాత్త్వికులకు దివము రజో
మత్త్వకలితవర్తనులకు♦మధ్య భువనవా
సత్వముఁ దామసులకు నీ
చత్వకరాధోజగంబు♦ సంప్రాప్తమగుఁ॥ అశ్వ. ఆ౨. వ 128

(1) సుఖాత్మకంబు (2) మూన్పఁగ

31 తే॥ గీ॥ సర్వసంకల్ప రహితుఁడై ♦ సత్వమున వి
నిశ్చయంబుగఁ జిత్తంబు ♦ నిలుపవలయు
సత్వసక్త చిత్తంబు ప్రసాద మొసగు
దానఁ గాలంబునడవు టు♦ త్తమవిధంబు॥ శాంతి.ఆ౫.ప155.

32 క॥ కావునఁ గామక్రోధ స
మావేశము వెడలవిడిచి♦యనవరతంబుఁ
సేవింతురు సత్వము దృఢ
భావాకలనమునఁ యోగ ♦ పరినిష్ఠాత్ముల్॥ అశ్వ.ఆ౨.ప 107.

33 తే॥ గీ॥ పొందుసత్వరజస్తమం♦బులు విశుద్ధ
నంతరాత్మ బొంసు వ్రాత ♦ మనిలుఁ జెందు
నట్లు సద్వివేకము దద♦నంతరంబ
బుధుఁడుగాంచి యగ్గుణములఁ ♦ బొరయకుండు॥
శాంతి. ఆ ౪. ప 281.

34 తే॥ గీ॥ వినుము నృపసత్వమును రజ♦స్సును దమస్సు
ననఁగ గుణములు ముప్పిరి♦గొనుచు నాత్మ
జుట్టుకొను నొందు మెయిఁదెగ ♦ విట్టలముగ
నొలయు వైరాగ్య మనుకొడ♦వలినకాని॥ శాంతి.ఆ౪.ప192.

35 క॥ సత్వము ప్రదీపమా పర
తత్వముఁ గాంచుటకుఁ గానఁ ♦ దత్సాధనతా
తత్వము వదలక చిత్తసు
ఖత్వాకలితమగు నెలవు♦గందురు కృతాత్ముల్॥ అశ్వ.ఆ౨.ప189

36 క॥ శ్రుతియున దపమనఁగఁ బ్రజా
పతియున*సత్వంబునకు న♦పరనామంబుల్
వ్రతులార! సత్వమన న
వ్రతతమహిమమైన పరమ♦వేద్యముసుండీ॥ అశ్వ.ఆ౨.ప 106

---

* సత్యమనఁన

## ౨. పంచేంద్రియములు.

37 తే॥ గీ॥ వర్ణములకెల్ల నింద్రియ♦వ్యాప్తి నిగ్ర
హంబువలయు నెయ్యది గన్న ♦ యంతఁదుష్టిఁ
బొంది యొండాస పడకున్న ♦ నొందుసాధు
జనులు వెదకు ననామయ♦సత్పథంబు॥ అను. ఆ3. ప 318.

38 క. ఒరుల పనికిఁగా నిజహిత
విరహితుఁడగు నట్లుగాదె ♦ విషిథేంద్రియ కా
ర్యరతుండై యాత్మసము
ద్ధరణం బొగిఁ జేయకునికి ♦ ధరణీనాథా॥ శాంతి. ఆ౫. ప 531

39 క॥ విచ్చలవిడి నింద్రియముల
నెచ్చటికైనను జనంగ ♦ నిచ్చిన నరగం
బచ్చుపఱచుఁ గదియించినఁ
దెచ్చు సుగతిన్రుున కది స♦తీమౌళిమణీ॥ అను. ఆ౫. ప 234.

40 తే॥ గీ॥ సాధు లింద్రియ విభ్రాంతి ♦ సంహరింతు
రఘముఁ దెలిసి ప్రాయశ్చిత్త ♦ మాచరింతు
రప్రకాశంబుగా ధర్మ ♦ మాచరింతు
రఖలభూతదయాభుత్వ♦మారఁగలరు॥ అను. ఆ ౫. ప 428

41 తే॥ గీ॥ ఇంద్రియంబులు దమయిచ్చ♦నిట్టునట్టు
దిరిగెనేని దుఃఖంబులఁ ♦ దెచ్చునవియె
కట్టువడి సుఖమొనరించు ♦ గాన నాత్మఁ
గావవలయునింద్రియ-చోర♦గణమువలన॥ శాంతి. ఆ౮. ప186

42 క. ఏనింద్రియములు మనసును
బూని తన 1 వశంబులైనఁ ♦ బురుషుండు సదా
ధ్యాన సమాధి సమగ్రుఁడు
వాని గీరింతు రమర♦వరులు న్మునులున్॥ అర. ఆ౫. ప 94.

43 తే॥ గీ॥ ఇంద్రియంబులు దివిచిన ♦ యెడఁ బొఱు
చుండు మన సెప్డు దద్యోగ ♦ ముడుపకున్న

1 వశంబయ్యె.

నెడలి చెడిపోవు బుద్ధి యు♦ద్దీర్ణపవన
హతిఁ బయోనిధిలోఁ గల ♦ యవియునట్లు॥ ఆర. ఆ౫. ప93

44 ఆ॥ వె. మనసు నింద్రియములఁ ♦ బనిగొని పురుషుండు
ప్రచురశిక్షలేని ♦ రథ్యసమితి
నడపురథికుమాడ్కి ♦ నడువడినది యీడ్చి
నట్టులైన నశుభ ♦ మావహిల్లు॥ శాంతి. ఆ ౫. ప 153

55 తే గీ॥ మనసుచేతన యింద్రియ ♦ మహిమలెల్ల
నుపరతంబైన మనసుతో ♦ నుడిగిమడఁగు
నింద్రియములు [1]పరమునొందె ♦ నేని దాన
మనసుమగుడదు విషయతృ♦ష్ణచరించు॥ శాంతి. ఆ౬. ప86

46 క. కావున నింద్రియ చేష్టల
నేవలనికిఁ బోవనీమి ♦ యింతకు ముఖ్యం
బై వడి గొను మనసు దిగువఁ
గావలయును మగుడదీనిఁ ♦ గనుఁగొనుమనఘా॥ శాంతి. ఆ౬. ప87

47 తే. గీ. ఇంద్రియములెల్లఁ [2]నట్టిప♦యొనసి యొండు
వలన మనసున్నఁ దమతమ ♦ వర్తనముల
నిగుడనేరమి దెల్లంబు ♦ నృపవరేణ్య
యిట్టులగుట యజ్ఞునకైన ♦ నెఱుఁగవచ్చు॥ శాంతి. ఆ౬. ప87

48 క॥ వినుటకును గనుటకును సా
ధనములయిన చెవియుఁ గన్ను ♦ దనతనయంత
న్వినను గానను నేర్చునె
మనఃపరిభావమునఁ గాక ♦ మనుజాధీశా॥ శాంతి. ఆ౬ ప 84

47 తే॥ గీ. ఇంద్రియములలో నొక్కటి ♦ యేనిఁ బట్టు
వడక వెడలిన నాగంటి ♦ ప్రజ్ఞకారు
నట్లుగావున మనసు ము♦న్నాఁగి వినికి
యాదియగునై దుగ్రమమున♦నాఁగవలయు. శాం. ఆ౫॥ప119

50 క॥ మనసునియమింపభూతా
త్మునియుక్షతబొప్ప నియమ ♦ మునకుఁ లోనై

1 పరమునొందె 2 యొలసి. 3 యత్నంబోవు

మనసిందిర్యములఁ గుదియిం
చిన శబ్దాదులుదొరంగి ♦ సిద్ధిదొరకొనున్॥ శాంతి.ఆ౫. ప107

51 క. విను మందు నొకవిశేషం
బనఘా! బుద్ధీంద్రియంబు ♦ లై దను బరముం
గను వెలుఁగున కడ్డమువా
ని నడంగింపంగ మనసు ♦ నిపుణత[1]నొప్పున్॥ శాంతి. ఆ౫.ప106

52 ఆ. వె. కనుటవినుటయాది ♦ గాఁగల యింద్రియం
బుల కగోచరంబు ♦ బుద్ధి దీప
రూపుగాఁగఁ దోఁచు ♦ రూపశబ్దాది గు
ణత్వరహితమైన ♦ తత్త్వమనఘ॥ శాంతి. ఆ ౫ ప 108

53 తే॥ గీ. అనఘ! యింద్రియముల విష♦యములమీద
నిగుడనీక మనంబుతో ♦ మగుడఁ దిగిచి
యాత్మఁగూర్చుట సాంఖ్యుల ♦ యనువు సాంఖ్య
యోగములు రెండునారయ♦నొక్క తెరువ॥ శాంతి ఆ౫.ప97

54 క. ఈ రెండుప్రకారంబుల
వారలకును మమత విడువ ♦ వలయుట సరి ని
స్సారపు సంసారమునకుఁ
గారణము మమత్వమగుట ♦ గవిజనముఖ్యా॥ శాంతి. ఆ౫,ప98

55 తే. గీ. ఎల్లకడలకు వెలువడు ♦ నింద్రియముల
బాలపుత్రులఁదండ్రియుఁ ♦ బోలె నాఁగు
మవియు మనమును నిశ్చలై ♦ కాగ్రభావ
మొందుటు త్త[2]మపదమున♦ముజ్జ్వలాత్మ॥ శాంతి. ఆ౫.ప179

56 క. అది ధర్మంబుల కెల్లం
దుదియగు ధర్మంబు మనసు♦తో దానిదగం
గుదియించి మేధతోడం
గదియింపుమునియతిబుత్రి ♦ కడుగాఢముగన్॥ శాంతిఆ౫.ప180

57 తే. గీ. అనఘ యింద్రియములు విష♦యములు మనసు
బుద్ధియును నాత్మయును గ్రమం♦బునన యొక్క

1 యొప్పున్ 2 తపదమునయుజ్జ్వలాత్మ

డాత్మ బుద్ధి యనంగ న♦ల్పాంతరంపు
వస్తువులు బుద్ధి యిన్నిఁట♦వి_స్తరిలుట॥ శాంతి. ఆ౫. ప 168
58 క॥ విను మైదింది్రియములకును
మనంబు షష్ఠంబు స_ప్త♦మత్వము బుద్ధిం
బనిగొను భవ్యక్షేత్రి
జ్ఞనియం దష్టమతగల్గు ♦ సుగుణాభరణా॥ శాంతి. ఆ౫. ప 165
59 తే॥ గీ॥ స్వస్థతయు దుస్థతయు జడ♦త్వమును గ్రమవి
గణన సత్వరజ_స్తమో ♦ గుణము లవి స
మీరితములగు టడఁగుట ♦ యింది్రియంబు
లడరుటొదుగుట బుద్ధికృ♦త్యములువత్స॥ శాంతి.ఆ౫.ప167
60 తే॥ గీ॥ తలఁచు మనసున నిశ్చయ♦దశ యొనర్చు
బుద్ధి సర్వైక సాక్షిత్వ♦మున వెలుంగు
నంతరాత్ముండు క్షేత్రజ్ఞుఁ ♦ డనఁగ వాని
మెఱుపుసత్త్వాదిగుణములై ♦మెఱయువత్స॥శాం ఆ౫.ప166
61 క॥ కనుఁ గన్నై వినుఁ జెవియై
కొనుఁ జవి జిహ్వయయి మూరు♦కొను నాసికయై
తనువై స్పర్శము[1]గనుఁగొను
ననవద్యా బుద్ధి యాత్మ♦యందు నిలుచుచున్॥శాంతి.ఆ౫.ప169
62 క॥ ప్రీతిం గడుఁ బొదలు విషా
దాతురతన్ సు్రుక్కు దద్వ♦యములేక సమ
త్వాతిశయంబున నిలుచును
నేతృత్వంబునను బుద్ధి♦నెరపుగుణములన్॥ శాంతి.ఆ౫.ప170.
63ఆ ॥వె॥ బుద్ధిఁగొని మనంబు ♦ పోనీక నిలిపి మ
నోనియుక్తి నింది్రి♦యముల నాఁగి
విషయసమితి నెడల ♦ విడిచిన వానికి
ననిమిషులు ప్రసన్ను♦లగుదు రనఘ॥ శాంతి. ఆ౮. ప314
64 తే॥ గీ॥ ఇంది్రియంబుల [2]నేనింటి ♦ నిట్లు విషయ
ములకు నొలయక యుండంగ ♦ నిలువరించి

1 కైకొను 2 నారింటి.

తలఁపు లుడిగి తేనియుఁ బ్రిమదమును నాను
భంగిఁద్రృప్తుఁడవై యుండి పరముగాంతు॥ శాంతి.ఆ౫.ప181

65 క॥ వృత్తివిశేషమునఁ జనిన
చిత్తము వెనుకఁజని యందుఁ జేర్చి మనసుఁ దా
నత్తెఱఁగునకుం దివియుమి
యుత్తమపురహస్యమంద్రు యోగమునమునుల్॥ అశ్వ.ఆ౨. ప209

66 ఆ॥వె॥ తత్స్వభావ మెఱిఁగి తానింద్రియాదిస
ప్తకము వెంటఁబోక తన్ను గనుచు
నున్నవానిఁ బొంద నోపునే దుఃఖదై
న్యంబు సుఖమదంబు నప్రమత్త॥ శాంతి.ఆ౫.ప171

67 సీ॥ ఇంద్రియార్థములకు[1] నెలసిన పురుషుండు
గాఢరాగంబునఁ గరఁగుచుండు
రాగంబువలనఁ దీరంబగు లోభంబు
లోభియై కరుణకు లోనుగాఁడు
మఱి సముద్ధత వృత్తి మఱుగుఁ బాప క్రియఁ
దగువారు చెప్పెడి తగవు వినఁడు
కుజనుల దెసఁ [2]బ్రీతి గోరుఁ దుల్యంబులు
గాకుండు వాఙ్మనః కర్మభంగు
గీ॥ లిహమునందు బుణ్యహీనుఁడై చెడిపోవు
బరమునందు దుఃఖభరము నొందుఁ
గాన నింద్రియార్థ గతిఁబోక సాధుసం
సర్గఁ జేసి సుగతి జనుట యొప్పు॥ ఆర. ఆ౫ ప81

68 గీ॥ అనఘ! శబ్దాది విషయంబు లందుఁ దగిలి
యిచ్ఛఁ జరియించునెప్పుడు నింద్రియములు
బుధుఁడు తత్స్వభావము దన బుద్ధి నెఱిఁగి
యేమఱక వానిఁ దగఁ గుది యింపవలయు॥ ఆర. ఆ౫. ప89

1 ఇంద్రియార్థంబుల కెలసిన. 2 ప్రీతిగోఱుఁదు.

69 చ. అరదము దేహ మింద్రియము♦లశ్వములాత్ముఁడుసూతు డిమ్మహా
తురగచయంబు ధైర్యమను♦ తోరపుపగ్గములన్ దృఢంబుగా
నురువడిఁ బోకయుండ వెర♦వొప్పఁగఁ బట్టినవాఁడు స్వర్గపుం
దెరువుననేగు నప్పరమ ♦ ధీరుఁడు సూవెయుదారుఁ డెయ్యెడన్.
ఆర. ఆ౯. ప 92

70 క. స్వర్గ నరకంబు లింద్రియ
వర్గసమాచరణము నన♦వచ్చును వినవే
స్వర్గమగుఁ దన్నివారణ
దుర్గతి యగుఁ దన్నిరోధ ♦ దుర్బలతమెయిన్॥ ఆర. ఆ౯.ప91

71 క. రాగపరిలిప్త మానస
రోగంబున నింద్రియంబు ♦ లుల్లసితములై
భోగులగుట యుడిపిన నప
రాగత సంసారదుర్వి ♦ రామము సేయున్॥ శాంతి. ఆర. ప296

72 ఉ. ధీరుఁడు నిర్జితేంద్రియుఁడు ♦ తెల్లముగాఁ దనుగాంచు భూతవి
స్తారనిరూఢమైన పర ♦ తత్వముగాఁ దనయంద భూతవి
స్తారమునెల్లఁ గాంచు నత ♦ తస్ఫుటదర్శనుఁడై సమగ్ర1వి
స్ఫారముఁబొంది నిర్మల తపంబులయందుఁ జలింపఁ డెప్పుడున్.
ఆర. ఆ౯. ప89

73 ఆ. వె. ఇట్టివాఁడు వెడల ♦ నీఁడు నింద్రియజల
మన్యుపంకలోభ ♦ మదము తటాది
ఘోరరూపమగు న ♦ సారసంసారవి
శాలనదిఁ బ్రశాంత ♦ శాలిహృదయ॥ శాంతి. ఆ౯.ప85

74 క. నియతి గలిగి యింద్రియముల
జయించి శుచులైన శాంతి ♦ సంపన్నులకున్
భయ మొనరింపఁగ లే వ
వ్యయపుణ్యాగ్రహము లే య♦వస్థలయందున్॥ ఆర. ఆ౯. ప255

75 ఆ. వె. వినుము దనుజనాథ! ♦ విష్ణునియం దఖి
లంబుగలుగు నిలుచు ♦ లయముఁ బొందు

1 విశ్వారం.

నతనిభ క్తి నిండి ♦ యజయంబు నకుఁ బోలె
దానధర్మవిధులఁ ♦ గానరాదు॥ శాంతి. ఆ ౫. ప 409

76 ఆ. వె. ధూతపాపుఁడైన ♦ పూతాత్మకుండు ల
ఘ్వాశి యగుచు నింద్రి♦యముల గెల్చి
మనసులోనఁ గామ♦మును గ్రోధమును జార
నీక బ్రహ్మపదము ♦ నిచ్చ గోరు॥ శాంతి. ఆ ౫. ప84

77 తే. గీ. అధిప! లఘ్వాశియై యింద్రి♦య ప్రపంచ
జయముగలిగి మోక్షార్థోక్త ♦ సారధర్మ
నిరతి నుండెడివానికిఁ ♦ బరమమగు ప
దంబు తంగేటిజున్ను చం♦దంబు నొందు॥ శాంతి. ఆ౫.ప391

78 ఆ. వె. ఇంద్రియములఁ గెల్చి ♦ హృదయంబు శాంతిసు
ఖంబుఁబొంద నిర్వి♦కారవృత్తి
యైనవానిఁ బొందు♦ మానితగతి దేవ
తలకుఁబొంద నరిది ♦ ధర్మనిరత॥ శాంతి. ఆ ౫. ప 27

---

## 3-విషయాసక్తత.

79 క. అరయఁగ విషయము లెంతయు
దురంతములు వానియందుఁ ♦ దొడరిన చేటుం
బొరయుదురు దొడరకున్నం
బరమపదవి యమ్మహాను ♦ భావులకు నగుఁ॥
శాంతి. ఆ ౪. ప 310

80 తే. గీ. అనఘ మూఢాత్ము చిత్తంబు ♦ నందు విషయ
జాల మత్యంతగాఢసం ♦ సక్తి నొందు
లక్కరసము దండాదులఁ ♦ జిక్కఁబట్టు
చందమున దీనిఁ గనుట బ్ర♦శాంతికరము॥ శాంతి.ఆ౫ప528

81 క. విషయంబులు నశ్వరములు
విషసన్నిభములు సమగ్ర ♦ వికృతిజనకముల్

ధిషణాగుణములనెల్లఁ గ
లుషములుగాఁ జేయు మోహ ♦ లోభకరములై॥
అశ్వ. ఆ ౨. ప 139

82 క. హారివిషయాభిలాషము
కారణముగ నెంతయెఱుక♦గల వారును దు
ర్వారవికారము బొందెదు
వారు నిజేంద్రియము లవియ♦వశ్యములగుటఁ॥ఆర.ఆ౧.ప32.

83 క. విను విషయజ్ఞానమునకు
ననయంబును మనసు మూల ♦ మది కామక్రో
ధనిరూఢ మగుచుఁ బురుషుని
ననిశము నెలయించు నింద్రి♦యార్థంబులకున్॥ఆర. ఆ౫ ప 80.

84 క. ఇంతకు మూలము దృష్ణా
తంతులతయ వత్స ! వినుము ♦ దానికి నడరం
గాంతాజనంబు తొలుప్రా
కింతయెఱిఁగి తృష్ణ తొఱఁగు ♦ టిచ్చువిముక్తిన్॥
శాంతి. ఆ ౪. ప 293.

85 క. పాపంబుఁ బుణ్యమును దృ
ష్ణాపరులకు దుఃఖ సౌఖ్య♦సంపాదు లగున్
భూపాల! వితృష్ణులు ని
ర్లేపు లగుట వారిఁ బొంద♦లే వాఫలముల్॥ అను. ఆ౧. ప 148

86 క. విను సుమతి విషయములయం
దునికి గలిగెనేనిఁ బొందఁ ♦ డుదకంబులఁ బొం
దని బిసరుహపత్రము చా
డ్పున నది విజ్ఞానఫలము ♦ భూపవరేణ్యా॥ శాంతి. ఆ౫. ప527.

87 క. వనమున వన్యాహారం
బునవర్తించినఁ బదార్థ♦ములపై మమతన్
మనమున [1]విడువకయుండిన
మనుజుఁడు మృత్యుముఖవర్తి ♦ మనుజాధీశా॥ అశ్వ. ఆ౧.ప123

1 నిడకుండిన యమ్మనుజుడు.

88 క. శరధిపరివేష్టిత క్షితిఁ
బరిపాలించినను దాని ♦ పై దృఢమమతం
బారయక వర్తించిన య
ప్పురుషుని దురితంబు లెట్లు♦పొందఁగ నేర్చున్ ॥అశ్వ.ఆ౧. ప122.

89 క. మది సుఖముగోరి దుఃఖం
బాదవంగల కార్యములకు ♦ నుత్సాహము సే
యుదు రొప్పని తృష్ణం బడి
చదురేమియు లేనియట్టి♦జను లాతురులై ॥ ఉద్యో. ఆ౧.ప306.

90 తే గీ. విడువరాదు దుర్మతునకు ♦ నొడలు ముదియఁ
దాన ముదియదు ప్రాణాంత ♦ మైనరోగ
మనఘ తృష్ణవర్జితకాముఁ ♦ డైనయతఁడు
దానిఁబోఁద్రోచిసౌఖ్యసం♦ప్రదత్వమొందు॥శాంతి.ఆ౫.ప377

91 చ. వినుము జరానుబంధమున ♦ వెండ్రుకతండముఁ బండ్లువీనులుం
గనుఁగవయున్ జరంబారయుఁ ♦ గాని యొకప్పుడు దృష్ణ జీర్ణగా
దనయముఁబేర్చి ప్రాణముల ♦ నన్పకపోవనిరోగ మల్పబు
ద్ధినరులు ద్రోవలే రది మ♦దిం జొరనీరు సుఖార్థులై బుధుల్ ॥
అను. ఆ౧. ప 147.

92 క. అది సర్వదోషముల కా
స్పదమది దురితక్రియాను♦బంధంబులకున్
మొదలు నిరంతరదుఃఖ
ప్రద మనియెఱిఁగిననుదృష్ణఁ♦బాతురుసుమతుల్ ॥ఆర.ఆ౧.ప25.

93 క. రమణీ తృష్ణాసమదుః
ఖమును బరిత్యాగ సమ సు♦ఖముఁ గలదే కా
లము ముదిసిన ముదియదు ప్రా
ణము గొనిపోఁజాలు తెవులు♦నం జను దృష్ణన్ ॥ అను.ఆ౫.ప232.

94 క. శోక ప్రమదాదిద్వం
ద్వాకులుఁడవు గాక శాంతి ♦ నంతఃకరణ
శ్రీకిం బెరిగ్త సేయుము
నీకు నతృష్ణత్వసౌఖ్య ♦ నిత్యత గలుగన్ ॥ శాంతి. ఆ ౫. ప278

95 క॥ వెలి పగఱ గెలువు గెలువే
యలఘుమతీ! గెలువ వలయు ♦ నభ్యంతర శ
త్రులఁ దద్విజయము మోక్షము
నలవరుపం జాలు నొంట ♦ నమ్మేలగునే॥ అశ్వ. ఆ౧. ప 124.

96 క॥ దొరకొన్న ననుభవించుచు
దొరకొనమికిఁ జింతనొంది ♦ దురటిల్లక ని
ర్భరుఁడై యున్నను దృష్ణకు
జొరవచ్చునె యతని మనసు ♦సువ్రతశీలా॥ శాంతి.ఆ౫.ప376.

97 ఆ. వె. విడుపువలయు సకల ♦ విషయ వాంఛల యందు
విడుపుఁ బోలు గుణము ♦ వెదకి యందుఁ
గానరైరి బుధులు ♦ కలదె పరిత్యాగ
శీలునకు నసాధ్య ♦ సిద్ధియందు॥ ఆర. ఆ౫. ప౩౮.

## ౪– అరిషడ్వర్గములు.

98 సీ. మనుజేంద్ర సంకల్ప♦మునఁ బుట్టుఁ గామంబు
రూపరు దేహని♦రూపణమునఁ
బరుల దోషంబునఁ ♦ బ్రభవించుఁ గ్రోధ మ
క్షీణ క్షమాయుక్తిఁ ♦ జేసిపోలియు
భూతాస్థిరత్వంబు ♦ బుద్ధిఁ గానమి లోభ
మనఘ జనించుఁ గాం♦చిన నడంగు
నజ్ఞానమున మోహ ♦ మావహిల్లు నధర్మ
లేపవర్జనమున ♦ లేకతక్కుఁ

తే. గీ. గులమునను [1]ధనమున విద్యఁ ♦ గలుగు మదము
మరలి వాని పెంపూహింప ♦ మ్రందిపోవు
సాత్త్వికుఁడుగామిఁ బొడము మా♦త్సర్య మదియుఁ
జెడు గురూత్తమ సాధు సం♦సేవనమున॥ శాంతి. ఆ౩.ప421.

(1) విద్య ధనమున

99 క. ఈ యాటింటను సకలా
పాయంబులు మానవులకుఁ ♦ బాటిలు వీనిం
బాయంగఁ [1] జదియనోపిన
ధీయుతునకు శుభము సద్గ♦తియు సమకూరుఁ॥ శాంతి.ఆ3.ప422

100 క. హింసా విహీనమైన నృ
శంసుం డీయారు గలుగు ♦ జనుకంతెను గీ
డంస ప్రదేశలలితో
త్తంసీకరణోపలాల్య ♦ ధరణీవలయా॥ శాంతి. ఆ 3. ప426

101 క. ఇవి తోడేడుల భంగిం
గవియుఁ బురుషు ధైర్యహాని ♦ గనుఁగొని ధైర్యం
బవలంబించిన నరుఁ జే
రవు వీనికి నిది తెఱంగు ♦ రాజవరేణ్యా॥ శాంతి. ఆ3.ప423

102 శా. కామంబుం బెడవాచుఁ బండితుఁడు సం♦కల్పంబు వర్జించి ని
ద్రామోహంబు లడంచు సత్త్వగుణచిం♦త న్లోభముం బ్రాజ్ఞసే
వాముద్రం దొలఁగించుఁ గ్రోధముశమ ♦ వ్యాప్తిన్మగుడ్చు న్మతి
శ్రీమాన్యాభయమప్రమాదమునని♦ర్జించుఁ దృఢస్వాంతుఁడై.
శాంతి. ఆ ౫. ప116.

103 ఉ. కామముఁ గ్రోధమున్మనసు♦గాడఁగఁ బాఱుటమాన్చి యింద్రియ
స్తోమవిమార్గ వర్తనము ♦ దున్మించుచు నెవ్వగలేక రక్షణం
బేమఱ కెవ్వరిం జెనకి ♦ యేపక నొంపక లోకమేలఁగా
నామహితాత్ముసర్వమహి♦మాతిశయంబునుబొందువాసవా!
శాంతి. ఆ౧. ప141.

104 క. కామంబును గ్రోధంబును
నేమరక జయింపవలయు ♦ నెల్ల విధములన్
ధీమహిత యిదియ సతత
క్షేమంకరమైన పథము ♦ కృతబుద్ధులకున్॥ ఆర. ఆ౫.ప109.

---

1 జడియ

105 క. ఆరయఁగామము క్రోధము
వైరులు ముక్తి కవి రెండు ♦ వారించిన సం
సార మనాకారంబగు
నేరపు[1]లొండేల ముక్తి ♦ నెలవుగనుటకున్॥ శాంతి. ఆ ౬. ప312.

106 తే.గీ. ఘనతరప్రజ్ఞయను తెప్ప ♦ గలుగువాఁడు
సంసరణ నది గడవంగఁ ♦ జాలుఁగాక
కామమును క్రోధమును మదిఁ ♦ గలిగి ప్రజ్ఞ
సించు నేని [2]యాఁకడచుట ♦ చిక్కువడదె॥ శాంతి. ఆ ౫. ప86.

107 క. కామక్రోధాద్యములగు
నీమానసవికృతు లుడిపి ♦ యేకాంత గృహా
రాముఁడవై నిను వెదకుట
సూ మేలొండెల్లనుడుగు ♦ సులభవివేకా॥ శాంతి. ఆ ౪. ప30.

108 చ. అనయముఁబేర్చు కామమున ♦ నర్థముఁ ధర్మముగ్రాఁగుఁగామతం
త్రనిరతుఁడైనవాఁడు సుప ♦ థప్రతిపన్నుఁడుగాఁడు దుష్టదం
డనమొనరింపఁ దట్టిపతి ♦ డాయరు సాధులు నార్యులున్ సుహృ
జ్జనులును దానఁ జేటు నగు ♦ జావును వాటిలు నెల్లభంగులన్॥
శాంతి. ఆ.3. ప 124.

109 తే.గీ. కామరసమున నతితృష్ణుఁ ♦ డైమనుష్యుఁ
డర్థతృష్ణాపరీతాంత ♦ రంగుఁడైన
గోరియ నడవిలో నెత్తెడు ♦ కోలుపులియుఁ
బోలె మృత్యు వాతనిఁ గొని ♦ పోవు దేవి॥ అను. ఆ ౫. ప235.

110 చ. సులభమొ దుర్లభంబొయని ♦ చూడనెఱుంగవు గన్నదానిపై
నలముదు గామమాయిడుమ ♦ లందఁగఁ జేయుదు నిందు లేమిటం
గలుగుదు నీకు నీ తెఱఁగు ♦ గాథ రసాతలభంగి నీవు చ
న్వ్రాలమువఁబోవకుండి నినుఁ ♦ బుచ్చెదఁ బచ్చెనరూపుపోకలన్.
శాంతి. ఆ ౪. ప5.

(1) నేరమి దొండేల (2) నక్కడచుట

111 క. నీ వాసపఱుప ధనములు
గావించెదఁబో వినాశ[1]♦కము నుడువంగా
నీవశమె [2]కామమా చెడ
వేవగపుఁ లేదు పెనుప♦వే దైన్యంబుఁ॥ శాంతి. ఆ. ౭. ప50.

112 క. శోకశ్రమతృష్ణలకుఁ
నీకలిమియ మూల మగుట ♦ నీ కగుపడువాఁ
డే కర్తవ్యముగానం
డో కామమ నిన్నుఁ దొరఁగి♦యుండెద సుఖినై॥ శాంతి.ఆ౭.ప40

113 తే.గీ. సొమ్ము గోరినయంతన♦ సుఖము గలుగ
దది యుపార్జింపఁగా సిద్ధి ♦ యగుట నిజమె
కలిగెనేని ననేక చి♦ంతల నొనర్చుఁ
జెడుటచావుతోఁ [3]దుల్యమ♦య్యెడుమ లేల॥ శాంతి. ఆ౭. ప47.

114 క. నీమూలం బెనెఱిఁగితిఁ
గామమ సంకల్పమునన ♦ కలిగెదు సంక
ల్పామర్శరహితమగు చే
తో మదిఁ ద్రిందాల్తు నేను ♦ దుది యది నీకుఁ॥శాంతి.ఆ౭.ప45.

115 తే.గీ. ధనము చేటున విసివి నా♦మనసు నిన్ను
నెడలవిడిచెను గామమ ♦ యేను శాంతి
దాంతి సత్య క్షమా భూత♦దయలఁ జెంది
నాడ లోభాదు లొందవు ♦ నన్ను నింక॥ శాంతి. ఆ౭. ప 52.

116 తే గీ. కామభోగము ల్మేలనఁ ♦ గాదు వాని
విడిచిచూడుము పొందెదు ♦ విపులసుఖము
కాయలాకులు నీళ్లును ♦ గాలి యనుభ
వించియున్న మునీంద్రులు ♦ వెఱ్ఱివారె॥ శాంతి. ఆ౧. ప124.

117 క. కామములు భోగములఁ దెగు
నే మెలఁతుక నేతనాఱు♦నే చిచ్చు ధృతిం
గామములఁ దొరగు సౌఖ్యము
నేమియు సౌఖ్యములుఁబోలు♦నేయర యంగఁ॥ అను. ఆ౫. ప233

(1) వినాశకర నుడుకంగా (2) కానని చెడు చేవగపుఁ (3) తుల్యమయ్యెడున దేల

118 తే.గీ. బంధనంబులలోనెల్ల ♦ బరమబంధ
నంబు గామంబు తద్వర్జనమున నాత్మ
యభ్రపటలంబు వాసిన ♦ యమృతకిరణ
పూర్ణమండలమునుబోలె♦బొలుచు ననఘ॥ శాంతి.ఆ౫.ప190.

119 క. బలితపు టురిగామంబున
నిలుచుట యారజ్జుదెవ్వ ♦ నీలిగి సుమతుల్
[1]వెలలి చని సుఖులగుదు ర
వ్వల నెఱుఁగరు పడుదురందు♦వత్స దురాత్ముల్. శాంతి.ఆ౬.ప232.

120 తే.గీ. కామసుఖ దివ్యసుఖముల ♦ కాంక్షదొరఁగు
మేలి షోడశాంశంబునఁ ♦ బోలలేవు
గానఁ గామమ నిను ♦ శత్రుకరణిఁ జంపి
బ్రహ్మపురమున నుండెద♦ [2]భ్రాంతిదక్కి॥ శాంతి. ఆ౪.ప53.

121 సీ. క్రోధంబు పాపంబు ♦ క్రోధంబునను జేసి
యగుఁజువ్వె ధర్మ కా♦మార్థహాని
కడుగ్రోధి కర్జంబు ♦ గానండు క్రుద్ధుండు
గురునైన నిందించుఁ ♦ గ్రుద్ధుఁడైన
వాఁ డవధ్యులనైన ♦ వధియించు మరియాత్మ
ఘాతంబు సేయఁగఁ ♦ గడఁగు క్రుద్ధుఁ
డస్మాదృశులకు ధ♦ర్మానుబంధుల కిట్ల
క్రోధంబు దాల్చుట ♦ గుణమె చెప్రుమ
ఆ॥ వె॥ యెఱుకగల మహాత్ముఁ ♦ డెఱుకయ జ్ఞలముల
నార్చుగ్రోధమను మ♦హానలంబుఁ
గ్రోధవర్జితుండు ♦ గురుకాని తేజంబు
దాల్చు దేశకాల ♦ తత్వ మెఱిఁగి॥ ఆర. ఆ౧. ప222.

122 తే. గీ. క్రోధమోహ నామకులైన ♦ ఘోరశత్రు
లిరువు రెరియించుచుండుదు ♦ రెప్రు[3]డు నరుని
నంతరంగము లోపల ♦ నడఁపకున్నఁ
గలదె యారక బ్రాహ్మణ ♦ గౌరవంబు॥ ఆర.ఆ౫.ప23.

(1) వెలఁడిచని (2) రాజువోలె. (3) నంతరంగమయ్యు భయంబునడంగ

123 తే.గీ. పాపములకెల్ల నెక్కుడు ♦ పాతకములు
సుమ్మె క్రోధలోభంబులు ♦ సువ్రతాత్మ
వాని రెంటి జయించిన ♦ వాఁడు గాని
యెందుఁబరమధార్మికుఁడని ♦ యెన్నఁబడఁడు॥ ఆర.ఆ౫.ప42.

124 క. రోషము శోకము రాగ
ద్వేషము లభిమాన దర్ప ♦ వే గాల స్యా
శ్లేషము లజ్ఞాన మని మ
నీషిజనము సెప్పు మాన♦నీయచరిత్రా॥ శాంతి.ఆ3.ప401.

125 క. క్రోధము దపముం జెఱుచును
గ్రోధమ యణిమాదులయిన ♦ గుణములఁ బాపున్
గ్రోధమ ధర్మక్రియలకు
బాధయగుం గ్రోధిగాఁ ద♦పస్వికిఁ జనునే॥ ఆది. ఆ౨. ప170

126 ఆ.వె. కార్తవీర్య దశము♦ఖ ప్రముఖులు జమ
దగ్నితనయ రాఘ♦వాదులైన
పురుషవరులచేతఁ ♦ బొలియరే సక్రోధ
వృత్తిఁగాన యలుక ♦ విడువు మేలు॥ శాంతి. ఆ౬. ప589.

127 క. కుపితుఁ డగువాని వ్రతమును
జపమును దేవార్చనంబు ♦ శ్రాద్ధక్రియయుం
దపమును దానము యజనము
నపగతములుగాఁగఁ జేయు♦నంతకుఁడలుకన్॥ శాంతి.ఆ౫.ప554.

128 క. అనుపమ నియమాన్వితులై
యనూనదక్షిణల గ్రతుస♦హస్రంబులు చే
సిన వారికంటె నక్రో
ధనుఁడు కరంబధికుఁ డండ్రు ♦ తత్త్వవిధిజ్ఞుల్॥ ఆది.ఆ3. ప145

129 క. అనహంకారుఁడు నక్రో
ధనుఁడు నతృష్ణుండునై న♦తఁడు శుభ మశుభం
బనుభేదముఁ బొరయఁడు విడు
వనసమతాసుఖమయత్వ♦ముంగనుచుండున్॥ శాంతి.ఆ౫.ప327.

130 సీ. వినుము పాపముల కె♦ల్లను నధిష్ఠానంబు
లోభంబ యది గామ♦లోలతయును
గ్రోధంబు మత్సర ♦ ద్రోహంబులును బర
ధన దార వాంఛలు ♦ దైన్యపాటు
వ్రీడా క్షమా సత్య ♦ విముఖ భావంబులు
గలిగించి ధర్మంబు ♦ గలఁచి నరునిఁ
1గ్రియమాలి యేమిటి ♦ కేనిని బొంకించు
వానిఁగా సమకట్టుఁ ♦ గాన లుబ్ధ

ఆ. వె. జనులఁదొరఁగి లోభ ♦ మనుతిరిం బడని స
త్యవ్రతులను బరమ♦ధార్మికులను
బాపభీతమతులఁ ♦ బనిగొఁను లోభంబుఁ
జెందనీకు నీదు ♦ చిత్తవృత్తి॥ శాంతి. అ3. ప 399.

131 ఉ. క్రోధములోభమున్ భయము♦గూరిన చిత్తముతోడదుష్క్రియా
సాధనవృత్తి దుర్జనుఁడు ♦ సజ్జను లాడఁగఁ జేయు కార్యముల్
బాధలఁ2బొందకున్నె సిరిఁ ♦ బాయఁగఁ జేయకయున్నె వానిఁ దీ
వ్రాధి నితాంత దుఃఖహృద♦యత్వము దేరకయున్నె వానికిన్॥
సౌప్తి. అ ౧. ప 86.

132 క. కావున లోభము విడుచుట
కేవియు సరిగావు గుణము ♦ లీగుణము మహీ
దేవునకు వలయుఁ బెద్దయు
నీ విధమున నమరసంఘ ♦ మెంతయు మెచ్చున్॥అను.అ3.ప252.

133 తే. గీ. నియత తపమును నింద్రియ ♦ నిగ్రహంబు
భూరివిద్యయు శాంతికిఁ ♦ గారణములు
వాని యన్నిటికంటె మే♦లైన శాంతి
కారణము లోభ ముడుగుట♦కార వేంద్ర॥ఉద్యో.అ౨.ప84.

134 క. విను లోభము నజ్ఞానం
బును సదృశ ఫలప్రదములు ♦ పుట్టును లోభం

1 క్రియమాలి యేమిటికయినను గర్హించు, నర్థించు. (2) బొట్టక న్నె.

బున నజ్ఞానము గావున
జననాయక లోభ ముడుగు ♦ సౌఖ్యములొందుర్॥
శాంతి. ఆ 3 వ 402

135 క. విను సంసారమునకు విసు
వనిమర్త్యుఁడు శోకమోహ ♦ వశగతుఁడై మో
హనిరూఢిఁ బడయ నేరఁడు
మనమువిరక్తముగవిసివి ♦ మఱిముక్తిఁగనుక్॥ అను. ఆ౫. వ228

136 క॥ ఇది నాయదియను నూఁత
న్మది నెయ్యది పట్టుకొల్పి ♦ ననువాసితమై
తుదిఁ జేటునొంది వానికి
నది శోకము నావహించు ♦ నత్యంతంబుక్॥ శాంతి. ఆ౪. వ13

137 క॥ స్నేహార్ణవమగ్నుండయి
దేహి మహాదుఃఖముల ధృ♦తింబొందును దుః
ఖాహతుఁడు శోకతాపవి
మోహియగుక్ స్నేహమూల♦ము లు రాగాదుల్॥
ఆర. ఆ ౧. వ 28

138 క॥ స్నేహనహవాసము లు స
మ్మోహము తలకొలుపఁ గాల♦మున మునుగుచు గా
ఢాహంకార మమత్వము
లీహఁబెనుపఁ బ్రకృతిపురుషుఁ♦డేననుచుండుక్॥ శాంతి. ఆ౬. వ154

139 తే. గీ. వినుము దేహాభిమానికి ♦ నీని నెల్లఁ
దొఱఁగ దొరఁకొనదెంత శాం♦తునకు నైన
గాన నేమిట దేహాభి♦మాన మెడలు
నట్టి చూ పభ్యసించు వే♦దాంతవిదుఁడు॥ శాంతి. ఆ౪ వ284

140 ఆ వె॥ ఒకటి గోరి దాన ♦ నుల్లంబు గందంగ
జాలిఁబడమి యేమి ♦ సంభవించె
నేని దానఁ దృప్తి ♦ నూనుటఁ దప్పిన
పనికి వగవకునికి ♦ [1]భవ్యవిధము॥ శాంతి. ఆ ౫ వ21

1 భవ్యగుణము.

141 క. ఆర్యులు ప్రవృత్తిలక్షణ
కార్యంబులచేతఁ జేసి ♦ గ్రాహ్యమునగుఁ ద
ద్ధుర్యత్వమందు విడువ ర
వార్యములగుమదనమదభ♦యక్రోధాదుల్ ॥ శాంతిఆ౭.ప283.

142 క. *మదమలిన మనస్కుండై
తుదిలే కవినయముసేయు ♦ దుర్జనునకు సం
పద పెద్దయయ్యె నాతని
మొదలిటిసంపదయుఁజెడున♦మోఘముదీనన్ ॥సభా.ఆ౨ ప202

143 క. కోపము నుబ్బును గర్వము
నాపోవని యునికియును దు♦రభిమానము ని
ర్వ్యాపారత్వము ననునవి
కాపురుషగుణంబులండ్రు ♦ కౌరవనాథా॥ ఉద్యో. ఆ౨.ప32.

144 క. భూరిగుణోన్నతు లనఁదగు
వారికి ధీరులకు ధరణి♦వల్లభులకు వా
క్పారుష్యముచనునె మహో
దారుణమది విషముకంటె♦దహనముకంటెన్॥సభా.ఆ౨.ప17.

145 ఆ॥ వె॥ ఇదియుకాని చేయు ♦ నెద్దియుననుచు ని
ర్బంధవృత్తిఁదలఁపు ♦ వట్టికొనిన
నట్టివారికెందు ♦ నలజడివాటిల్లు
గాలవుండు గురియు ♦ కాఁడె మనకు॥ ఉద్యో. ఆ 3. ప305.

146 క. బలవంతుల బలమున క
గ్గలమగు బల మెదురఁగలుగఁ♦గాఁ గీడ్పడునే
కొలదులవారికి గర్వము
నిలుచునెనయమార్గవృత్తి♦నిలిచినభంగిన్॥ ఉద్యో.ఆ3.ప303.

---

*క. మదమలిన మనస్కుఁడగుచుం
దుదఁడు నృశంసుఁ దనఁబరగు ♦ దుర్జనునకు సం
పద లెడలయ్యెను నాతని
మొదలిటి సంపదలతో న♦యూఁటంబు చెడున్.

147 తే. గీ. బహుళమగుగర్వమునఁ గార్య♦భంగియును న
కార్యసరణియు నెఱుఁగక ♦ నార్యవృత్తి
గాని తెఱవున నడచుచు ♦ నేని గురుని
నైన శాసింపఁగాఁదగు ♦ నండ్రుబుధులు॥ శాంతి. ఆ౩. ప275.

148 తే. గీ. సర్వజనసమ్మతుండగు ♦ గర్వముడిగి
క్రోధ మడఁచి శోకమునకుఁ ♦ [1]గుదురుగాఁడు
వినవె యర్థాఢ్యుఁడగులోభ ♦ మొనర విడిచి
తృష్ణవర్జించి సౌఖ్యము ♦ తెరువుగాంచు॥ అర. ఆ౨. ప452.

149 తే. గీ. స్వర్థసద్ధర్మమునకు నా♦శని సుధర్మ
నాశమునఁ జేసి నరుఁడు వి♦నష్టభావ
మొందుగావున సంస్పర్థ ♦ యుడుగవలయు
నిర్మలశ్రద్ధ గైకొని ♦ నిపుణుఁడనఘ॥ శాంతి. ఆ౫. ప242.

150 ఆ. వె. వినుము దీర్ఘవైర♦వృత్తియు ద్రోహాచిం
తనములేక వాక్కు ♦ మనము నొక్క
చంద మగుట సకల ♦ జనములకును[2] బుద్ధి
సంపదాప్తి పరమ♦సాధనంబు॥ ఆశ్ర॥ ఆ ౨॥ప75.



# 3 ప్రవృత్తి ప్రకరణము

౧ - మానుష ప్రయత్నము ఆవశ్యకము.

1 ఆ. వె. పౌరుషంబు చూవె ♦ [1]ఫలమందుఁ గొంద ఱ
ట్లనక దైవమిచ్చు ♦ నండ్రు గార్య
ఫలము గొంద ఱెల్ల♦ఫలము భూతస్వభా
వంబయండ్రు [2]గొంద ♦ ఱనఘ వినుము॥ శాంతి.ఆ౫.ప67.

2 క. విను పౌరుషమును దైవము
నను రెండును గార్యఫలము ♦ నందింపఁగ నె
ట్టనఁ గారణములు గావున
జననాయక సదృశములు వి♦చారింపంగన్॥ అను. ఆ౧. ప141.

3 తే. గీ. పౌరుషమ్ము దైవంబుతో♦డ్పాటులేక
ఫలముఁ బొందంగనేరదు ♦ పార్థివేంద్ర
విత్తు సహకారి గాకున్న ♦ రిత్తనేల
వంధ్యమగుఁగాక తా ఫల♦వంత మగునె॥ అను ఆ౧. ప136.

4 క. క్షేత్రంబు పురుషకారము
ధాత్రీశ్వర బీజ మరయ ♦ దైవము రెండున్
సూత్రపడఁ గూడెనేనియు
బాత్రమగుం గర్మకరుఁడు♦ఫలమున కెందున్॥అను.ఆ౧. ప134.

5 క. విను పురుషుఁడు గావింపని
పనులకు దైవ మదియెట్లు ♦ ఫలమొనరించున్
జనములు గార్యము నడుపఁగ
ననుకూలత నిచ్చుఁగాక♦యయ్యయిఫలముల్॥ అను.ఆ౧.ప135.

6 తే. గీ. సారమతిఁ బరికింపంగఁ ♦ బౌరుషంబు
కంటె దైవంబు ముఖ్యంబు ♦ కార్యసిద్ధి
కెచటనేనియుఁ బౌరుష ♦ మెసకమెసఁగె
నేని యది దైవదత్తంబ ♦ యింతనిజము॥ శాంతి. ఆ౪. ప41.

---

(1) ఫలదమందుఱు గొంద ఱనఘ, (2) గొంద ఱమిత తేజ.

7 క॥ కావున నుద్యోగంబును
దైవంబును గారణములు ♦ దామరసాక్షీ
యేవిధమున కర్మముల ఫ
లావాప్తికి దీనసంశ♦యము[1]లేదనుమిా॥ అను॥ ఆ౫॥ ప156.

8 క॥ దైవంబునేర్పుగా కిటు
పోవఁగ నే నేర్తు నేరఁ ♦ బొమ్మని పలుకం
గా వశమె నరున కెక్కుడు
దైవము పౌరుషముకంటె ♦ ధరణీనాథా॥ ఉద్యో॥ ఆ౨॥ ప99.

9 సీ॥ ప్రారంభముల కెల్లఁ ♦ బౌరుషమ్మును దైవ
మును సాధనమ్ములు ♦ వినుము వాని
లోన నొక్కటిచేతఁ ♦ గానేర దనఘ త
త్ఫలసిద్ధి యెట్లన్నఁ ♦ దలఁచు వాన
కారుపొలంబునఁ ♦ గల్గనేనియుఁ గొల్చు
గావింపనేర్చునే ♦ కలవిధమున
వలనేర్పడఁగ దున్నఁ ♦ బొలములోనైన వ
ర్షంబులేకున్న ధాన్యంబు లగునె
గీ॥ కాఁపు లావువెలివు ♦ గల్గికర్షనము సే
యంగవృష్టిదగిన ♦ యట్లుగలుగ
ఫలము గలుగునట్లు ♦ పౌరుషంబునకు దై
వంబు దోడుపాటు ♦ వలయు నెందు॥ సౌప్తి॥ ఆ౧॥ ప31.

10 చ॥ వెరవున లావునం గృషికి ♦ వేయువిధంబుల మేలొనర్చినం
దొరఁకొనునే ఫలంబు దఱి♦తోఁదగువర్షము లేకయున్న నె
వ్వరుసున లెస్సచేసినను ♦ పౌరుషముల్ ఫలియించునెల్ల నా
దరణమునం బ్రసన్నమగు ♦ దైవముచేతనచూవె ఫల్గునా!
ఉద్యో॥ఆ3॥ ప82.

11 క॥ ఆరంభ రహితుఁబోరదునె
యారయ సంపదలు హీనుఁ ♦ డయ్యును బురుషుం
డారంభశీలుఁడయ యశ్రీ
కారంభులనోర్చు నెంత ♦ యధికుల నయినన్॥సభా॥ఆ౧॥ప121.

---

(1) వలదుచుమిా.

12 మ॥ వినుముద్యోగము రెంటియందు బరమం♦ర్వీనాథ యుద్యోగవం
తునకున్ దైవము దోడ్పడంగ ఫలసి♦ద్ధుల్ [1] చేకుఱు న్మానసం
బున నొక్కొక్కెడ సిద్ధిదప్పిన వగ ♦ ల్పొందంగ రానీక యు
ప్పని దైవోపహతంబుగాఁగనుట భూ♦పాలార్హ వృత్తంబగున్॥
శాంతి. ఆ ౨. ప 127.

## ౨. ఆ చా ర ము .

13 క॥ విను మాచార మవశ్యం
బును నడుపఁగవలయు ధర్మ♦మున కది మూలం
బనఘా ధర్మంబాయువుఁ
బెనుచును లక్ష్మిని యశంబుఁ♦బెంపొందించున్॥ అను.ఆ౪.ప127.

14 క॥ కావున నాచారపరత
భూవర మేల్సాధుజనులు ♦ వోవు తెరువు సం
భావించుట యాచారము
తావర్ణాశ్రమ సమర్హ♦తంబరగు నృపా॥ అను. ఆ౪. ప 89.

16 తే॥ గీ॥ అనఘ యాచారమాయువుఁ ♦ బెనుచునదియు
కాదు శ్రీయును కీర్తియుఁ ♦ గలుగఁజేయు
విను దురాచారుఁ డాయువు ♦ పెనుపుఁ బొందఁ
డతని నఖిలభూతంబులు ♦ నభిభవించు॥ అను. ఆ౪. ప88.

16 ఆ॥ వె॥ సుకృతు లమరలోక ♦ [2]సురుచిరవాసులీ
యిలను డిగి చిరాయు♦వులును నగుదు
రతిచిరముగ నరక♦గతులయి తుదినాయు
వల్పమగు మనుష్యు ♦ లగుట గలుగు॥ అను.ఆ౫.ప134.

17 తే॥ గీ॥ క్షమయు సత్యంబుఁ గృపయు శౌ♦చమును గురుల
వలని భక్తియు నాయువు ♦ పొలుపునిచ్చు
నలుక బొంకు గ్రూరత శుచి♦తాపగమము
గురువిరోధమాయువుగడుఁ♦గుఱ్ఱంగ జేయు॥అను.ఆ౫ప130.

(1) చేకుఱు న్మానసంబున. (2) సుచిరవాసులనిటు| దిగి చిరాయువులను నగుదు రతరు| లని.

18 క॥ తొలు మేన నహింసారుచి
గలిగిన దీర్ఘాయువొందుఁ ♦ గారణభూతం
బులు భూవర యవి యీగుణ
ములు లేమియు కీడులకును ♦ మూలంబరయన్॥ అను.ఆ౫.ప432.

19 ఆ॥ వె॥ ధర్మసాధనంబు ♦ తనువు ధర్మము పర
జ్ఞానదాయి యిట్లు ♦ గానఁదనువు
నోమవలయు మర్త్యుఁ ♦ డేమిట నేమఱ
కాత్మహితము గోరి ♦ యనఘ చరిత॥ అశ్వ॥ ఆ౧॥ ప164॥

20 ఆ॥ వె॥ అర్హ కర్మలోప ♦ మవచయ మొనరించు
ననఘ దేహమున క♦నర్హ భోగ
ధారణములు రోగ♦తతి జనింపఁగఁ జేయుఁ
గామరోషములను ♦ గాయ మెడలు॥ అశ్వ॥ ఆ౧॥ ప168॥

21 క॥ తనలావున కధికమయిన
పనిచేయు టయుక్తమును న♦పథ్యము నగు భో
జనమును హరించు నాయువు
వనిత యవియుఁ బూర్వకర్మ♦వశతనకలుగున్॥అను॥ఆ౫॥ప132.

22 సీ॥ తన సత్త్వమును బలం♦బును దనకయ్యెడు
కాలంబు నారయఁ♦గాఁ దలంపఁ
డాహారములు గొను ♦ నవియును నగు నవి
గానివియును వివే♦కంబు బుద్ధిఁ
బొనుపఁడు బహుళభో♦జన మొకపరిసేయు
[1]నొకపఱిదుర్భిక్ష ♦ నుపవసించు
గతకాలమును నప♦క్వంబును గురుదుష్ట
విషమ[2]విరోధుల ♦ విపులరసము
గీ॥ నైన యన్నము దానర♦యక భుజించుఁ
గుడుపు[3]పైఁ గడుఁదిను నిద్ర♦గూరు సురత
పరతనొందుఁ బెల్లాయాస ♦ పడు విమూఢుఁ
డతని బాధించు దోషత్ర♦యంబు గెరలి॥ అశ్వ॥ఆ౧॥ప166

(1) నొకమాఱి. (2) విరుద్ధంబు (3) గుడుచ్చిదిన.

23 క॥ అత్యంత ప్రబలంబులు
పైత్యవికారములు రేఁగి ♦ ప్రాణములకు శీ
ఘ్రాత్యయముంజేయు మహా
ద్ధత్యంబున నెలవు వెడలఁ ♦ దరిమి సుచరితా॥ అశ్వ॥ ఆ౧: ప169
24 తే॥గీ॥ అవ్వికారంబు లెక్కుడై ♦ యడరి [1]యెచ్చొ
టెచ్చొటు భిన్నంబుసేయు న♦య్యెడలు మర్మ
నామకంబులు మర్మ భి♦న్నత్వ మెట్లు
సేయకుండుఁ బరిచ్యుతి ♦ జీవమునకు॥ అశ్వ॥ ఆ౧॥ ప170
25 క॥ వినుము తెలియంగ శ్లేష్మం
బనుదోష మ్మారఁ బరఁగి ♦ యవయవములు జా
డ్యనిరూఢంబులుగాఁ జే
యును లోపలిబయలు నొయ్య♦నొయ్యన కప్పున్॥
అశ్వ॥ ఆ౧॥ ప171
26 క॥ కుత్తుకకు నడ్డపడు నూ
ర్ధ్వోత్తిలి పోసిక యాఁగు ♦ నూర్ధ్వశ్వాసం
బెత్తఁగఁ జేయును జీవుం
డత్తనువున నుండనేర ♦ కంతట వెడలున్॥ అశ్వ॥ ఆ౧॥ ప173
27 తే॥గీ॥ వాయు వంగంబులందు దు♦ర్వ్యాప్తిఁ గదిరి
నొవ్వుఁ దెవులును బుట్టించుఁ ♦ గ్రొవ్వు చెఱుచు
సందు లెడలించు గ్రమమున ♦ నెందుఁ బరఁగి
తనువు మ్రానుగఁ జేసి జీ♦వుని వెలార్చు॥ అశ్వ॥ ఆ౧॥ ప176
28 క॥ నాలుకయాడుట కేలుం
గాలు ముడువఁ జాప నగుట ♦ [2]గాయముతుదియుం
దీలీలలు వాయుగతు
[3]ల్మేలైనంగలుగు దక్క ♦ లేమిమహాత్మా॥ అశ్వ॥ ఆ౧॥ ప177
29 సీ॥ సజ్జనులందు నా♦చారవంతుల దురా
చారంబు గష్టత్వ♦కారి యట్లు
గావున నాచార♦గతి వింట గడులెస్స
రాజమార్గంబున ♦ రచ్చమంద

(1) యెచ్చటెచ్చట, (2) గాయంబునయందు. (3) మేలైనవి గలుగు దక్కువల.

మూత్రపురీష వి♦మోక్షంబు సేయమి
శౌచిమై వార్చి ని♦ష్ఠను జలంబు
చొచ్చుట సంధ్యల ♦ సూర్య సేవించుట
యరోకాద యాస్తమ♦యముల నిద్ర
గీ॥ బోవకుండుట పంచార్ద్ర♦భావ మొంది
కుడుచు టన్నంబు దెగడమి ♦ దడిపదములు
గలుగ నిదురకుఁ జొరమి స♦త్కర్మవేది
నారదుఁడు వివరించె నా♦చారములుగ॥ శాంతి॥ ఆ౧॥ ప117

30 ఆ॥వె॥ ప్రాఙ్ముఖుండు నార్ద్ర♦పాదుఁడునై భోజ
నంబు సేత మే ల♦నంగ విందు
నిలిచియుండి కుడువు ♦ నింద్య మమ్మెయి మూత్ర
సర్జనంబుఁ బాప♦సరణి యండ్రు॥ అను॥ ఆ౧॥ ప 99

31 క॥ తలఁ జీరఁ జుట్టియును జె
ప్పులు దొడిగియుః జేయు నట్టి ♦ భోజనము ఫలం
బలఘుచరిత! పద్మజుఁ డను
రల భాగం బని విధించెఁ ♦ బ్రకటఫణితులన్॥ అను॥ ఆ౩॥ ప177

32 క॥ ఒకళులు చూచిన యది వా
రికిఁ బెట్టక నములుటయును ♦ బ్రీతిం దన ప
జ్తికిఁ దెచ్చిన చుట్టలు వే
ఱొక భంగింగుడువఁ గుడుపు♦నురువిషభుక్తిన్॥ అను॥ ఆ౧॥ ప111

33 క॥ విను మొరుచూచిన మూచూ
చిన భోజ్యము నింద్య మన్య♦చిత్తము తోడం
గొనఁ దగ దాహారము పొ
త్తునఁ గుడుచుట యఘము గూడు ♦ దూషించుటయున్॥
అను॥ ఆ౧॥ ప 109

34 సీ॥ మానుషీ క్షీరంబు ♦ నీనిన పదినాళ్ళ
లోని ధేనువుల పా♦లును నపేయ
ములు ప్రేతవిషయాన్న♦మును సూతకాన్నంబు
తలవరియన్నంబుఁ ♦ గులట యన్న

మును వనితోఁపజీవనశీలు నన్నంబు
నాడెడుపాడెడు నట్టివాని
యన్నంబు జూదరియన్నంబు సూనరి
యన్నంబు బహిఁ వెట్టినతని యన్న

గీ॥ మును నిజాగ్రజునకు మును పెండ్లియాడిన
పురుషు నన్నమును నభోజ్య మండ్రు
వందియన్న మధికనిందాస్పదంబు ప
ర్యుషితశుష్కములను నుడుగవలయు॥ శాంతి॥ ఆ౧॥ ప322

35 క॥ విను సురతోఁ గూడఁగఁ దె
చ్చినయట్టిది యెద్దియును భుజింపరు భోజ్య
త్వ నిరూపణనిపుణత గల
మనుజోత్తము లఖిలలోకమాన్యచరిత్రా॥ శాంతి॥ ఆ౧॥ ప323

36 క॥ జీవితసంశయ వేళను
భూవర! యొండన్న పానములు లేమిని గల్
దాగ్రివినఁ గల్లగు లెఱుఁగక
త్రావిన నద్దురిత మధికధర్మమునఁ జెడుఁ॥ శాంతి॥ ఆ౧॥ ప297

37 క॥ పగవారియింటఁ గుడిచిన
నగుఁ దమ కనుమాన మమృత మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగ
దగ దొడళుల కెప్పు డెవ్విధము వాటిలునో॥ ఉద్యో॥ ఆ3॥ ప224

38 తే॥ గీ॥ పలు తెఱంగుల వంటకంబులఁ బ్రమాద
జాతమై యశుచిత్వంబు సంభవించి
నప్పు డసురలు గొండ్రు క్రియాఫలంబు
తిలలుపై నల్క నశుచిత దొలఁగు నండ్రు॥ అను॥ ఆ3॥ ప187

39 తే॥ గీ॥ నీళ్ళ నాడక మును పూఁతనిందితంబు
సీర తడితో విదుర్చుట సెట్ట, యొరులు
గట్టి విడిచిన వస్త్రంబు గట్టరాదు
మడతమార్చుటొప్పదు కడుమాఁపు నైన॥ అను॥ ఆ౪॥ ప 107

40 తే॥ గీ॥ ఉదయమగు సూర్యుఁ గనుఁగొను • టొప్ప దన్య
వనిత నగ్నయైయుండంగ • వలదు చూడఁ
దన పురీషంబు చూచుట • ధరణినాథ
కీడు నిజపాపగుప్తి య•కృత్య మరయ॥ శాంతి॥ ఆ౫॥ ప118

41 క॥ మూత్రపురీషోత్సృష్టము
రాత్రిపగలు దక్షిణోత్త•రదిశాముఖతా
సూత్రణము వలయు నది సం
ధ్యాత్రయమును నుత్తరంబ•యగు నప్పనికిన్॥ అను॥ ఆ3 ॥ప276

42 తే॥ గీ॥ ఇన్ని యాచారములలోన • నెక్కుడండ్రు
సకల భూతములందును • సదయుఁ డగుట
యాదిమును లట్లుగావున • నఖిలవర్ణ
ములకు దయకల్మి పెద్దయు•వలయు గుణము॥ అను॥ ఆ౫.ప128

3 - నీతిమార్గము.

43 క॥ పురుషుఁడు రెండు తెఱంగుల
ధర నుత్తముఁ డనఁగఁ బరగుఁ • దా నెయ్యెడలం
బరుసములు పలుకకునికిన్
దురితంబులు వారయు పనులు • దొఱఁగుట 2వలనన్॥
ఉద్యో॥ ఆ౨॥ ప41

44 చ॥ పలుకక యుండుకంటెఁ దగఁ బల్కుట మేలు వినుండు సత్యముల్
బలుకుట ధర్మమార్గమునఁ •బల్కుట సర్వజనప్రియంబుగాఁ
బలుకుట యొండొకెక్కుడగు•భంగులు వీని నెఱింగి యొండు మైఁ
బలుకక సొల్లుచందములఁ • బల్కఁగ మెత్తురు వాని దేవతల్॥
శాంతి॥ ఆ౫॥ ప౬55

45 క॥ చెలిమియుఁ బగయును దెలివియుఁ
గలఁకయు ధర్మంబుఁ బాప•గతియును బెంపుఁ

1 పురీషోత్సృష్టికి 2 కతనన.

దులువతనంబున వచ్చును
బలుకుబడిన కానఁబోసఁగఁ ♦ బలుకఁగవలయున్ ॥ఉద్యో.ఆ౨.ప60

46 క॥ మనమునకుఁ బ్రియంబును హిత
మును బథ్యముఁ దథ్యమును న♦మోఘము మధురం
బును బరిమితమును నగు పలు
కొనరఁగఁ బలుకు నది ధర్మ♦యుతముగ సభలన్ ॥ఆది.ఆ3.ప204

47 క॥ తనువున విఱిగిన[1] యమ్ములు
ననువునఁ బుచ్చంగ వచ్చు ♦ నతి నిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
విను మెన్నియుపాయములను ♦ వెడలునె యధిపా॥ ఉ.ఆ2.ప 62

48 క॥ బెడిదముగఁ గత్తి గొడ్డలి
బొడువఁ దెగిన మ్రానఁ జిగురు ♦ పొడము పలుకులం
జెడఁ దునిసిన కార్యంబు ని
గుడనేరదు పిదప నెట్టుఁ ♦ గురువంశనిధీ ॥ఉద్యో. ఆ౨. ప61

49 క॥ అలిగిన నలుగక యెగ్గులు
పలికిన మఱి విననియట్లు ♦ ప్రతివచనంబుల్
పలుకక బన్నము వడి యెదఁ
దలఁపకయు న్నతడ చూవె ♦ ధర్మజ్ఞుఁ డిలన్ ॥ఆది. ఆ3. ప146

50 క॥ వినుతించిన నిందించిన
ననఘా! మనమున బ్రియంబు ♦ నప్రియమును లే
కునికియు వ్రేసిననైనను
గనలువొడమమియుఁ బ్రబుద్ధ ♦ గణ్యగుణంబుల్ ॥శాంతి.ఆ౫.ప22

51 క॥ జనములు తను నవమానిం
చిన నిందించినను మారు ♦ సేయక సైరిం
చిన శాంతాత్ముఁడు వారల
మును చేసినయట్టిసుకృత ♦ ములనాఁచికొనున్ ॥శాంతి.ఆ౫. ప547

52 క॥ పలుకువడి నతనిఁ బాపం
బులు విడుచుం బలికినతనిఁ ♦ బొందును బాపం

1 యులుంగులు.

బులు నూరుపాపము దనపై
నూలయింపఁగ నేలనింద ♦ యుడిగినఁ గాదే॥ శాంతి. ఆ౫. ప553

53 తే॥ గీ॥ తగిన వేషంబు తను దాన ♦ పొగడుకొనమి
నొచ్చియును గీడు వలుకమి ♦ యిచ్చి వగవ
కునికి తన కెంత నడువక ♦ యున్నఁ బథము
దప్పకుండుట నడవడి ♦ కొప్పఁజేయు॥ ఉద్యో॥ ఆ౨॥ ప45

54 క॥ అనహంకారము నపా
ర్థనమును విషయములఁ బెద్ద ♦ దగులమియును మే
లనఘా! పరు నిందించుట
దనువర్ణించుకొనుటనుచి ♦ తములెయ్యెడలన్॥ శాంతి.ఆ౫. ప453

55 క॥ తల్లికిఁ దండ్రికి సుతులకు
నెల్లవిధంబులను వలయు ♦ హితములు సెప్పన్
మల్లకుఁడుగాక కర్జము
[1]సల్లాపముగాఁగఁజూపి ♦ సౌజన్యనిధీ! అను. ఆ౪. ప 123

56 క॥ చెలిమియు సంభాషణమును
బలిమి వివాదంబు దొ్రక్కుఁ ♦ బాడియుఁ దమయం
తలవారితోన తగు నధి
కుల హీనులతోడనైనఁ ♦ గొఱగా దధిపా! ఉద్యో.ఆ౨. ప 46

57 క॥ కడు నధికుతోడఁ దొడరినఁ
బొడిచిన నొడిచినను బురుషు ♦ పురుషగుణం బే
ర్పడుఁగాక హీను నొడుచుట
కడిఁదియె పౌరుషము దానఁ ♦ గలుగునె చెపుమా॥
సభా. ఆ ౧. ప 122

58 క॥ సమశీల [2]వృత్తయుతులకు
సమధనవంతులకు సమసు ♦ చారిత్రులకున్
దమలో సఖ్యమును వివా
హము నగుఁగాకగునె రెండు ♦ నసమానులకున్॥ఆది. ఆ౫. ప209

1 సల్లక్షముగాఁగఁజూపి. 2 శీలశ్రుతి.

59 చ॥ ధనపతితో దరిద్రునకుఁ ♦ దత్త్వవిదుం డగువానితోడ మూ
ర్ఖునకుఁ బ్రశాంతుతోడఁ గడు♦క్రూరునకున్ రణశూరుతోడ భీ
రునకు వరూథితోడ నవ♦రూథికి సజ్జనుతోడఁ గష్ట దు
ర్జనునకు నెవ్విధంబునను ♦ సఖ్యము దా నొడఁగూడ నేర్చునే॥
ఆది॥ ఆ౫॥ ప208

60 క॥ మిత్రుం డైహికములు నా
ముత్రికములునైన భద్ర♦ములు దలకొలుపు
న్మిత్రధనంబులలోనను
మిత్రుఁడ యెక్కుడనుమాట ♦ మెత్తురు ప్రాజ్ఞుల్॥
శాంతి॥ ఆ3॥ ప526

61 ఉ॥ మిత్రుల[1] చేఁ తలఁగ సుఖము♦ మేకొనునంటయుఁ జెందు దుఃఖముల్
శత్రుల చెద్దినంటయును ♦ సమ్మతి దా ధనమూలమంటయున్
గోత్రవరేణ్య! భోగముల♦కున్ ధనముల్ గరణంబు లంటయుం
జిత్రచరిత్రుఁడైన విధి♦చేష్ట దొఱంగిన నీటివ్రాలగున్॥
శాంతి॥ ఆ౧॥ ప 207

62 తే॥గీ॥ మొదల నప్రియ మయ్యును ♦ దుదిఁ గరంబు
పథ్య మగుపల్కు ప్రియులందు ♦ బలిమినైనఁ
బలుకవలయు మోమోడక ♦ యొలసి యట్టి
వాఁడు తగుమిత్రుఁడగును భూ♦వల్లభునకు॥ సభా॥ ఆ౨॥ ప192

63 క॥ కడు నలుకయుఁ గూర్మియు నే
ర్పడ నెఱిఁగించు నది వాని ♦ ఫలకాలమునం
బిడుగును గాడ్పును జనులకుఁ
బడుటయు వీచుటయు నెఱుక♦పడియెడుభంగిన్॥
ఆది॥ ఆ౬॥ ప 113

64 క॥ ఉత్తమకులజుఁడు సుగుణా
[2]యత్తుఁడు సుస్నేహమతియు ♦ నగు మిత్రునకుం
జిత్త మెలర్చు తెఱంగునఁ
బొత్తు మనఁగవలయుశుభముఁ♦బొందవలసినన్॥ శాంతి॥ ఆ3॥ ప527

1 చెయిదముల్ 2 యుత్తుఁడు సస్నేహా.

65 చ॥ అలుక మనంబునం గదిరి ♦ నాతఁడు దాను నెఱుంగఁ డొడ్లచేఁ
దెలియఁగఁ గార్యతంత్రములు ♦ ధీమహితుం డగు వాని కైననుం
జెలులును జుట్టలుం దగిలి ♦ చెప్పఁగఁ జొప్పడుఁ గాక తక్కని
ర్మల మగు నీతితంత్రము ది♦రంబయి చిత్తమునందు నిల్చునే॥
సౌప్తి॥ ఆ౧॥ ప77

66 క॥ మతిమంతు లైన వారికి
హితు లగు వెరవుగలవార ♦ లెఱిఁగింతురు దు
స్థితిగాకుండను గార్యము
[1] గతి యెంతయు నొత్తినొడివి♦కడవఁబలికినఁ॥సౌప్తి॥ ఆ౧॥ ప80

67 తే॥ గీ॥ దుష్పథంబులఁ జొరనీక ♦ తొలఁగఁ దివుతు
రాప్తజనములు దగ వశ్యు♦లయినవార
లందు బుణ్యంబు దొలఁగిన ♦ నతఁడు దొలఁగుఁ
దొలఁగనేరఁడు భాగ్యంబు♦తొలఁగువాఁడు॥సౌప్తి॥ఆ౧॥ప79

68 క॥ ధీరమంత్రియుతులతోడ వి
చారము సేయునది మును వి♦చారిత పూర్వ
[2]ప్రారంభమయిన కార్యము
పారము వొందును విఘాత♦పదదూరంబై॥ ఆది॥ ఆ౬॥ ప103

69 క॥ తనమేలు కీడు దా మదిఁ
గనుచు హితులు సెప్ప బుద్ధి ♦ గైకొని శుభముం
గొనకొని నడుపుపతికి వ
చ్చునె పశ్చాత్తాప మెట్టి♦చోట నరేంద్రా॥ స్త్రీ॥ ఆ౧॥ ప144

70 క॥ మతి సెప్పఁడు దా ధర్మ
స్థితి నూహించుచును హితులు ♦ చెప్పెడి వెరవు
ధృతి దక్కి యాచరించుచు
జితేంద్రియత గలిగినడువఁ♦జెందును శుభముల్॥సౌప్తి॥ఆ౧॥ ప78

71 క॥ హీనప్రజ్ఞుఁడు కార్యము
లైనవి చేసి తుది వగచు ♦ నతులప్రజ్ఞా
[3]న్మాన రథాధ్యక్షుఁడు వగ
తానఁడు దురితములవిరతి ♦ కోపించియువికిఁ॥శాంతి॥ఆ౩॥ప352

---

1 గతియెంతయుఁ దప్పులడియు 2 ప్రారబ్ధ 3 సానుమదాహూరుఁడు

72 గీ॥ కార్యగతుల తెఱఁగు ♦ కలరూపు సెప్పిన
నధికమతులు దాని ♦ నాదరింతు
[1]రల్పభాగ్యబుద్ధు ♦ లగు వారలకు నది
విరసకారణంబు ♦ విషముఁబోలె॥ అర. ఆ౧. ప59

73 ఆ॥వె॥ కార్యసిద్ధిఁ బొంది ♦ కాలంబు దేశంబు
నెఱిఁగి బుద్ధిమంతు ♦ లెల్లప్రొద్దు
సాహసంబు విడిచి ♦ సామాద్యుపాయ ప్ర
యుక్తి చేయుదురు య♦థోచితముగ॥ అర. ఆ3. ప348

74 ఆ॥వె॥ [2]కనియుఁబండకుండఁ ♦ గాయఁ గోసిన చవి
చేటెగాదు విత్తు ♦ చేటుగలుగుఁ
[3]బక్వమగుడుఁ గోయ♦ఫలమిచ్చుఁ జెడదు బీ
జంబు, కార్యసిద్ధి ♦ చంద మిట్లు॥ ఉద్యో. ఆ౨. ప56

75 తే॥గీ॥ మాలకరి పుష్పములు గోయు♦మాడ్కిఁ దేఁటి
పువ్వు దేనియఁగ్రోలెడు♦పోల్కి నెదురు
గందకుండఁగఁ గొను నది ♦ కార్యఫలము
బొగ్గులకుబోలె మొదలంటఁ♦బొడువఁజనదు॥ ఉద్యో. ఆ౨. ప57

76 క॥ ఆర్యులు దఱితోఁ దగియెడు
కార్య మనుష్ఠింతు రట్లు ♦ గా కప్పని మా
త్సర్యమునఁ దిగిచిపట్టి య
నార్యులు దుది దూఱ వగతు ♦ రాపద యైనన్॥ స్త్రీ. ఆ౧. ప18

77 క॥ ధర్మము దప్పక నయగతిఁ
గర్మాచరణంబు నడుపఁ♦గా ఫలసిద్ధుల్
నిర్మలయశ! యగుఁ దప్పినఁ
బేర్మి చెడదు నింద రా ద♦ఖేదోత్సాహా॥ సౌప్తి. ఆ౧. ప34

78 క॥ తగుపని కుద్యోగించుచుఁ
దగ నెఱిఁగెడు హితుల కనుమ♦తంబుగఁ జేయున్
జగతీసురవర! కార్యము
లగువారికిఁ గలుగు విధి స♦హాయత్వంబున్॥ సౌప్తి. ఆ౧. ప33

1 కార్యబద్ధులకు 2 అనియుఁబఁడకుండ యను 3 పక్వమైన గోసిన ఫలమించు.

79 క॥ ఏనరుఁడు మానసము ధృతి
నూన నుచితవృత్తినుండు ♦ నుదిల గొనక యెం
దైనను నెయ్యాదియేనియు
వానికి దుర్లభములేదు ♦ వసుధాధీశా! శాంతి. అ3. ప161

80 క॥ అరిదివిలుకాని యుజ్జ్వల
శర మొక్కని నొంచు తప్పి ♦ చనినం జను నే
ర్పరియైనవాని నీతి
స్ఫురణము పగరాజు నతని ♦ భూమియుఁ జెఱుచుర్.
ఉద్యో. అ౨. ప36

81 క॥ పరహిత ఫలవంతులు సు
స్థిరమూలాన్వితు [1]లపార ♦ ధీయుతులు పర
స్పర సంశ్రయమున జీవిం
తురుమనుజులు వనములోని♦ద్రుమములపోలెన్. ఆది. అ౬. ప182

82 క॥ మైత్రింబోలెదు ధర్మము
ధాత్రీదివిజులకు లేదు ♦ దాని నడపినం
బుత్రా! యేకర్మంబు ప
విత్రతయును వలవదది వి♦వేకముఁ జేర్పన్॥ శాంతి. అ౫. ప102

83 క॥ జనులకు నోడఁబా టగు విధ
మున నడుచుచు లోకనింద్య♦ముల నుడుగుచు మీా
టిన యొకని కలిమి కులుకక
మనుజులతోఁ బొంది పొసఁగి ♦ మను టొప్పు నృపా!
ఉద్యోగ. అ౨. ప 31

84 క. శ్రుతమువలన శ్రోత్రియుఁ డగు
నతుల తపోయుక్తిఁ గడు మ♦హత్త్వము వడయున్
ధృతిచే సహాయయుతుఁ డగు
నతిశయముగ బుద్ధిమంతుఁ♦డగు బుధసేవన్. అర. అ౭. ప42



[1] ఐపాపధీరతులు.

## ౮ - అక్రమప్రవర్తన.

85 ఉ॥ నీతిద్రోహంగి కార్యముల ♦ నెట్టన నాగ్రహవృత్తిఁ జేసినం
బ్రీతిగ సిద్ధిఁబొందినను ♦ ¹భీతి జుగుప్సయుఁ బుట్టు భూజను
ల్వేతురు చేయు చేఁతలు ఫ♦లింపక తక్కిన మున్నవచ్చు న
త్యాతురతాస్పదంబు లగు ♦ నాపద లిద్ధవివేక వైభవా!
సౌప్తి. ఆ౧. ప 35

86 తే॥ గీ॥ బుద్ధిమంతుల తెరువునఁ ♦ బోక యుత్ప
థప్రవర్తులు నడుచు ప♦థంబు నందు
జనుట విను మప్పటికిఁ జూడఁ ♦ దనకుఁ జాల
నించియుండు నాపద నొన♦రించుఁ బిదప॥ శాంతి. ఆ౬. ప 226

87 తే॥ గీ॥ కాని తెరువునఁ బోయినఁ ♦ గలుగు నయ్య
బ్రిదుకు చవియెంతయైన న♦పథ్యములకు
వేడ్కఁ జేయుదు రయ్యవి♦వేకు లెవ్వి
ధమున నాబుద్ధి వినవయ్య ♦ తమక ముడిగి॥ విరాట. ఆ౨.ప73

88 తే॥ గీ॥ వంకయైన తలంపెల్ల ♦ వసుమతీశ!
యరయ మృత్యుపథం బగు♦నార్జవాన్వి
తంబు బ్రహ్మపథం బింత ♦ తథ్య మేల
యీఱితాఱ తలంపుల ♦ బీఱువాఱ॥ అశ్వ. ఆ౧. ప108

89 ఆ.వె వేదవిహితవిధుల ♦ నాదరించుట యూర్ధ్వ
గతికిఁ దెరువు విధులఁ ♦ గడచి యెందు
నాఁగఁబడిన వాని ♦ లోఁగఁగఁ జేయుట
యధమగతికి మార్గ♦మనిరి బుధులు॥ ఆది. ఆ౮. ప110

90 ఆ॥ వె॥ ఆగమోక్తకర్మ ♦ మాచరింపమియు ని
షిద్ధమైనదానిఁ ♦ జేయుటయును
²బాత్రజనులు ధరణీ♦పాలవరేణ్య! చె
ప్పుదురు పాపములుగ ♦ బోధ్యతతికి॥ శాంతి. ఆ౧. ప291

---

1 భీతియుఁ గుత్సయు 2 ప్రాజ్ఞజనులు

* ఇప్పటి ప్రతులలో ఈపద్యము కానరాదు. కారణము అరయునది.

91 చ॥ [1]పరుసఁదనంబు బొంకులగు ♦ పల్కులు నన్యధనాభిలాషముం
బరవనితావిలోలతయు ♦ బాంధవ సజ్జన విప్రియంబు దు
శ్చరితులతోడి మైత్రియును ♦ సంతతధర్మరతాభ్యసూయయుం
గరినిభయాన ! ఘోరనర♦కంబునకేఁగెడివారి చిహ్నముల్.
అను. ఆ౫. ప220

92 క॥ పరమర్మ [2]భేదములు నయ
విరహితములు ధర్మకార్య ♦ విముఖంబులు ని
ష్ఠురములు నగుమాటలు స
త్పురుషుం డాడఁడవి సత్య♦ములు గాకునికిన్ ॥ శాంతి. ఆ౫. ప546

93 క॥ అనఘా ! దుఃఖాత్మక మగు
ననృతం బడఁగించుటకుఁ బ్ర♦యత్నమున సుధీ
జను లాచరింతు రనిశం
బును మోహవిఘాతనియమ♦ములు నిష్ఠమెయిన్ ॥ శాంతి. ఆ౮. ప102

94 ఆ॥ వె॥ [3]ధర్మమెఱిఁగి దానిఁ ♦ దా నొండుగా లాభ
లోభ పక్షపాత♦లోలబుద్ధి
సభల నెవ్వఁడేనిఁ ♦ సభ్యుఁడై పలుకువాఁ
డనృతదోషఫలము ♦ ననుభవించు ॥ సభా. ఆ౨. ప238

95 ఆ॥ వె॥ సభకువచ్చి ధర్మ♦సందేహ మడిగిన
నెఱిఁగి చెప్పకుండి ♦ రేని సభ్యు
లనృతదోషఫలము♦నం దర్ధ మొందుదు
రనిరి ధర్మవేదు♦లయినమునులు ॥ సభా. ఆ ౨. ప 237

96 క॥ తన యెఱిఁగిన యర్థం బొరుఁ
డనఘా ! యిది యెట్లు సెప్పు♦మని యడిగినఁ జె
ప్పనివాఁడును సత్యము చె
ప్పనివాఁడును ఘోరనరక♦పంకమునఁ బడున్ ॥ ఆది. ఆ౧. ప136

97 క॥ విను మిచ్చెద నని యీమియుఁ
గొనియెద నని పలికి పిదపఁ ♦ గొన కునికియు న

1 పరుసనిపలుకు, 2 భేదములును, 3 ధర్మమెఱింగి.

త్యనృతంబులు సత్యవ్రత
మునకుం దొలఁగంగ మనకు♦భూవర! తగునే॥ శాంతి. ఆ౪. ప150

98 తే॥ గీ॥ సాక్షియును ధర్మదర్శియు[1] ♦ సభలయందు
దప్పఁ జెప్పిరి యేని న♦ధర్మవృత్తి
వరుణపాశసహస్రంబు ♦ వానిఁ గట్టి
పాయు[2] నొక్కొక్కటేఁటేట♦నాయతముగ॥ సభా. ఆ౨. ప242

99 క॥ పలుమఱు శపథంబులు నం
జలులును నభివాదనములు ♦ సామప్రియభా
షలు మిథ్యావచనంబులు[3]
గలయవి దుష్టస్వభావ ♦ కాపురుషులకున్॥ ఆది. ఆ౬. ప111

100 క॥ మృదుభాషణముల దుర్జన
హృదయములు ప్రసన్నతాము♦హిమఁ బొందునె యె
ల్లిదముగఁ గొని యంతంతకు
మద మెక్కంగాక దురభి♦మానము పేర్మిన్॥ ఉద్యో. ఆ౧. ప34

101 ఆ॥ వె॥ చేటుకాలమైనఁ ♦ జెట్టమాటలు నెఱి
గాని తెరువు వట్టి ♦ కర్జములును
దగవు లట్ల దోఁచు ♦ దగియెడు నవి యవి
నీతు లని మనమున ♦ నిశ్చయించు॥ ఉద్యో. ఆ౨. ప 64

102 క॥ నెమ్మిగలవారి నొల్లరు
త మ్మొల్లనివారి వెనుక ♦ దగులుదు రధిక
త్వమ్మొఱిఁగి యెఱిఁగి తొడరుదు
రిమ్మెయిఁ గని యట్టివార ♦ లిభపురనాథా॥ ఉద్యో. ఆ౨. ప 34

103 క॥ బలవంతుఁడు పై నెత్తిన
బలహీనుఁడు ధనము గోలు♦పడినయతఁడు ము
[4]చ్చిలి వేఁగునతఁడు గామా
కులచిత్తుఁడు నిద్ర లేక ♦ కుందుదు రధిపా॥ ఉద్యో. ఆ౨. ప21

---

1 సాక్ష్యవిధుల। దప్పఁగాదు దప్పినను నధర్మయుక్తి 2 నేఁ డేఁట నొక్కొక్క ౯డాయతముగ, 3 మిథ్యావినయంబులు 4 ముచ్చిలి వేచు,

104 ఆ॥ వె॥ యోగ్యతృష్ణఁ దగిలి ♦ యుచితంబు గొలఁదిమై
నడుచుచుండువారు ♦ బెడిదములకు
నంత నొత్తు రెట్లు♦సంతాపకారుల
కాక పెనుకువలు సు♦ఖంబు లగునె॥ ఉద్యో. ఆ౧. ప 307

105 చ॥ పగ యడగించు టెంతయు శు♦భం బది లెస్స యడంగునే పగం
బగ పగకొన్న మార్కొనక ♦ పల్కక యుండఁగ వచ్చునే కడుం
దెగ మొదలెత్తి పోవఁ బగ♦తీర్పక యుండినఁ గ్రౌర్యమొందు నే
మిగతిఁ దలంచినం బగకు ♦ మేలిమి లేదు ధ్రువంబు కేశవా!
ఉద్యో. ఆ౩. ప21

106 క॥ తెగఁదీర్పక తెగనార్పక
తెగటార్పక కడమ కొంత ♦ ద్రిక్కఁగ నున్నన్
జగతీశ! యప్పు నగ్నియుఁ
బగయును మఱిపెఱుఁగు గీడు♦పాటిల్లు దుదిన్॥ శాంతి.ఆ౩.ప276

107 క॥ విను చల్లనిమాటలలో
మునిఁగి యలుక గుబ్బతిలు స♦ముద్రజలములో
నన యుండి యూర కెప్పుడు
గనగనయను బాడబాగ్ని ♦ కరణి నరేంద్రా॥ శాంతి.ఆ౩. ప363

108 ఆ॥ వె॥ పగయు గల్గెనేనిఁ ♦ బాయునె గూఢమై
మ్రాని నగ్ని యున్న♦మాడ్కి నుండు
గాన నమ్మ[1]చేరఁ ♦ గాలాంతరంబున
నైనఁ జెడును సంది♦యంబు వలదు॥ శాంతి. ఆ౩. ప 258

109 క॥ నెయ్యముచెడినను మాటల
తియ్యఁదనము వట్టి పగ మ♦దిన్మఱచినఁ జా[2]
వయ్యెఁ గలఁకయ్యె మఱి చే
టయ్యె నొకటి మూఁడుగాక♦యది మే లగునే॥ శాంతి.ఆ౩.ప256

110 క॥ బాలుఁడని తలఁచి రిపుతో
నేలిదమునఁ గలసి యునికి ♦ యిది కార్యమె యు
త్కీలానలకణ మించుక
చాలదె కాల్పంగ నుగ్ర♦శైలాటవులన్. ఆది. ఆ౬. ప116

1 శేల 2 జావయ్యెం జేటయ్యె కఱక యయ్యె.

111 క॥ మొనసి యుపకారిఁ గడ నిడి
కొనియుండెడు కుమతి దీర్ఘ♦ కుజశాఖాగ్రం
బుననుండి నిద్రవోయెడు
మనుజునకుసమాన మగుఁ బ్రమ♦ త్తత్వమునన్॥ ఆది.ఆ౭.ప117

112 క॥ తన కపకారము చేసిన
జనుఁ డల్పుం డనుచు నమ్మి[1] ♦ జడమతియయి చే
కొనఁజన దించుక ముల్లయి
నను బద్ధతులందు నున్న ♦ నడవగ నగునే॥ ఆది. ఆ౭. ప115

113 క॥ తన కిమ్మగు నంతకు దు
ర్జనుఁ డిష్టుఁడపోలె నుండి ♦ సర్పము పోలెన్
తన కిమ్మగుఁడును గఱచును
ఘన దారుణకర్మగరళ♦ఘనదంష్ట్రలచేన్॥ ఆది. ఆ౬. ప112

114 ఆ॥ వె॥ వినుము నేల ద్రోచి♦కొనినను దాయాదు
లైన మాటిమాటి♦కైన నాఁడు
వారియెడను గీడు ♦ వారల చేసిన
బగ జనించు నిట్టి ♦ భంగు లైదు॥ శాంతి, ఆ౩. ప257

115 ఆ॥ వె॥ మహితశాస్త్రకలిత ♦ మార్గంబు విడిచి ని
జేచ్ఛఁ బగఱ గెలువ ♦ నెవ్వఁ డడరు
వాని నయ్యధర్మ♦వర్ధన శౌర్యము
యెవ్విధమునఁ జెఱచు ♦ నింత నిజము॥ సౌప్తి. ఆ●: ప105

116 క॥ ఎదిరిం దమ యట్టులకా
మదిఁ దలఁచిన బొనఁగుగాక ♦ మాకుం గుడు మిం
డిదె మీరు వ్రేక్క గొన్నుఁ డని
చదురడఁచినమనసుపొందు♦చక్కంబడునే॥ ఉద్యో. ఆ౧.ప312

117 క॥ కాన నవశ్యము పెనుకువఁ
గాని యుపాయమునఁ బగఱఁ ♦ గడ తేర్చి ధృతిం
బూని నడుము[2] నెవ్వం డెద
దానం జెయిపెట్టికొని యు♦తఁడు నిద్రించున్॥ ఉద్యో.ఆ౩.ప19

1 నమ్మిచేకొని యుండం జని దోకయించుక 2 నెవ్వఁడు డెందానన్

130 తే॥గీ॥ ఆత్మ సదృశత ప్రాణి భ♦యంబునందుఁ
బ్రాణులకు నెల్లఁ గని మాంస♦భక్షణంబు
మాను దయనార్ద్రమానసుం♦డైన పురుషుఁ
డాతనికిఁ బ్రహ్మలోకాదు♦లాటపట్టు॥ అను. ఆ ౪. ప308

131 క॥ భూతముల కలుగు నతనికి
భూతము లఖిలములు నలుగు ♦ భూతహితార్థి
భూతతతి కభయ మిచ్చిన
పూతాత్ముకభయమిచ్చు♦భూతావలియున్॥ అను.ఆ౪.ప309

132 క॥ తపముల దానంబుల బ్ర
హ్మపురినివాసంబు దప్ప ♦ దనరాదు జనా
ధిప! మాంసము నమలని పు
ణ్యపురుషునకుసులభమందు♦రానెలవార్యుల్॥అను.ఆ౪.ప300

133 క॥ తను నమలినవాని నమలు
నని మాంసము తెఱఁగు సెప్పు ♦ నాగమములు గా
వునఁ దద్భక్షణ ముడిగిన
ననఘు తపంబునకుఁ జాలు♦నది యొక్కండున్॥ అను.ఆ౪.ప292

134 తే॥గీ॥ మాంసభక్షణ దోషంబు ♦ మాను దాన
మహిమ ననుటయు మాంసంబు ♦ మఱి భుజింప
కున్నఁ జూవె ధర్మములెవ్వి♦యును దలంప
దయకు సదృశంబులే కురు♦ధరణినాథ! అను. ఆ౪. ప307

135 క॥ జనవర! మాంసము చవి గడ
చిన చవు లరయంగ లేమిఁ ♦ జేసి చవి మెఱిం
గినవాఁ డది యుడిగిన నా
తని దేవసమానుఁ డండ్రు ♦ ధర్మాధిజ్ఞుల్॥ అను. ఆ౪. ప293

136 క॥ పితృకార్య యజ్ఞముఖముల
శ్రుతిచోదిత హింస కీడు ♦ సారనేరదు వి
శ్రుతగుణ! మాంసము చవి గో
రి తినంబ్రాణిఁ దెగటార్చు♦క్రియఁ బాపమగున్॥అను.ఆ౪.ప291

137 వ॥ ఇట్లుగాన నంజుడు నమలుటయు నధికదోషంబులు గానియెడలునుం గలిగియుండు, నగస్త్యుండు రాజులకు వేఁట విధించెం

గావునఁ గుతూహలంబు కోపం బనియెడు భావంబులం బొరయక లోకరక్షణార్థంబుగాఁ గ్రూరమృగవధంబును స్వహస్త విక్రమార్జిత మాంసంబున దేవ పితృ ప్రీణనం బొనర్చుటకుఁగాఁ బక్షిమృగమారణంబును సేయు భూనాయకుండు దురితంబులం బొరయకుండు. విశేషంబు వినుము. అను. ఆ౪. ప305

138 క॥ పానము జూదము వేఁటయు
మానినియును భూపతులకు ♦ మధురవినోద
స్థానము లగు నైనను దగ
వైన విధము దక్కఁ దగుల ♦ మాపదఁ దెచ్చున్॥ శాంతి.ఆ౩.ప272

139 ఆ॥ వె॥ జూద మాడి ధర్మ ♦ సూనుఁడు రాజ్యంబు
ననుజులను బ్రియాంగ ♦ నను బణంబు
గాఁగ నొడ్డి యాడి ♦ కాఱియవడఁడె య
ట్లగుట దీనితోడి ♦ యర్థి కీడు॥ విరాట.ఆ౫. ప245

140 ఆ॥ వె॥ కుటిలమార్గులయిన ♦ కుత్సిత కితవుల
తోడఁ గడఁగి జూద ♦ మాడఁ జనదు
దానఁ జేసి [1]యఖిల ♦ ధర్మవివర్జితు
లగుదు రెట్టివారు ♦ జగములోన॥ సభా.ఆ౨. ప167

141 తే॥ గీ॥ క్షత్రనీతికిఁ గ్రమములు ♦ గావు సూవె
నికృతియును జూదమును ధర్మ ♦ నిత్యులయిన
వారి కీరెండు వర్జింప ♦ వలయు నెందుఁ
బాపవృత్తంబు జూదంబు ♦ పార్థివులకు॥ సభా.ఆ౨. ప166

142 క॥ పరధనహరణము దురితము
పరికింపుము వరుణుచేతి ♦ పాశంబుల ని
ష్ఠురముగఁ గట్టువడకు ని
ర్భర నరక కృశానుశిఖలఁ ♦ బడకుము మీఁదన్॥ అర. ఆ౪.ప348

143 క॥ ధన మపహరించుటయు తన
కనిశముఁ బనిగాఁగ బ్రతుకు ♦ నతిలుబ్ధునకున్
విను శత్రులచే నాటకు
మును దనప్రజచేతఁ జేటు ♦ మూఁడు నరేంద్రా॥ శాంతి.ఆ౨.ప188

1 యర్థ,

157 గీ॥ అంగహీను దరిద్రు వి♦ద్యావిహీను
రూపహీనునిఁ దెగడుట ♦ పాప మండ్రు
వేద దేవతా నిందలు ♦ వేతనార్థ
కముగ జోస్యంబు నడుపుట ♦ కల్మషములు॥
అను. ఆ౮. ప 104

158 క॥ విను మధురాహారంబులు
గొనుటయుఁ బెక్కండ్రు విడ్రి♦ గూరిన యెడ మే
ల్కని యునికియుఁ గార్యాలో
చనము దెరువునడుచుటయును ♦ జన దొక్కనికిన్॥
ఉద్యో. ఆ౨. ప38

159 క॥ ఏపాపమేని లేసిది
కాపురుషత నొకనిమీఁదఁ ♦ గలిగించిన న
ప్పాపము చేసినవాఁ డగు
నాపలువ యనంగ విందు ♦ మార్యులచేతన్॥ శాంతి.ఆ౩.ప439

160 తే॥గీ॥ ఎఱుక గలఁడేని మఱిశక్తుఁ ♦ డేని నన్యు
లన్యులకు హింస గావించు♦నపుడు దాని
బూని వారింపకున్న య♦ప్పూరుషుఁ డేగు
హింసచేసినవారలు ♦ యేగు గతికి॥ ఆది. ఆ౨. ప145

161 చ॥ వసుధ నధర్మవర్తు లగు♦వారల వర్తన మెన్నఁడున్సమం
జసమయి నిల్వనేరదు భృ♦శంబుగ నాశముఁ బొందు దుర్మద
వ్యసనుల ధర్మవర్తనఁ [1]బ్రి♦వర్తితు లయ్యును నేమ చూడ రా
క్షసులును దైత్యదానవులు♦గ్రాఁగరె తొల్లిసహస్రసంఖ్యలన్॥
ఆగ. ఆ౨. ప 309

162 క॥ తగు నిది తగ దనియెదలో
వగవక సాధులకుఁ బేద♦వారల కెగ్గుల్
మొగిఁ జేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబు ♦ లైన భయంబుల్॥ ఆది. ఆ౧. ప85

163 తే॥గీ॥ దినము రాత్రియు ఋతువులు ♦ మనుజుచేయు
సుకృతమును దుష్కృతంబును ♦ జూచుచుండు

(1) బ్రివర్తితులయ్యు

గాన నెంతరహస్యంపు ♦ కార్యమైన
నొరులెరుంగరు నన్నని ♦ [1]యునికితగదు॥ అను ఆ ౨. ప 214

164 చ॥ విమలయశోనిధీ! పురుష♦వృత్తమెఱుఁగుచునుండుఁ జూవె వే
దములును బంచభూతములు ♦ ధర్మువుసంధ్యలునంత రాత్మయుఁ
యముఁడును జంద్రసూర్యులున♦హంబునురాత్రియునన్మహాపదా
ర్థము లివియుండగానరుఁడు♦దక్కొన నేర్చునె తన్ను ముచ్చిలన్.
ఆది. ఆర. ప78

165 క॥ చనినఁజను, నున్ననుండున్,
మనుజు డొకటిసేయఁ జేయు ♦[2]మనుజాధిప! తో
డనె తగిలి నీడవోలెను
విను చేసిన కీడుమేలు ♦ విడువవువానిన్ ॥ శాంతి. ఆర. ప76

166 క॥ గురువునకు మారుపలికినఁ
బొరసినకల్మషము వాసి♦పోవు నతనికిం
బరితోషముగా వినయపు
వెరవున నుపహార మిచ్చి ♦ వినతుండయినన్ ॥శాంతి.ఆ౧.ప311

167 క॥ అనృతోపచారకలనం
బునఁబుట్టిన పాతకంబు ♦ పోవుం దానె
వ్వని నపచరించెఁ దగనా
తనిఁ బ్రీతునిఁజేయ ధర్మ♦ తత్వప్రవణా! శాంతి. ఆ౧. ప310

168 క॥ కలఁగిన పెద్దమడువు విను
తెలివిఁ బొరయునట్లు దాన ♦ ధీరుండయి య
గ్గలములయిన దురితంబుల
గలగియుఁదనయంతఁ దేఱు♦గౌరవముఖ్యా॥ శాంతి.ఆర. ప34.

169 క॥ మదిమఱువునఁ బాపము దన
కొదవుటయును బిదప వగచి♦ [3]యొకసగమును నే
నిది సేయనింక ననియెడు
మదిఁ[4]బెఱసగమును నరుండు♦మలవు నఘంబున్॥ ఆర.ఆ౫ప41

---

1 యునికిమోస 2 నరనాయక 3 యొక్క సంగమున్నది 4 చెరఁగమయిన నరుడు యానగవలయుఁగా,

170 చ॥ దురితముచేసి తాపమునఁ ♦ దూలిన నిం కిటు సేయన న్మతిం
బొరసిన ధర్మసంచరణ ♦ బుద్ధియు మేలని యూఁదినం గ్రియా
పరుఁడయి మేలు చేసినను ♦ బాదము పాదముగాఁ గ్రమంబున
న్విరియు సమస్తపాపం తదభి ♦ విష్టకలంకము నిర్భయంబుగన్.
శాంతి. ఆ3 ప363

171 ఆ॥వె॥ అతివ కామకృతము ♦ లైనకర్మంబుల
ఫలము లనుభవింప ♦ వలయు వినుమ
కామకృతము చెడుట ♦ గలుగుఁబ్రాయశ్చిత్త
మాచరింప సంశ♦యంబు వలదు॥ అను. అ౫. ప 118

---

౫. రాజధర్మము.

172 మ॥ ధరణీశా! నృపధర్మ ముత్తమము స♦ ద్ధర్మంబులందెల్ల నే
తెరవున్ రాజరయంగఁ గాదె తగసి♦ద్ధింబొందుఁ గామంబు గ్రో
ధరయంబున్ మగుడించి దండము సమ♦త్వవ్యాప్తిఁజెల్లించుచున్
ధరఁబాలించినరాజు వొందుగతిఁ బొం♦దన్ శక్యమే? యేరికిన్॥
శాంతి. ఆ ౨ ప247

173 క॥ నరరూపంబునఁ బఱఁగెడు
పరదేవతగాన న్నృపుఁడు ♦ బాలుఁ డయిన న
వ్వరుషు నెడ నేమి పొమ్మని
తిరిగిన దుర్మతులఁ బొంద♦దే కీ డధిపా! శాంతి. ఆ౧.ప92

174 తే॥గీ॥ చారచక్షుఁడై[1] తగ నెల్ల ♦ జగము నడుపు
సూర్యు డంద్రుడు నరేంద్రుడ[2]ని ♦ నార్యవరులు
దునుము నయ్యెడ జముఁడునాఁ ♦ జనునతండు
దేవతాత్మకుడగుట సం♦దియము మె యధిప! శాంతి. ఆ ౨. ప273

175 క॥ విను నృప! సమ్రాట్టు విరా
ట్టనియెడు శబ్దములఁ బొగడు ♦ నాగమములు నె
ట్టన భూపాలుని ననిన న
తనిఁదగ నర్చింపకుండఁ ♦ దగునె యొరులకున్॥ శాంతి ఆ౨.ప272

---

(1) నుజగము నెల్ల నడుపు (2) నకార్యపరులు.

176 తే॥గీ॥ లోకములు లోకధర్మంబు♦లును నృపాల!
రాజమూలముల్ రాజవి♦రహితమైన
పుడమి జనులకు నింకిన ♦ మడువులోని
జలచరంబులు వడుపాటు ♦ సంభవిల్లు॥ శాంతి. ఆ౨. ప265
177 తే॥ గీ॥ విభుఁడు లేకున్నజనములు ♦ సభయహృదయు
లగుచు హాహానినాదంబు ♦ లడరఁ దల్ల
డిల్లుదురు రాజు లేమియ ♦ యెల్లవారు
లేమి కల్మి యకల్మి [1] ని♦ర్లేపరహిత॥ శాంతి. ఆ౨. ప267
178 క॥ తనధన మిది యని యూఱడి
మనఁ బరిణయ మాదియైన ♦ మహితోత్సవముల్
గొనియాడ నెవ్వరికి వ
చ్చునె జనపాలుండు లేని♦చో నిర్భయతన్॥ శాంతి. ఆ౨.ప268
179 సీ॥ ఏనుంగు[2]నంజలో ♦ నెల్ల సత్వంబుల
[3]యడుంజలు నడఁగిన ♦ యట్లుపోలె
రాజిత క్షత్రధ♦ర్మమునకు లోనయి
సర్వ ధర్మంబులుఁ ♦ జను మఖములు
వేదంబులును శుభ♦వృత్తంబులును దండ
నీతిమానినఁ జెడు ♦ భూతలంబు
సంస్కారరహితమై ♦ చాల హీనతఁ బొందు
నట్లైనఁ బ్రజకుఁ జే♦టావహిల్లు
తే॥ గీ॥ రాజు లరసిన నెమ్మది ♦ బ్రతుకుఁ గాన
రాజు సర్వోత్తముఁడు ధర్మ♦రాజియందు
రాజధర్మంబ యెక్కుడు ♦ రాజనంగ
ధర్మదేవత యన వేతె ♦ ధర్మతనయ॥ శాంతి. ఆ ౨. ప239
180 సీ॥ రాజు సుత్తమగుణ ♦ భ్రాజిష్ణు నభిషిక్తుఁ
గావించుకొని యెల్ల ♦ కార్యములును
దన్ముఖంబునఁ జెల్ల ♦ దద్దయు సుఖ ముండఁ
బడయుదు రొకఁడు భూ♦పాలనంబు

---

(1) దుర్లేప (2) పాజ్జ (3) పాజ్జ.

సేఁతలేకున్న దుఃస్థితులై జను
లన్యోన్య దార ధనాపహరణ
మాచరింతురు మీఱి యట్టుల బలవంతు
లల్పులఁ దమకు నాహారములుగ
గీ॥ గొండ్రు భూపతి లేకున్న మండ్రజనము
లధిప! కృషి సేయుటయును బేహారమాడు
టయును గోరక్షగావించుటయును మొదలు
గాఁగ బ్రతికెడు తెరవులు గాసిగావె? ॥ శాంతి. ఆ ౨. ప255

181 క॥ తరణి వాడిచి తమము చెఱుచు
కరణిని లోకమునఁగల్గు కల్మషమెల్లన్
ధరణిపతి![1]యాత్మధర్మ
స్ఫురణంబునఁ జెఱుచు విమలబోధనచరితా॥ శాంతి.ఆ౨.ప160

182 క॥ జనపాలుఁడు మృదుకర్మం
బున నయినను గ్రూరకర్మమున నయినను నే
ర్పున నుద్ధరించునది త
న్ననపాయతఁ బొందఁజేయునది కర్మంబుల్॥ ఆది.ఆ౬.ప104

183 క॥ కాని చెయిదములు సేయక
నూనపు ధర్మమున నడుచు నుర్వీశుఁడు సం
తానము బంధులుఁ బ్రజయును
దానును సేనయునుశుభము దలఁకొన నేర్చున్॥ శాంతి.ఆ౨.ప406

184 తే॥గీ॥ తాను మున్ను వినీతుఁడై తనదుమంత్రి
వరులఁ బుత్త్రుల భృత్యుల వరుసతోడ
వినయవంతులఁ జేసి భూవిభుఁడు ప్రజకు
రక్షణముసేయ నిహముఁ బరమును గల్గు॥ శాంతి. ఆ౫. ప96

185 క॥ తనుఁ దాన తొలుత గెలువ
న్మనుజపతికి వలయుఁ బిదప మార్తుర గెలువన్
మనమునఁ దలఁచునది మును
తను గెలువనిపతికి గెలువఁదరమే పగఱన్॥ శాంతి.ఆ౨.ప276

(1) ధర్మమార్గ.

186 ఆ॥వె॥ వినుము తన్ను గెలుచు ♦ దనఁగ వేఱొకఁడె పం
చేంద్రియములఁ[1] బార♦నీక క్రాలఁది
నాఁగుటయు జితేంద్రి♦యత్వంబు గలరాజు
రిపులఁ జెఱుపఁ జాలు ♦ నృపవరేణ్య॥ శాంతి. ఆ౨. ప277

187 తే॥గీ॥ వీరు నమ్మంగఁ దగుదురు ♦ వీరు నమ్మ
దగరు నాఁగను వలవదు ♦ తత్త్వబుద్ధి
నెవ్వరిని విశ్వసింపక ♦ యెల్ల ప్రొద్దు
నాత్మరక్షాపరుం డగు♦నది విభుండు॥ ఆది. ఆ౮. ప109

188 క॥ కడునమ్మి యునికియును నె
క్కుడు నమ్మమియును సుశీల! ♦ కుశలతగా దె
య్యెడనైనను బుద్ధి సొలిపి
తడవి కనుఁగొనంగవలయుఁ ♦ దగవు తగమియున్॥
శాంతి. ఆ౨. ప187

189 ఉ॥ తాలిమిఁ జేర్పువారలును ♦ ధర్మవిధిజ్ఞులు సత్యవంతులున్
లోలత లేనివారు మద♦లోభ నిరర్థక కోపహీనులున్
శీలసమేతులుం బలుకు ♦ నేర్పుట కార్యము గాన్పు పెంపుమైఁ
జాలుటగల్గు భృత్యులును ♦ సంపదఁ జేయుదు రాత్మభర్తకున్॥
శాంతి. ఆ౩. ప468

190 క॥ శౌర్యము సత్యంబును స
త్కార్యజ్ఞానమును భక్తి ♦ తాత్పర్యము గాం
భీర్యము గలిగినఁ గురుకుల
వర్య! కులంబేల సిరికి ♦ వాఁ డుత్తుఁడగున్॥ శాంతి. ఆ౩. ప99

191 చ॥ కులమని పట్టి చిత్తమునఁ ♦ గూరిన కీడరయంగ లేక యు
గ్గలపు విభూతి దుష్టునకుఁ ♦ గల్గఁగఁజేయుట కర్జమెట్లు భృ
త్యులమదియున్న రూపగసి ♦ యుత్తమమధ్యమ హీనరూపమా
త్రిలకుఁ దగంగ నయ్యయిప♦దంబుల నిల్పుట నీతి భర్తకున్॥
శాంతి. ఆ ౩. ప98

(1) దూలనీక.

192 తే॥గీ॥ తనకు మేలొనరించునా♦తండు మిత్రుఁ
డతఁడు నడుపంగ నెల్లకా♦ర్యములు శుభము
నొందు నేమిట నేమఱ♦కునికితోడ
నృపుఁడు మిత్త్రుపైఁ గార్యంబు♦నిలుపవలయు॥ శాంతి. ఆ౨. ప352

193 ఉ॥ మన్ననకు న్మదింప క వ♦మానము వచ్చిన స్రుక్కక క్రొక్కభం
గిన్నతిఁ గార్యము ల్విగత♦కిల్బిషుఁడై తగఁ జేయునట్టి మి
త్రు న్నరనాయకుండు తన♦రూపుగ నగ్గలమైన శ్రీయున
శ్శున్నతియుఁ ఘటించి మహి♦మోజ్జ్వలుఁ జేత సుఖావహం
బగుఁ॥ శాంతి, ఆ ౨, ప353

194 ఆ॥వె॥ ధర్మరతులు నర్థ♦నిర్మాణచతురులు
లౌల్యరహితులును న♦లంఘితాత్మ
లును సునీతి నిపుణు♦లును గులజులు నగు
పరిజనములఁ బెనుపు♦పతికి హితము॥ శాంతి. ఆ౨. ప189

195 ఉ॥ క్రూరులు లోభులుఁ శఠులు♦గొండెములుఁ జడులుం గృతఘ్నులుఁ
నేరనివారు బొంకునకు♦నిందకు[1]నోర్చిన దుష్టబుద్ధులుఁ
ధీరతలేనిదుర్నయు ల♦తివ్యసనత్వము గల్గువారలుం
జేరువ నున్కి భూపతికిఁ♦జెట్టయొనర్చు నరేశ్వరోత్తమా!
శాంతి. ఆ3. ప469

196 క॥ అవలేపంబునఁ గర్త
వ్యవివేకము లేక వలసి♦నట్టుల యెవ్వం
డవినీతిసేయు ధరణీ
ధవుఁడు విడువవలయుఁ దన క♦తఁడు గురుఁడైనన్॥
శాంతి. ఆ౨. ప182

197 క॥ గుఱుకొని కార్యాకార్యము
లెఱుఁగక దుశ్చరితుఁడయి య♦హితుఁడగు నేనిన్
మఱువక గురునైనను జను
లెఱుఁగగ శాసించునది మ♦హీశుఁడు బుద్ధిన్॥ ఆది. ఆ౬. ప102

(1) నోర్చునంతందు పదయుఁ - ధీరతలేని దుర్నయులు.

198 సీ॥ దక్షుఁడై భూపతి ♦ దండనీతి నయింప
కున్న సన్యాసులు ♦ సత్పథ ప్ర
వర్తను లగుదురు ♦ వారిరి నన్యోన్య
ధనధాన్య పశుభూమి ♦ దారహరణ
మాచరింతురు జను ♦ లప్పాప మవ్విభు
నొందు దండము హింస♦యుగఁ దలంప
వలదు దుర్వృత్తుల ♦ వధియించు తమ్మిని
గోవిందు వాసవు ♦ గుహునిఁజూడు
తే॥ గీ॥ మమ్మహాత్ములు తక్క దు♦ర్మార్గచరుల
దండితులఁ జేత వినమె యు♦ధర్మ మడఁగు
ధర్మమెసఁగు దండమున న♦ర్థమును గామ
మును నదూష్యంబులై సిద్ధిఁబొందు నధిప॥ శాంతి. అ౧. ప108
199 ఆ॥ వె॥ క్షమయ తాల్చియుండఁ ♦ జన దెల్లప్రొద్దు తే
జంబ తాల్చి యుండఁ ♦ జనదు పతికి
సంతతక్షముండు ♦ సంతత తేజుండు
నగుట దోషమందు ♦ రనఘమతులు॥ అర. అ ౧. ప217
200 క॥ పేద యున నగుట ధర్మువు
గాదు నరేంద్రునకు జగము ♦ గావం బ్రోవం
గాదె నృపులోకపాలాం
[1]శోదితుఁడుగఁ జేసెఁ బద్మ♦యోని చతురతన్॥
శాంతి. అ౧. ప91
201 సీ॥ మేదినీపతి యతి ♦ మృదువైన మాావంతు
డేనుంగు నెట్లట్ల ♦ యెక్కియాడు
జూచుఁ దేఁకువ నెడి ♦ నీచవుఁ బ్రజ కూర్రుఁ
డగునేని లోకంబు ♦ బెగడు గుడుచుఁ
గాన వసంతంబు ♦ భానునిచాడ్పున
దగి యెడు[2]వాఁడితో ♦ ధరణి ప్రజల
నుచితవర్తనముల ♦ నొందించునది యిది
రాజధర్మములకు ♦ రాజసుమ్ము

1 శోధితుఁగాఁ జేసె (2) వాటి

గీ॥ కౌరవేంద్ర! యదియుఁ ♦ గాక దండము పరీ
క్షావిశుద్ధి పూర్వ♦కముగ వలయుఁ
దనతలంపు వెంటఁ దమకించి ప్రజకు [1]నొ
ప్పిగఁ జరించుటయును ♦ దగదు పతికి॥ శాంతి. ఆ౨. ప178

202 క॥ దండార్హులైనవారల
దండింపకయున్నఁ జువ్వె ♦ ధాత్రీవిభు నా
ఖండలసన్నిభునైన బ్రి
చండపు కిల్బిషము పొందు ♦ జగతీనాథా! శాంతి. ఆ౧. ప96

203 క॥ పేదలకును సాధులకును
వేదములకుఁ దాపసులకు ♦ వేయేల సమ
స్తాదిత్యులకును దండమ
కాదె బ్రదుకు జేయు రాజు ♦ గావింపంగన్॥ శాంతి. ఆ౧. ప97

204 క॥ గరదుని గృహదాహకు మం
త్రరహస్యవిభేది వధవి♦ధాయిఁ బరసతీ
హరు బంధుఘాతిఁ బరధన
హరణపరునిఁ జంపి పుణ్యుఁ ♦ డగు నృపుఁ డనఘా॥
శాంతి. ఆ౧. ప95

205 క॥ చోరులచేఁ జెడకుండం
గ్రూరులచేఁ జావకుండఁ ♦ గువలయుజనులన్
జారులచేఁ జెడకుండ ధ
రారమణుఁడు నేర్పుగలిగి ♦ రక్షింపఁదగున్॥ శాంతి. ఆ౨. ప387

206 క॥ ధర్మ మధర్మముభంగి న
ధర్మము ధర్మంబుమాడ్కి ♦ దనరయా! తోఁచున్
నిర్మలమతి వరయవలయు
ధార్మికతన గోరునాఁడు ♦ దన కేర్పడఁగన్॥ శాంతి. ఆ౩. ప71

207 క॥ ధర్మ మధర్మము బోలు న
ధర్మము [2]బాహ్యధర్మమగు వి♦ధంబునఁ దోఁచుం
గర్మసమితి నాలోకించుడు
ధర్మగతి యెఱుంగవలయుఁ ♦ దజ్జ్ఞ(శ్ర)ములన్॥ శాం.ఆ౫.ప88

(1) నొవ్వగ (2) ధర్మపథ.

208 క॥ అనఘ! యధర్మము ధర్మం
బనుమతిఁబుట్టించుఁ దృణస♦మావృతపై పఱి
న్నని తలముచందమునఁ దోఁ
చిన మాయుంబోలె సూక్ష్మ♦చిత్తత లేమిన్॥ అను. ఆ౧. ప409

209 క॥ కామార్థంబులు మోహా
ద్దామతఁ గృత్యంబు లని యొ♦దం గని ధర్మ
స్తోమమునఁ దగులు జనముల
చే మేలుగ నెఱిఁగికొను మ♦ సిద్ధవివేకా॥ అను. ఆ౧. ప413

210 క॥ శ్రుతము బరిత్యాగముగల
మతిమంతుల నడుగు లోభ♦మద మోహ సమా
వృతబుద్ధులు కాని సమం
చిత చరితులవలనఁ దెలియు ♦ శీలనిరూఢా॥ అను. ఆ౧. ప412

211 క. వారిరిమాటలఁ దేలక
భావంబునఁ గీడు మేలు ♦ బరికించి యస
ద్భావుని సద్భావుని [1]ధర
ణీవర! యేర్పఱుప నెఱుఁగ నేరగవలయున్॥ శాంతి. ఆ౩. ప81

212 క॥మిత్రత్వము శత్రుత్వము
పాత్రతయు నపాత్రతయును ♦ బరికించు సుచా
రిత్రుఁడు చిరతరగణనా
సూత్రితముగ దాన నెల్ల♦శుభములుపొందున్॥ శాంతి.ఆ౫.ప289

213 క॥ కార్యవిచారము చిరముగ
ధైర్యముతో నడుపవలయుఁ♦ దత్క్రియలం
దార్యుఁ డనార్యుడు వీఁడని
యార్యులు సేయుదురు నిశ్చ♦యంబు[2]చిరముగన్॥
శాంతి. ఆ౫. ప288

214 క॥ విను మచిరవృత్తిఁ జేసిన
పని కర్తకు నావహించు ♦ బశ్చాత్తాపం

---

(1) జనసీవర నివేర్పరింప, 2 చిరము గన్.

బనఘూ! చిరభావిత శు
ద్ధనిరూపణకృతము శుభము◆ దేజము దెచ్చున్॥
శాంతి. ఆ౫. ప292

215 ఆ॥ వె॥ ఇవ్విధంబుగాక◆క్రొవ్వి కామక్రోధ
కలితచిత్తవృత్తి◆ గలుగనడచు
పతికి నగుఁ జతుర్థ◆భాగంబు ప్రజసేయు
పాపముల కులప్ర◆దీపచరిత! శాంతి. ఆ౧. ప177

216 క॥ రక్షఁ బ్రజగోరు నిజయో
గ క్షేమార్థముగ జనసు◆ఖస్థితినడుపన్
దక్షుఁడగురాజు నడుప కు
పేక్షించినఁ బాప మొంద◆దే కురుముఖ్యా॥ శాంతి. ఆ౧. ప82

217 క॥ దోష మరసి కామంబును
రోషంబునులేక తగిన ◆ రూపునఁజేయుం
బోషక మగు ధర్మమునకు
వైషమ్యవిహీనమైన◆ వధము కుమారా॥ శాంతి. ఆ౫. ప297

218 క॥ వెలయ విధిదృష్టినయమున
వలయుఁ బరాక్రమము సేయ◆ వసుధేశ్వర! య
గ్గలమగు బుద్ధియుఁ గడఁకయుఁ
గలపురుషున కిదియచూవె◆ కర్తవ్య మిలన్॥సభా. ఆ౧. ప129

219 క॥ నరుకుట యుద్ధముఁ గొనుటయుఁ
జెఱనును చుట కట్టియడఁచి◆ చేట్పాటొందం
బఱచుట మొదలుగఁగల పలు
దెఱఁగులఁదగవుమెయి నడపు ◆ ధీరవిచారా॥ శాంతి॥ఆ౨.ప376

220 సీ॥ వ్యవహారశుద్ధి స◆ర్వప్రజాప్రియకారి
యదియ భూపతికి ధ◆ర్మాతిశయము
గీర్తియుజేయు న◆క్షీణ (1)సత్వులుధర్మ
పరులునునైన భూ◆సురులు నీవు

(1) పత్యులు.

తాఁసులువోని చి॰ త్తంబులతోడనుఁ
బ్రజవివాదంబులు ♦ పక్ష ముడిగి
విని ధనవాంఛమై ♦ ధనికుల దెస వ్రాలి
తీర్పక ధర్మంబు ♦ తెరువు దప్ప
గీ॥ కుండఁ బాడి దీర్చి ♦ దండింపఁదగు నెడ
ననుగుణంపుదండ ♦ మాచరింపు;
మొఱఁగఁ బలికితేని ♦ నుండదు ప్రజ; డేగఁ
గనిన పులుగుపిండి♦కరణిఁ జెదరు॥ శాంతి. ఆ౨. ప374

221 క॥ రాజునకుఁ బ్రజ శరీరము
రాజు ప్రజకు నాత్మగాన ♦ రాజును బ్రజయుఁ
రాజోత్తమ! యన్యోన్య వి
రాజితులై యుండవలయు ♦ రక్షార్చనలన్. శాంతి. ఆ౨.ప274

222 చ॥ కపటము లేక వైభవము ♦ గప్పక యెండొరు మీద రాజుపై
నపరిమిత ప్రియం బెసఁగ ♦ నల్గక యుండు ముదంబు పొంది యే
నృపు. విషయంబునం బ్రజ వి♦నిర్మల వృత్తతఁ బుత్రుభంగి నా
నృపు నృపుఁ డండ్రుగాకితరు♦నిం దగువా రెద నియ్యకొందురే?
శాంతి. ఆ ౨. ప190

223 గీ॥ భూతవృద్ధులు ధనలాభ♦ములును గలుగు
ధర్మమునను రా జనువాఁడు ♦ ధర్మరక్ష
కై జనించెను. గావున ♦ నతఁ డరోష
కాముఁడై ధర్మనిరతుండు ♦ గాఁగవలయుఁ శాంతి. ఆ౨. ప401

224 క॥ ధనమునకై ధర్మము దెస
ననాదరము చేసెనేని ♦ నానృపతికి న
ద్ధనమును జెడు దుర్యశముం
బనుగొనుఁ దుది దుర్గతియును ♦ బాటిలు ననఘా!
శాంతి. ఆ ౨. ప409

225 క॥ లాభంబు ధర్మ ముఖ్యము
గా భరపడి మార్గశుద్ధి ♦ గనుఁగొని కైకో
లాభావరునకు నిహపర
శోభనములు నేత చెప్పు♦శ్రుతివాక్యంబుల్॥ శాంతి.ఆ౨.ప410

226 క॥ ఆయతి కిమ్మోయిఁ గలుగు ను
పాయంబులు ధర్మమార్గ ♦ ఫలితంబులుగాఁ
జేయుటయు మేలు నృపతికి
మాయాకృతినిపుణుఁడగుట♦మతిగాదుసుమీ॥ శాంతి.ఆ౨.ప398

227 క॥ విను కర్షకులును వణిజులు
ననఘా! గోరక్షకులు ధ♦రాధీశునకున్
ధన మొడఁగూడెడు చోటుల
ననేక విధములకును నెల్ల ♦ నాద్యస్థలముల్॥ శాంతి.ఆ౨.ప391

228 తే॥గీ॥ ధనములకు ధాన్యములకు ను♦త్పత్తితలము
లయినవాని కించుకయును ♦ హానిగాక
యుండఁ దనకును భండార ♦ మొదవఁ దగు ను
పార్జనము సేయవలయు భూ♦పాలకుండు॥ శాంతి. ఆ౨. ప392

229 క॥ ఆవు బేహారము గృషియున్
సవరణలును బసుల [1]సొంపు ♦ సరి య ట్లగుటన్
భువిఁ బసులుగలుగు కాఁపుల
నవనీశుఁడు కన్నప్రజల ♦ యట్లరయఁ దగున్. శాంతి.ఆ౨. 388

230 క॥ అరయుటఁ బ్రజ వర్ధిల్లఁగ
నరి యేటేటఁ గ్రమవృద్ధి ♦ యా నట్టులుగా
నరపతికిఁ గొనగవచ్చున్
వెరవునఁ బెంపంగఁ జాల♦వెలయు ధనంబుల్. శాంతి.ఆ౨.ప394

231 ఆ॥వె॥ కోరి తోటవాఁడు ♦ కుసుమఫలంబులు
గోయునట్లు రాజు ♦ గొనగ[2]వలయు
న వ్వనంబు నఱికి ♦ యంగారములు సేయు
భంగియైన భూమి ♦ పాడుగాదె॥ శాంతి. ఆ౨. ప300

232 చ॥ జనకుఁడువోలె నర్మిలిఁ బ్రజం బరికింపుచు షష్ఠభాగముం
గొనువది వారిచేత నరి♦కోటివిధంబుల నాప్తదక్షులన్
ఘన వన గోకులాకర న♦గప్రముఖార్థకరంబు లారయం
బనుచుచు నన్నిటన్ ధరణి♦పాలుఁడు[3]కన్నిడి యుండఁగాదగున్.
శాంతి. ఆ౨. ప283

(1) సొంపువన (2) వలయు నవ్వనంబు (3) కన్నిడియున్నఁ ఖేపగున్.

233 క॥ అరి యారవ పాల్గొనుచుం
గరుణ గలిగి ప్రజలఁ దండ్రి♦గతి మధ్యస్థా
చరణంబునఁ బాలించుట
పరమపదముఁ జేర్చు విభువు ♦ భయ సంశయముల్॥
శాంతి. ఆ౧. ప176

234 క॥ అరి మిగులఁ గొనుట గ్రీవుల
భారమాలఁగ బిదికినట్లు ♦ భూవర! కదుపున్
వెరవునఁ బెనిచిన యట్లగు
నరపతి ప్రజక్షత నప్ప♦నము దగఁ గొనినన్॥ శాంతి.ఆ౨.ప389

235 క॥ పరుసఁదనముమెయి నరిగొనఁ
జొరఁ దగ, దడి పొదుగుగోయు ♦ చొప్పగు, విను పా
ల్గురియించుకొనఁగ దలఁచిన
నరయవలదె గోవుఁ, బ్రజయు ♦ నట్టిద యధిపా॥
శాంతి. ఆ౨. ప299

236 క॥ పులి కూనలఁ దినుచందము
గలిగిన నంతటనె నిలుచు♦గాక ధనంబుల్
గలుగునె మీదం గావున
జలగ దిగిచి నట్లు గొనఁగఁ♦జను నిల సొమ్ముల్॥ శాంతి.ఆ౨.ప393

237 క॥ ధనము సవరించినఁ బ్రియో
జనమేమి యపాత్రములకుఁ ♦ జల్లి చెఱుచునే
ని నరేంద్ర! ముఖ్యవ్యయములు
వినురక్షయ సిరికిఁబాత్ర♦విషయము లైనన్॥ శాంతి.ఆ౨.ప399

238 క॥ విను గర్భిణిప్రజబ్రదుకున
కనురూపములైన యట్టి ♦ యాహారంబుల్
గొనుగతిఁ బతి ధరణీప్రజ
మనికికిఁ దగ నడుచునది త♦మకిగా కెప్పుడున్॥ శాంతి.ఆ౨.ప179

239 క॥ మృదు మధుర వాక్యముల నిం
పొదవెడు చిఱునవ్వుతోడ ♦ నుర్వీశుఁడు స

ప్ర్మోదము సచివులకుఁ బ్రజలకు
నొదవింపఁగవలయు నది మ♦హోన్నతిఁ జేయున్॥
శాంతి. ఆ౨. ప371

240 క॥ యాగములును భోగములును
ద్యాగంబులు బహు విధముల ♦ ధర్మములు మహా
భాగా! నరపతిరక్షా
యోగంబునఁ జెల్లుఁ బ్రజకు♦నుల్లాసముగన్॥ శాంతి.ఆ౨.ప269

241 ఆ॥వె॥ సకల వర్ణధర్మ♦సంకరరక్షయు
సంధివిగ్రహాది ♦ షడ్గుణములు
నలయ కరయుటయును ♦ నర్థసమ్యగుపార్జ
నమును నృపతి యెపుడు ♦ నడుపవలయు॥ శాంతి. ఆ౨. ప185

242 తే॥గీ॥ వర్ణములు నాశ్రమంబులు ♦ వసుమతీశుఁ
డుక్తపథమున నడిపింప ♦ నుభయలోక
సిద్ధి గనుఁ దప్పఁ ద్రొక్కని ♦ శిష్టజనులు
గల నరేంద్రున కింద్రుఁడు ♦ దలఁపసరియె॥ శాంతి.ఆ౨.ప237

243 మ॥అరయం దప్పక్రృతంబెఱుంగు మదలో♦[1]భావేశముల్ లేదు ము
ష్కరుఁ డాత్మస్తుతిలేదు సేయునియతిం♦కార్యంబులీగుణ్ ఘన
స్థిరముల్ శూరుడు గర్విగాఁ డశఠుఁ డ♦స్త్రీలోలుఁ డక్రోధనుం
డరి నొవ్వం గొనఁ డబ్బ్రగ ర్తఁగను రా♦జత్యంతదీప్తుం డగున్॥
శాంతి. ఆ౨. ప296

244 చ॥ అతఁడును మందహాససహి♦తాలపనంబును సత్యభాషణ
వ్రతము సుసంవిభాగనిర♦వద్యతయున్ సమభావమున్ గృత
జ్ఞతయు జితేంద్రియత్వముఁ బ్ర♦సాదఫలంబును గల్గిభూమికిం
బితృసముఁడై విరోధిజన♦భీషణసారత నొప్పఁ బెంపగున్॥
శాంతి. ఆ౨. ప263

245 తే॥గీ॥ అధిప! నానాప్రకార చ♦రాచరంబు
లింద వేత్వ్రఁజ జనియించు ♦ నింద పెఱుగుఁ
బిదప నింద యడఁగు నీ ♦ పృథ్వి దాన
సకలమునకుఁ బరాయణ ♦ స్థానమరయ॥ భీష్మ. ఆ౧. ప17

---

(1) లోభావేశముల్ లేని

246 క॥ వినికిఁగలిగి రక్షించుచు
ననువున దయతోడఁ బాడి ♦ నాయతు లెల్లన్
గొనుచుఁ దగ నేలి పొగడొం
దిన నృపులకు నుర్వి గామ♦ధేనువుగాదే॥ భీష్మ. ఆ౧. ప41

247 క॥ కోపంబులేమి సత్యా
లాపము నిజదారపరవి♦లాసము శుచితా
గోపన మద్రోహం బవ
నీపాలక! సర్వవర్ణ♦నియతగుణంబుల్॥ శాంతి. ఆ౨. ప221

248 తే॥గీ॥ శస్త్రజీవికయును నరి ♦ షష్ఠభాగ
మాహరించుటయును భృత్యు ♦ నరటయును
బ్రాజవివాదంబు వినుచోటఁ ♦ బక్షపాతి
గామియును రాజులకుఁ గృత్య♦కర్మకోటి॥ అను. ఆ౫. ప11

249 ఆ॥వె॥ న్యాయశాస్త్రవేది ♦ యై యింగితాకార
చేష్ట లెఱిఁగి జనుల ♦ శిష్టదుష్ట
తావిశేష మరసి ♦ దండనీతి యొనర్పు
పతికి నెల్లమేలు ♦ పడయవచ్చు॥ శాంతి. ఆ౧. ప175

250 ఆ॥ వె॥ పరులవలన బాధ ♦ వొరయకుండఁగ సాధు
జనుల ధనముగాచు ♦ జనవిభుండు
కరుణదప్పి తాన ♦ హరియించువాఁ డగు
నేని సాధులోక ♦ మేమిచేయు? ఆది. ఆ౭. ప103

251 క॥ వ్యాకులతఁబొంది రూపఱు
లోకస్థితి తొంటి రాజ♦లోకముచే నం
గీకృత మగు ధర్మ మనంగీ
కృత మగు నేని పిత♦కిల్బిషచరితా! శాంతి. ఆ౨. ప159

252 క॥ తరణి శశాంకుల తేజ
స్ఫురణము లేకున్నయట్లు ♦ భూజనములు ని
ర్భరదురితతఁ జేడ్పడుదురు
నరపాలక! విహితపాల♦నము లేకున్నన్॥ శాంతి. ఆ. ౨. ప266

253 సీ॥ ధర్మమార్గంబున ♦ ధరణిఁ బాలించిన
నైహికసుఖములు ♦ నగ్గలంపుఁ
బొగడును బరలోక ♦ భూరి సౌఖ్యములును
సిద్ధించు విపుల దక్షిణలు బెట్టి
యశ్వమేధ ప్రముఖా♦ధ్వరంబులు పెక్కు
లాచరించుటకంటె ♦ నధిక మందు
మేదినీప్రజల న♦త్యాదరంబును గరు
ణాతిశయంబు మ♦ధ్యస్థతయును
గీ॥ గలిగి బిడ్డల నరసిన ♦ కరణి గాఢ
రక్షణం బొనరించుట ♦ రాజవర్య!
వినుము తమ్ములఁ నీగి మ♦న్ననల ననుది
నంబుఁ గొనియాడు మా నంద♦నంబుగాఁగ॥ ఆశ్ర. ఆ౧. ప77

254 క॥ దాంతియుఁ [1]బ్రియవాదిత్వము
శాంతియు శీలంబుఁ గలుగు ♦ జగతీశుఁడ శ్రీ
మంతుండు యశస్వియు నై
యెంతయు సౌఖ్యంబు నొందు♦ నిభపురనాథా! శాంతి.ఆ౨. ప168

255 ఆ॥ వె॥ అర్థసిద్ధికంటె ♦ నరయ నెక్కుడు ధర్మ
సిద్ధి దాన సకల ♦ సిద్ధులును బ్ర
శస్తభంగి జేరు ♦ శాశ్వతకీర్తియు
సంభవించుఁ గలుగు ♦ సద్గతియును॥ శాంతి. ఆ౨. ప408

256 క॥ దయఁ బ్రజ రక్షించుటకు నె
నయె తపములు నధ్వరములు ♦ నరవర! దానన్
జయమును లక్ష్మియునుం గీ
ర్తియు సుగతియుఁ గలుగు వసుమ♦తీనాథునకున్॥
శాంతి. ఆ ౨. ప301

257 ఉ॥ కీర్తియ యిచ్చుఁ బుణ్యగతి♦కీర్తియ తల్లియుఁబోలెఁబ్రోచు స
త్కీర్తియ యాయువున్ సిరియు♦ గీర్తివిహీనుఁడు చూ శవంబు దు

---

1. విజితాత్మత్వ ము.

ష్కీర్తికి నెల్లచేటులును ♦ గిట్టి హరించు ననండె తొల్లి భ
క్తార్తిహరుండు నాఁబరఁగు ♦ నంబుజసూతి జగత్థితంబుగన్ ॥
ఆర. ఆ౭. ప293

258 ఆ॥ వె॥ కీర్తిలేనివాని♦కిని జీవనంబు ని
రరకంబుసూవె ♦ యవనిమీఁద
నిత్యమయిన ధనము ♦ నిర్మలకీర్తియ
యట్టి కీర్తి వడయు♦ట శ్రీమంబె॥ ఆది. ఆ౫. ప31

259 క॥ ఇలఁగీర్తి యెంతకాలము
గలిగి ప్రివర్తిల్లు నంత ♦ కాలంబును ని
త్యులుగారె కీర్తిగల పు
ణ్యులు? కీర్తివిహీనుఁ డెందు♦నుం బూజ్యుండే? ఆది. ఆ౫. ప32

260 క॥ తనకీర్తి యెంతకాలము
వినఁబడు నిజ్జగమునందు ♦ వెలయఁగనందా
కను బుణ్యలోకసౌఖ్యం
బున నెంతయు నుల్లసిల్లు ♦ బురుషుం డనఘా! ఆర.ఆర.ప370



## ౬. సే వా ధ ర్మ ము.



261 ఉ॥ ఎండకు వాన కోర్చి తన♦యిల్లు ప్రివాసము చోటనాక యా
కొండ నలుంగుదు న్నిదుర♦కుం దఱి దప్పెను డప్పి పుట్టె నా
కొండన యెట్లొకో యనక ♦ కార్యము ముట్టినచోట నేలి నా
తం డొక చాయ చూపినను.♦ దత్పరతం బని సేయు టొప్పగున్॥
విరాట. ఆ౧. ప135

262 చ॥ ధరణిపు చక్కగట్టెదురు ♦ దక్కి పిఱుందును గాని యట్లుగా
నిరుగెలనం దగంగొలిచి♦యేమనునో యెటుచూచు నొక్కొ యె
వ్వరిదెస నెప్పు డేతలఁపు ♦ వచ్చునో యీతని కంచుఁజూడ్కి సు
స్థిరముగ దన్ముఖంబునన ♦ చేరిచి యుండుట నీతి కొల్వనన్ ॥
విరాట. ఆ౧. ప129

263 క॥ తగఁజొచ్చి తనకు నర్హం
బగునెడఁ గూర్చుండి రూప ♦ మవికృత వేషం
బుగ సమయమెఱిఁగి కొలిచిన
జగతీవల్లభున కతఁడు ♦ సమ్మాన్యుఁడగున్॥ విరా.ఆ౧.ప121

264 క॥ ఊరకయుండక పలుపుర
త్రోరవ మెసఁగంగఁ బలుకఁ ♦ [1]దొడరకయు మదిం
జేరువగల నాగరకులఁ
దారుగలిసి పలుకవలయు ♦ ధరణీశుకడన్॥ విరాట.ఆ౧. ప127

265 ఆ॥ వె॥ రాజునొద్దఁ బలువు ♦ రకు సంకటంబుగాఁ
దిరుగుపనుల నెంత ♦ తేజమైన
వాని బుద్ధిగలుగు ♦ వారొల్ల రటుమీఁదఁ
జేటు దెచ్చుపెట్లు ♦ సిద్ధమగుట॥ విరాట. ఆ౧. ప126

266 క॥ చనువాని చేయుకార్యం
బున కడ్డముసొచ్చి నేరు ♦ పున మెలఁగుచు దా
నును బయిఁ బూసికొనినఁ దన
మును మెలఁగెడు మెలఁకువకును ♦ ముప్పగుఁ బిదపన్॥
విరాట. ఆ౧. ప125

267 ఆ॥వె॥ వసుమతీశుపాల! ♦ వర్తించు నేనుంగు
తోడనైన దోమ ♦ తోడనైన
వైరమగు తెఱంగు ♦ వలవదు తానెంత
పూజ్యుఁడైన జనుల ♦ పొందు లెస్స॥ విరాట. ఆ౧. ప139

268 క॥ వేఱొక తెఱఁగున నొరులకు
మాటాడక యునికి లెస్స ♦ మనుజేంద్రునకున్
తీఱమిగల చోటులఁ దా
మీఁటికడఁగివచ్చిపంపు ♦ మెయికొనవలయున్॥ విరాట.ఆ౧.ప128

269 ఆ॥వె॥ ఆవులింత తుమ్ము ♦ హాసంబు నిష్ఠీవ
నంబు గుప్తవర్త ♦ నములు గాఁగ
సలుపవలయు నృపతి ♦ కొలువున్న యెడల బా
హిరములైన గెలని ♦ కెగ్గు లగుట॥ విరాట. ఆ౧. ప136

1 తొడరుపక

270 క॥ పుత్త్రులుఁ బౌత్త్రులు భ్రాతలు
మిత్త్రు లనరు రాజు లాజ్ఞ ♦ మీఱినచోటన్
శత్త్రులకాఁ దమ యలుకకుఁ
బాత్త్రము చేయుదురు నిజశు♦భస్థితిపొంచెన్ ॥విరా.ఆ౧.ప124

271 క॥ నరనాథుఁ గొలిచి యలవడఁ
దిరిగితి నాకేమి యనుచుఁ ♦ దేఁకువ[1]లేక
మ్మరియాద దప్పమెలగినఁ
బురుషార్థంబునకు హాని ♦ పుట్టకయున్నే॥విరాట. ఆ౧. ప 122

272 క. తానెంత యాప్తుడైన మ
హీనాయకుసొమ్ము పాము ♦ నెమ్ములుగా లో
నూనినభయమునఁ బొరయక
మానినఁగా కేలగలుగు ♦ మానము బ్రిపుకున్ ॥ వి.ఆ౧.ప౧౪౦

273 క॥ జనపతి యెవ్వారి నైనను
మనుపఁ జెఱుపఁబూని యునికి ♦ మదిఁ దెలియ నెఱిం
గిననైనఁ దాను వెలిపు
చ్చునె మునుము న్నెట్టిపాల♦నుండును దానిన్ ॥వి. ఆ౧.ప134

274 క॥ అంతిపురము చుట్టఱికం
బెంతయుఁ గీడంతకంటె ♦ నెగ్గు తదీయా
పాంతచర కుబ్జ వామన
కాంతాదులతోడి పొందు ♦ కలిమి భటునకున్ ॥వి.ఆ౧.ప131

275 క॥ నగళులలోపలి మాటలు
తగునే వెలి నుగ్గడింపఁ ♦ దనకేర్పడ నొం
డుగడం బుట్టినఁ బతి విన
నగుపని చెప్పెడిదిగాక ♦ యాతనితోడన్ ॥ విరాట. ఆ౧.ప130

276 ఉ॥ రాజగృహంబుకంటె నభి♦రామముగా నిలుఁ గట్టఁగూడ దే
యోజ నృపాలుఁ డాకృతిని ♦ నొప్పగు వేషము లాచరించు నే
యోజ విహారము ల్సలుప ♦ నుల్లమునం గడువేడ్క చేయునే
యోజ విదగ్ధుఁడై పలుకు ♦ [2]యొద్దకునుం దగ దట్లు చేయఁగన్ ॥
విరాట. ఆ౧. ప123

(1) లేమిన్మరియాద (2) యొద్ధులకుం

277 ఆ॥వె॥ ఉత్తమాసనములు • నుత్కృష్టవాహనం
బులును గరుణఁ దమకు • భూమిపాలుఁ
డీక తార యెక్కి • రెంతటిమన్నన
గలుగువారికైనఁ • గార్య మగునె? విరాట. ఆ౧.ప132

278 క॥ కలిమికి భోగములుకదా
ఫల మని తా మెఱసి బయలు•పడఁ బెల్లుగ వి
చ్చలవిడి భోగింపక వే
డ్కలు సలుపఁగవలయు భటుఁ డ•డంకువతోడన్.
విరాట. ఆ౧. ప140

279 క॥ మన్నన కుబ్బక యవమతి
దన్నొందిన స్రుక్కబడక • ధరణీశుకడన్
ము న్నున్నయట్ల మెలగినఁ
యన్న రునకు శుభము లొదవు•నాపద లడఁగున్॥వి.ఆ౧.ప133

280 క॥ నియతి మెయి నెవ్వ డింద్రియ
జయమును భక్తియును జిత్త•సారము ధృఢసం
శ్రియతయుఁ గలిగి కొలుచు నృపు
నయసంపన్నునిగఁ జేయు•నధిపతి యతనిన్॥ శాంతి ఆ౨.ప273

## 3 గృహస్థధర్మము

281 ఉ॥ అంబుజసూతి యేర్పడ గృ•హస్థసమర్థముగాఁ బ్రివృత్తిధ
ర్మంబు నొనర్చె నార్యజన•మాన్యము దాని తెఱంగు చాలసూ
క్ష్మం బతికాంక్షలేక తగు•కాలమున న్సముచిత్తవృత్తి ని
త్యంబును ధర్మముఖ్యముగ•నర్థముఁ గామముస్తల్పుటొప్పగున్॥
అను. ఆ౪. ప30

282 క॥ దీనికి నఖిలాశ్రమ సువి
ధానంబులకును గృహస్థ•తయ నెల వగుటన్
దాని ఫథాఱవపాలి స
న్మానముగ్గా దరయ నాశ్రమంబెయ్యదియున్॥అను. ఆ౪.ప34

283 క॥ తక్కిన మూఁడాశ్రమములు
నొక్కెడెస గృహస్థధర్మ ♦ మొక దెసఁ దులయం
దెక్కింప వానితోనన
యొక్కటి సరితూఁగె నందు♦రుర్వీశ బుధుల్॥ శాంతి.ఆ౧ ప76.

284 తే॥ గీ॥ భోగములు సంపరిత్యక్త♦ములుగఁ జేసి
కేవలాంగుఁడై నిర్మల♦భావయుక్తిఁ
దపము గృహమునన్నైనఁ ద♦త్పరత నాచ
రించి సంసారజలధిఁ ద♦రించు నతఁడు॥ శాంతి.ఆ౬.ప923.

285 గీ॥ పుత్త్ర దార బంధు ♦ మిత్ర సక్తుఁడు జోంపిఁ
బడినగజమునట్లు ♦ యడరు నొందు
భోగజాలపరుఁడు ♦ వాగురాజాల సం
పతిత మృగరుషముల ♦ భంగిఁ దనరు॥ శాంతి.ఆ౬. ప318.

286 క॥ ఆలును బిడ్డలు బంధులు
నై లీలఁ జరించుచును గృహస్థుఁడు దత్త
ల్లోలత్వ రహిత చిత్తత
మేలుగ నలవఱుప వలయు♦మీ రెఱిఁగిన్నృపా॥ శాంతి.ఆ౧.ప327

287 ఆ॥ వె॥ కీడు గని యొకండు ♦ గృహధర్మ ముడిగి స
మాశ్రయించు నాశ్రమాంతరంబు
దాన సంగ ముడుగఁ♦గా నేర దది యొల్ల
మియును వలపు గాన ♦ మీననయన! శాంతి.ఆ౬.ప177

288 క॥ విను మోక్షము గార్హస్థ్యా
ఖ్యునఁ గాదని యెన్నఁ డెచటఁ ♦ బురుషుం డెవ్వం
డు నిరూపించి పలికె స
ర్వనిధానము గృహము వేద♦వాక్యఫలజ్ఞా! శాంతి.ఆ౫.ప313

289 మ. నిజదారైకపరత్వముం గరుణయు♦న్నిక్కంబునుం దాల్మియున్
సుజనాసంగము దేవపిత్రతిథి సం♦శుద్ధార్చనల్ హవ్యభు
గ్భజనంబున్ సకలాశ్రమస్థులను శ♦క్త్యప్రక్రియం బ్రోవుఁ బం
కజగర్భుండు గృహస్థధర్మములుగాఁ ♦ గల్పించె నుర్వీశ్వరా!
శాంతి. ఆ౨. ప231

290 ఆ॥ వె॥ ప్రజలు తల్లిఁ జెందు ♦ పగిది గృహస్థధ
ర్మంబు నెల్ల యాశ్ర♦మములుఁ జేరి
కాదె జీవనంబు ♦ గావించుకొను గృహ
యుక్తుఁ డోషధులకు ♦ నొడయఁ డగుట॥ శాంతి.ఆ౫.ప312

291 గీ॥ క్షుత్పిపాసలచేఁ గడుఁ ♦ గుంది నట్టి
యతిథి వచ్చినఁ బ్రియమున ♦ నతని దప్పి
వోవునట్లుగ సముచిత ♦ భోజనంబు
వెట్టు నెల్లపుణ్యములకుఁ♦ బెద్ద తలఁప॥ అను. ఆ౫. ప33

292 ఆ॥ వె॥ పంచపర్వసురత ♦ పరిహృతితో నిజ
దారతృప్తుఁ డగుచు ♦ ధాన్యకోటి
పక్షి యెలుక దినిన ♦ బ్రదుకు కాఁ గను గృహ
పతికి నశ్వమేధ♦ఫలము గలుగు॥ అను.ఆ౫. ప41

293 క॥ విను పర్జన్యుఁడు భూతము
లను బండినమాత్రను పక్షు ♦ లను బ్రోచువిధం
బును నీవు బంధువుల స
జ్జనయుతముగఁబ్రోవుమది ప్ర♦శస్తంబనఘా॥ శాంతి.ఆ౨. ప329

294 ఆ॥ వె॥ భగిని గురుని మిత్రు ♦ బండితు వంశజు
బేదవడినఁ దెచ్చి ♦ ప్రియముతోడఁ
దనగృహమున కల్మి ♦ కనురూపముగఁ బ్రోవు
పెనుపుసేయు నాయు♦వునకు సిరికి॥ అను. ఆ౪. 117

295 క॥ అతిథిజనులు తమతమ వాం
ఛితము లనుభవించునట్లు ♦ సేయుం గనిసం
గృతకృత్యత బొరయరె గృహ
పతియును గృహిణియును [1]గర్మ♦భారమువలనన్॥ అను.ఆ౧.ప65

296 తే॥గీ॥ అతిథి[2]దేవతా పితృపూజ ♦ లాచరించి
కాని గృహమేధులకు భోజ్య♦మైన గుడువఁ
దగదు యజ్ఞశిష్టం బమృ♦తంబుగాఁగ
నార్యజనములు చెప్పుదు ♦ రధిపముఖ్య॥ శాంతి. ఆ౧. ప326

(1) ధర్మ (2) అతిథి పితృదేవత పూజ

297 క॥ తనయింటఁ గలుగు నన్నము
మును దేవతలకు నివేద్య♦ముగఁ జేసి ప్రణా
మ నియమ సహిత సమర్పణ
మునఁగృతకృత్యుఁడుగ వలయు♦బురుషుం డనఘా! అ.ఆ౫.ప26

298 క॥ దేవతలకు [1]నర్ఘ్యము సం
భావన నుపహార మిచ్చి ♦ పదఁపడి కుడువం
గా వలయు నట్లు సేయని
ధీవిరహితుఁ డసుర యగుట ♦ దెల్లం బధిపా! అను.ఆ౪.ప24

299 క॥ ఉపహారసమర్చకుఁడగు
సుపురుషు గృహదైవతములు ♦ శుభములఁగూర్చున్
నృపవర! తత్కార్మరహితుఁ
గృపలేక నితాంత విఫల ♦ కృత్యుం జేయున్॥ అను.ఆ౪. ప29

300 క॥ ఏలినవానిని దైవము
నాలిని బంధులను సముచి♦తారాధన సం
శీలతఁ బ్రీతులఁ జేయని
పాలసుఁ డాఫలము లాస♦పడు మను జేంద్రా! ఉద్యో.ఆ౨.ప33

301 క॥ దేవాతిథిపితృపూజలు
గావించుట భావశుద్ధి ♦ కలిమి నరునకున్
దేవీ! వలయును నాతికి
నేవిధమున బ్రహ్మచర్య ♦ మేమరమి తగున్. అను.ఆ౫. ప39.

302 క॥ నృపవర! పూర్వాహ్ణంబును
నపరాహ్ణము దేవపితృ స♦మారాధన వి
ధ్యుపదిష్టకాలములు మ
ధ్యపుసమయము మానుపార్చ♦నార్హ్వంబరయన్॥అను.ఆ౨.ప54

303 తే॥ గీ॥ రేపకడయును బగలును♦మాపువరుస
నర్థధర్మకామంబుల ♦ నాచరింప
వలయు వానియం దాసక్తి ♦ వలదు, సక్తిఁ
డవ్యో నేనియు మేలు ధ♦ర్మాభినిరతి.॥ అను.ఆ౨. ప47

---

(1) నగ్రిలి

304 క॥ జతసంబున నర్థము సం
చితముగఁ గావించి క్రతు వి♦శేషంబుల దే
వతలను దృప్తులఁ జేయమి
యతికిల్బిషకారి యందు ♦ రాగమవేదుల్॥ శాంతి. ఆ౧. ప78

305 ఆ॥ వె॥ వడ్డి కిచ్చి కుడుచు♦వాఁడు ననగ్నియుఁ
బ్రాణి విక్రయమున ♦ బ్రదుకు నతఁడు
దైవపిత్ర్యములకుఁ దగరు ♦ సంధ్యోపాస
నములు లేనివారు ♦ నగవరేణ్య! అను. ఆ౨. ప57

306 క॥ దైవికకృత్యంబులకును
భూవర! భూసురుల సూక్ష్మ♦ముగ శోధింపం
గా వలదుగాని పిత్రుపూ
జావిధికిఁ బరీక్షవలయు ♦ సమ్యగ్భంగిన్॥ అను. ఆ3. ప171

307 తే॥ గీ॥ కుల వయో రూప శీల వి♦ద్యల నుదాత్త
లనఁగఁ దగువారు పఙ్క్తి పా♦వనులు తద్గు
ణమ్ము లారయలేని జ♦నములు పఙ్క్తి
దూషకులు పైతృకమునకు ♦ దోషదూర! అను. ఆ3. ప173

308 క॥ వ్యాకరణ ధర్మశాస్త్ర వి
వేకములు పురాణజాత, వేదిత్వము బ్ర
హ్మైకత్వబోధనము నధి
పా! కలిగినవారు పఙ్క్తి♦పావనులుగదుర్॥ అను.ఆ.3.ప180

309 క॥ శాంతుఁడు సువ్రతశీలుఁడు
దాంతుండధ్యాపకుండు ♦ దయగలవాఁ డ
త్యంత ప్రబోధసంప
ద్వంతుఁడుపావనుఁలుభూప♦వర! పఙ్క్తులకున్॥అను.ఆ3.ప179

310 తే॥గీ॥ మేలిగుణములు గనియు న♦మిత్రజనము
శ్రాద్ధపాత్రంబుఁ జేయంగఁ♦జన దమిత్రి
దత్తమైనది భస్మహు♦తంబుఁ జొట
నిడిన విత్తనుబోలె నై ♦ చెడు నృపాల॥ అను. ఆ3. 181.

711 క॥ మునుముట్ట నెఱిఁగి శ్రాద్ధం
బునకుం గైకొనుట మేలు ♦ భూసురునిం గ్రొ

కొని యరసి కాఁడనిన నా
తని యుమ్మలికంబు చెఱచు ♦ ధార్మికునైనన్॥ అను ఆ3 ప.182
312 క॥ అపరం బగుపక్షంబును
నపరాహ్ణము మేలు పితృస♦మర్చనమున కా
ద్యపుతిథి దశమి చతుర్దశి
నృపవర! యప్పక్షమునను♦నింద్యతఁబొరయున్॥అను.ఆ3 ప162
313 క॥ అమవస నమవసఁ బితృయ
జ్ఞముఁ దగఁ బిండప్రదాన ♦ సహితముగా భ
క్తి మెయిం జేయునతఁడు ని
త్యముఁ జేసినవాఁడయగు స♦మంచిత చరితా! అను.ఆ3. ప159
314 ఆ॥వె॥ మునగ యుల్లి యుసవి♦మునగ దుర్మాంసము
లానుగుమ్మ మలిన♦మైనయుప్పు
కలియ జీలకఱ్ఱ ♦ కరివేము గుమ్మడి యిం
గువుఁ బ్రివర్జనీయ♦కోటి యగుట. అను. ఆ 3. ప 139
315 క॥ విను సర్వభూతములయం
దును మార్దవయుక్తుఁడై మ♦ధుర వాగ్వృత్తిం
బనుపడఁగవలయు నార్జవ
మనూనముగ దేవపితృస♦మర్చకుఁడగుచున్॥ శాంతి.ఆ౫.ప452
316 తే॥గీ॥ చెల్లియుండియు నయిరణ సేయునతఁడుఁ
బేదవడియును నర్థికిఁ ♦ బ్రియముతోడ
దనకుఁ గలభంగి నిచ్చు న♦తండుఁ బుణ్య
పురుషుఁ డని చెప్పి రార్యులు♦ కురువరేణ్య॥ ఉద్యో.ఆ౨.ప42
317 క॥ వినుమలసుండును గర్వియు
ననర్థభాషియును మత్స♦రాలీఢుఁడు గ్రో
ధనుఁడును గావలవదు శ
క్త్యనురూపతఁ జేయవలయు ♦ నాతిథ్యంబున్॥ శాంతి ఆ౫.ప454
318 తే॥గీ॥ జనని జనకుఁడు సద్గురుఁ ♦ డనలుఁ డాత్ముఁ
డనఁగ నియ్యేవురును నే గృ♦హస్థుచేత
సుగతివాంఛఁ బ్రసాదితు ♦ లగుదు రట్టి
వాఁడునూనె ధర్మాత్ముండు వసుధమీఁద॥ అర.ఆ౫.ప118

319 ఉ॥ నీతిపదంబునన్ బ్రిదుక ♦ నేర్చుట యుత్తమభంగి శౌర్య సం
జాతములైౖ కరం బమరు ♦ సంపద లొందుట మధ్యవృత్తి యు
స్థితము లై నభారవహ♦జీవనముల్ దలఁపంగ నిష్ఠముల్
నీతికి బాహ్యులైన ధరణీవర! మెత్తురె వారి నుత్తముల్॥
ఉద్యో. ఆ౨. ప 71

320 క॥ పరదార పరధనంబుల
హరింపమియు దేవపితృస♦మారాధనముం
గరుణయు నతిథి సపర్యయు
గిరితనయా! యెల్లవారి♦కిం గృత్యంబుల్॥ అను. ఆ౫. ప79

321 చ॥ తమతమకర్మము ద్దెరువు ♦ దప్పక చేసినవారు దేవలో
కమున సుఖంబుఁ బొందుదురు♦క్రమ్మరివచ్చియుఁబూర్వజాతి జ
న్మమున మహర్ధిఁబొందుదురు♦మానిని!యిమ్మెయిఁదప్పియెట్టికృ
త్యములఁ జరించి రజ్జుల ♦ కట్టికులంబులఁ బుట్టు వాటిలున్॥
అను. ఆ౫. ప81

322 ఉ॥ ఆపదఁ దూలిపోక సిరి ♦ యందు మదింపక శౌర్యవృత్తిమైఁ
బాపుల గెల్చి యార్జవము♦బంధుజనాళికి నార్యకోటికిం
జూపుచు దీనులన్ గరుణఁ♦జూచి తగం గలమాత్రి బ్రోచుచుం
గోపములేని[1]మన్కిగలు♦గున్ దివిజాంశమునన్ జనించినన్॥
అను. ఆ౫. ప34

323 క॥ వినుము సుఖమునకు♦దుఃఖం
బునకుం గారణము దనకు పూర్వకృతం బై
చను కర్మము కారణ మిది
యని యన్యము గలుగ నేర♦దం దొక్కటియున్॥ అర. ఆ౭ ప384

324 క॥ తిల గో సువర్ణ దానం
బులు నుపవాసములు దీర్ఘ♦ము లనేకము లి
మ్ములఁ జేయనివారు దరి
ద్రులు నిరతం బగుదురాత్మ ♦ దోషముపేర్మిన్॥ అర.ఆ౨.ప241

(1) లేక మన్కి.

325 క॥ సరిగా నెన్నుదు రార్యులు
దరిద్రునిం బతితునిం [1]గృ ♦ తఘ్నుని జడునిన్
దొరఁకొను ధర్మముఁ గామముఁ
బరమగతియు నర్థమునన ♦ పౌరవముఖ్యా! శాంతి. ఆ౧. ప50
326 క॥ కలిమియు చుట్టలఁ జేర్చును
గలిమియు చెలులను ఘటించుఁ ♦ గలిమియు శౌర్యో
జ్జ్వలుఁ డనిపించును గలిమియ
పలువురు సద్బుద్ధి యనఁగఁ♦బరఁగఁగఁ జేయున్॥ శాంతి.ఆ౧.ప51
327 క॥ ఏవానిబంధుమిత్రులు
జీవధనంబులును దప్పెఁ♦జెందుఁ గృశునిం
గా వాని నెన్నఁగాఁ దగుఁ
గేవలతనుకార్శ్యయుతుఁడు♦కృశుఁడె నరేంద్రా॥ శాంతి.ఆ౧.ప52
328 క॥ మొలువం బెట్టనియట్టిది
మొలచునె, తొలు మేనిదాన♦ముల నానార్థం
బులు సిద్ధించుఁ బ్రియత్నం
బులు లేకయు నింత నిజము♦భూపవరేణ్యా॥ అను.ఆ౫. ప430
329 సీ॥ ఆయాసపడకుండ ♦ నర్థంబు సేరెడు
వారు పాత్రజనంబు ♦ దార పిలచి
తొలుమేనఁ బెట్టిన ♦ యలఘు దయాఢ్యులు
ధనసిద్ధి బహుల యత్నమునఁ గలుగు
మనుజులు పూర్వజ ♦ న్మమున నర్థులు దమ్ము
నడుగ దాఁపక యిచ్చు ♦ నట్టివార
లాయాసమునను వి ♦ త్తాగమం [2]బెడలిన
జనులు ముందటి పుట్టు ♦ వునఁ గృపావి
హీనులై యాచకుల నల ♦ యించి పిసవ
నిడని లోభులు మదిసి ధ ♦ నేశుఁ డగున
రుండు ప్రాయంబునా డీక ♦ గండడంగి
తొంటిభవమున నీఁగికిఁ ♦ దొడఁగి నతఁడు॥ అను. ఆ౫. ప91

1 కృతఘ్నుఁ జడుఁడు 2 బెడ లెడు.

330 క॥ అమితజ్ఞానము విజ్ఞా
నము గలిగియుఁ బేదయైన ♦ నరుఁడు చనినజ
న్మమున వినికి గలిగియు దా
నము తెరువునఁ బోనివాఁడు♦నళినదళాక్షీ! అను. ఆ॥. ప95

331 క॥ తగుబుద్ధిలేక సంపద
మిగులఁ గలుగు నరుఁడు తొంటి ♦ మేనఁ గరుణామై
విగతప్రజ్ఞుం డయ్యును
దగ దీనులఁ బ్రోచినతఁడు♦ దళదబ్జముఖీ! అను. ఆ॥ ప96

332 ఆ॥ వె॥ ధనము గలిగియుండి ♦ ధవళాక్షి! కుడువక
కట్టకుండు పరమ ♦ కష్టజనము
లారువు లొత్తి చెప్ప ♦ నుపకారులై తొలు
పుట్టువందు మనిన ♦ యట్టివారు. అను. ఆ॥. ప89

333 ఆ॥ వె॥ తమకు ధనము లేక ♦ తగుభోగముల కెవ్వ
రైన నడుప మను సు♦ఖాఢ్యజనులు
తొల్లి పేదవార ♦ లుల్ల మర్థుల కెప్డుఁ
బెట్టఁ గోరుచుండు ♦ నట్టివారు॥ అను. ఆ॥. ప90

334 తే॥ గీ॥ కలిగియుండియుఁ దెవుళుల ♦ కతన భోగ
ములు భుజింపఁగలేని మ♦ర్త్యులు గిరీంద్ర
తనయ! తొలుమేన రోగము ♦ ల్దనికి చచ్చు
నపుడు దానము చేసిన ♦ యట్టివారు॥ అను. ఆ॥. ప92

335 ఆ॥ వె॥ ఆలుబిడ్డ లొరటు ♦ లై లేమిఁ గుందుచుఁ
దెవులు చేతఁ బడుచు ♦ నవయు జనులు
మున్ను క్రోధలోభ ♦ ముల నాస్తికతఁ బర
పీడనంబు సేసి ♦ పేర్చినారు॥ అను. ఆ॥. ప98

336 చ॥ నిజగుణదోషకర్మముల ♦ నెట్టన మేలును గీడు వచ్చుఁ ద
త్ప్రజనితసౌఖ్యదుఃఖములఁ♦ బ్రాజ్ఞులు తుల్యమనస్కులై మనో
రుజలును దేహజంబు లగు ♦ రోగములుం హితధర్మకర్మభే
షజములఁ జేసి పాపుదురు ♦ సర్వము సాత్వికదృష్టిఁ జూచుచున్.
అర. ఆ॥. ప39

337 క॥ విను పూర్వకర్మఫలములు
దనకు వశముగాక పొందుఁ ♦ దరితోవానిఁ
గనుఁగొన నేరక మూఢుఁడు
దన కాపద యైనచోట ♦ దైవముఁ దూఱున్॥ అర. ఆ౫. ప65

338 క॥ ద్రుమముల దళకుసుమఫలో
ద్గమముల క్రియఁ గర్మముల నో♦దవుఁ దత్ఫలముల్
తమతమతఱిఁ గర్తకు భో
గ్యములై నియతిని శుభాశు♦భాకారములన్॥ అను.ఆ౧. ప145

339 క॥ సమయంబైనను గుసుమ ఫ
లము లెట్టులుదోఁచుఁ దరువు♦లం దటితోఁ గ
ర్మమునం బొడమును సుఖదుః
ఖము లట్టుల నిప్పృయత్న ♦ కలితోద్భూతిన్॥ శాంతి.ఆ౪.ప77

340 తే॥ గీ॥ ఎఱిఁగి యెఱిఁగి నన్నడుగంగ ♦ నేల దీని
సుఖము దుఃఖంబుఁ బ్రాప్తించు♦చోట నరుఁడు
దగిలి తనకర్మవశమునఁ ♦ దనకుఁ దాన
కర్తగా కన్యులకు నేమి ♦ కారణంబు? ఆది. ఆ౪. ప264

341 క॥ ఎట్టి విశిష్టకులంబునఁ
బుట్టియు సదసద్వివేక♦ములుగల్గియు ము
న్నట్టిన కర్మఫలంబులు
నెట్టన భోగింపకుండ ♦ నేర్తురె మనుజుల్? ఆది. ఆ౫. ప62

342 సీ॥ దుఃఖంబుఁ బొమ్మని ♦ [1]త్రోచి సుఖంబు ర
మ్మని తెచ్చికొన వశ ♦ మయ్యె వానిఁ
దోలుబాముననదలి ♦ దుష్కృతంబును సుకృ
తంబు హేతువులుగఁ ♦ దగిలి చేయు
బురుషుని కాలంబు ♦ తిరములుగావవి
పొరిఁబొరివచ్చుచుఁ ♦ బోవుచుండు
నర్థముల్ దుర్బుద్ధి ♦ కైనను సిద్ధించు
నగుకాలముల నార్యు ♦ లయ్యుఁ గాని

(1) త్రోవ

కాలమున ఘటింపఁ♦గా నేర రనిల వ
ర్షాతపేందు రుచులు ♦ నధిపకాల
కల్పితములు మంత్రి ♦ శిల్పౌషధమ్ములు
మేలు సేత కాల ♦ [1]లీల దలఁప॥ శాంతి. ఆ౧. ప 185

343 సీ॥ తారు గొందఱకు బా♦ధకులయి నడచుట
పరులచే బాధలఁ ♦ బడుట కలుగు
నివి కాలభావంబు ♦ లెఱుక గల్గిన నోరుఁ
బఱిచితి మొరులచేఁ ♦ బడితిమనుచుఁ
బురుషుండు ప్రియశోక♦ములఁ బొందఁదర్థదా
రాపత్యబాంధవ♦హానికాత్మఁ
గుందంగ నడలుట ♦ మందబుద్ధిత్వంబు
వగఁ గీడు మానునే ♦ వలవ దడల
శోకభయకారణంబులు ♦ లోకమున న
నేకములు వానిఁ దలసూపు ♦ శోకమునకు
భయమునకు బుద్ధిమెడ యీఁడు ♦ పండితుండు
మూఢుఁ డవి త్రోవ నేరఁడు♦మునుఁగు వగల॥ శాంతి.ఆ౧.ప188

344 క॥ విను మలుకయుఁ గూర్మియు లే
దనవద్యా! యజ్ఞనంబు ♦ ల..దును విధికి
న్మను చేసిన కర్మఫలం[2]
బనుభవగోచరము సేయు ♦నంతియతఁడిశోకా॥ అను.ఆ౫.ప87

345 తే॥గీ॥ నాతి! విను గ్రహచారంబు ♦ హేతువులుగ
నశుభములు శుభములు నరుఁ ♦ డాచరించు
గ్రహము చేయించునే తాన♦కాక చేత
కొడఁయఁ డటుగాన ఫలములు ♦గుడువ వలయు॥ అను.ఆ౫.ప123

346 వినుము పురాతన జన్మం
బునఁ జేసినయట్టి కర్మ♦ముల ఫలములు ప్రా

1 కేళిఁబు 2 కర్మము ఫలమను

జ్ఞానినైనఁ బొందు వానికి
మనుజేశ్వర! మందుధైర్య♦మహిమయు చుమ్మీ॥ శాంతిఆ౨ప14

347 క॥ తనకొలఁది నుపాయంబులు
వొనరిచి ధనవంతుఁ డగుట ♦ భూపగుణము ని
ర్ధనుని నిజవ్రీజయును గై
కొనదు విరోధులునుసరకు♦గొనరు కుమారా॥ శాంతి.ఆ3.ప173

348 క॥ విను ధర్మంబున ధన మగు
ధనమున సిద్ధించుఁ గామ♦తంత్రం బటుగా
వున మధ్యమంబు నధమము
ధనకామము, లుత్తమంబు ♦ ధర్మం బధిపా॥ శాంతి.ఆ3.ప453

349 ఉ॥ కావున ధర్మసిద్ధికి ము♦ఖం బగు నర్థము నందు నిష్ఠమై
నేవిధినైన ధర్మరతి ♦ యెక్కుడుగా మదిఁ బొన్పు టొప్పుఁ గా
మావిలబుద్ధిగాక యుచి♦తాగతసౌఖ్యము లాచరించుచున్
భూవిభుఁడెప్డుభూమిసతిఁ♦బొంది రమింపమహోన్నతుండగున్.
శాంతి. ఆ3. ప125

350 తే॥గీ॥ ఓపి ధర్మార్థకామంబు ♦ లొకటి నొకటి
నాశ మొందింపకుండంగ ♦ నడుపవలయు
గాక ధర్మంబుసెడ ♦ నర్థకామములను
గోరు పురుషుండు నిందకుఁ ♦ గుదురు గాఁడె॥ శల్య.ఆ౨ ప302

351 ఆ॥వె॥ వినుమ సత్యలోభ ♦ మున సిరియగునె యాఁ
కొనిన ముసిఁడి దినినఁ ♦ గొవ్వులావు
గలుగునయ్య? శకుని ♦ కర్ణదుశ్శాసన
మంత్రితంబు కార్య♦తంత్ర మగునె? ఉద్యో. ఆ3. ప333

352 చ॥ అలఘు గుణంబు లందధికుఁ ♦ డైన మహాత్ముఁడు రాగకోపమా
యలఁ బడి యక్షమావివశుఁ♦డై యచిరాంశులతావిలాసచం
చల మగులక్ష్మి కాసపడి ♦ సత్యము ధర్మముదప్పి సత్సభా
వలి వగువారియొద్దఁ దగు♦వాఁడయి సజ్జనుఁ డుండనేర్చునే?
ఆర. ఆ౧. ప259

353 సీ॥ ధర్మకామంబులు ♦ [1]దలఁగంగ నర్థార్థి
యగువాఁడు పతితుఁడై [2]♦యర్థసేవ
నర్థార్థముగఁ జేయు ♦ నతఁ డుగ్రవనములో
గోరతపసేయు న♦ల్పమతిఁ బోలు
నర్థ సర్మములకు ♦ హానిగాఁ గామార్థి
యగునాతఁ డల్పజ♦లాశయమున
జలచరం బెట్టు ల♦జ్జలములతోఁ జెడు
నట్లు కామంబుచే ♦ హానిఁబొందు

గీ॥ నర్థధర్మములు మ♦హాబ్ధిమేఘములట్టు
లుభయమును బరస్ప♦రోదయమ్ము
లిట్లుగాఁ ద్రివర్గ ♦ మెఱిఁగి[3] సామ్యమున సే
వించువాఁడు సర్వ♦విత్తముండు॥ ఆర. ఆ౧. ప245

354 క॥ పరధర్మము నర్థంబును
సరసంబగు విషయసుఖము ♦ సద్గతియుఁ దపః
పరిపాకమునన కలుగు
న్నరునకుఁ [4]దత్త్వార్థ ♦ నైపుణుఁ డైనన్॥ శాం.ఆ౫.ప502

355 తే॥గీ॥ అలఘుతపములు తొలుమేనఁ ♦ గలిగెనేని
వెదకికొనివచ్చు నన్నరు ♦ విపులభోగ
ములు పురాకృతవృద్ధసే♦వల ఫలించు
బుద్ధి కలిమియు విద్యలఁ ♦ బొలుచుటయును॥ అను. ఆ౫.ప431

౮ తల్లిదండ్రులు, పుత్రులు.

356 ఉ॥ కొందఱు బ్రహ్మచర్యమును ♦ గొందఱు భవ్యగృహస్థధర్మముం
బొందుట కొంద ఱిద్ధతపఃము న్వనభూమిఁ దగం జరించుటం
గొందఱు సత్క్రియత్వమునఁ ♦ గొందఱు యజ్ఞవిధానశీలతం
గొంద ఱనూనదానములఁ♦గోరి యొనర్తురు నిత్యసౌఖ్యమున్॥
శాంతి. ఆ ౬. ప552

(1) దలఁగగ 2 దొనర్థిసేవ 3 సామ్యమున 4 దత్త్వార్థా ర్థ

357 క॥ జనకుఁడు తపమును ధర్మం
బును విద్యయుఁ బరమదైవ ♦ మును గావున నా
తనికిఁ బ్రియం బగుపని చే
సిన దేవతలెల్లఁ బ్రీతిఁ జెందుట గల్గున్॥ శాంతి. ఆ౫. ప 271

358 చ॥ కరచరణాదిసంఘటిత ♦ కాయము సంజననంబు వహ్నిపు
ట్టరణినిఁ బోలెఁ దల్లిదెస ♦ నైనదిగాదొకో యట్లుగాక దు
ర్భరమగు గర్భఖేదమును ♦ బట్టికినై నిజదేహచింతపై
భర మొకయింత లేక పడు♦పాటులునక్కట! యెక్కుడెంతయున్॥
శాంతి. ఆ5. ప273

359 ఆ॥వె॥ వచ్చి పోయి చూచు ♦ వాఁడుఁగా కిడుమలఁ
బడునె తల్లిపోలెఁ ♦ బట్టి తోడఁ
దండ్రి సెప్పె నిట్లు ♦ ధర్మశాస్త్రంబులు
నంబ గౌరవమున ♦ నధిక యగుట॥ శాంతి. ఆ౫. ప274

360 క॥ కలవాఁడు లేనివాఁడు స
బలుఁ డబలుఁడు మూఢబుద్ధి ♦ ప్రౌఢుం డనఁ గా
వల దెవ్వరికైన జనని
కలిమియు యత్యంత సౌఖ్య♦కరమై యుండున్॥ శాం. ఆ౫.ప278

361 క॥ అప్పుడ యసమర్థుం డగు
నప్పుడ దుఃఖియగు శూన్య♦మై తోఁచు జగం
బప్పుడ మాతృవియోగం
బెప్పుడు వాటిల్లు నపుడ ♦ యెంతయుఁ దూలున్॥ శాం. ఆ౫.277

362 ఆ॥ వె॥ బాలుఁ డైనఁ గొడుకు ♦ ప్రౌఢుఁ డైనను వృద్ధుఁ
డైన నొక్కవిధమ ♦ యక్కలియును
వరయ భరము తల్లి ♦ కాపదార్థంబు జ
గంబు కలిమికెల్లఁ ♦ గారణంబు॥ శాం. ఆ౫. ప275

363 క॥ జననీజనకగురులయెడ
నొనరించిన మేలు గీడు ♦ నొదవించు సుఖం
బునకును దుఃఖమునకు నిం
తని కొలఁది యిడ స్వశంబె ♦ యజునకునైనన్॥ అను. ఆ౪. ప 25

364 సీ॥ విను తల్లియును దండ్రియును గురుండును సేవ
నీయులు సద్భక్తి ♦ నిత్యనిరతి
వారలఁ గొలుచుచు ♦ వారెద్ది చెప్పిన
నది యాచరించుట ♦ యధికధర్మ
మాగమత్రయమును ♦ నగ్నిత్రయంబు లో
కత్రయంబును దేవ ♦ తాత్రయంబు
నను వస్తువులు వాని ♦ యందును జనని గా
రవమున నెక్కుడు ♦ [1]రాజముఖ్య!
తే. గీ॥ యీజగంబున దివమునఁ ♦ బూజ పడయు
మాతృభక్తుఁడు పితృభక్తి ♦ మానసుండు
నట్ల యవ్యయానందసం ♦ ప్రాపణంబు
గురుపదాబ్జసమారాధ♦కుండు గాంచు॥ శాంతి. ఆ3. ప43
365 సీ॥ జతనంబు మిగుల మా ♦ పములు దొమ్మిది యుద
రంబునఁ గరము భ ♦ రంబుతోడ
భరియించి పదపడి ♦ ప్రాణసంశయదశ
నొంది పుత్రునిఁగాంచు ♦ నొనరఁ దల్లి
తపములు యజ్ఞము ♦ ల్దానము ల్వ్రతములు
దేవతా సజ్జన ♦ సేవనములు
గావించుఁ బుత్రునిఁ ♦ గామించి జనకుఁ డి
ట్లిరువుర పాటును ♦ సరియె తలఁపఁ
గీ॥ దనయుఁ గని తల్లిదండ్రులు ♦ దమకు నతఁడు
భక్తుఁడగుటకు ధర్మార్థ ♦ సక్తుఁడగుట
కాసపడుదురు విను మట్టి ♦ యాస సిద్ధి
బొందఁ జేయునాతఁడ సూవె ♦ నందనుండు॥ ఆర. ఆ౫. ప5
366 క॥ జననియు జనకుఁడు నెవ్వని
యనువర్తనమునఁ బ్రియంబు ♦ నందుదు రెదఁ ద
త్తనయుఁడు ధర్మము గీర్తియు
ననూనముగఁ బడయుఁజాలు ♦ నక్షయగతులన్॥ ఆర. ఆ౫.ప6

1. రాజవర్య

367 క॥ పితృసంకల్పము సేయఁగ
సుతుల కవశ్యంబు వలయు ♦ సుతజన్మఫలం
బతిముదమునఁ బితృవరులకు
హిత (1)మొనరింపంగఁగాదె ♦ యెంతయుభక్తిన్॥ సభా.ఆ౧.ప93

368 క॥ విను గార్హపత్య మను న
య్యనలము విహరింపఁబడి త ♦ దాహవనీయం
బన వెలుఁగునట్లు వెలుఁగును
జనకుఁడు దాఁబుత్త్రుఁడై ని♦జద్యుతితోడన్॥ ఆది, ఆ౪. ప85

369 క॥ తాన తననీడ నీళ్లల
లోఁ జేర్పడఁ జూచునట్లు ♦ లోకస్తుత! త
త్సూను జనకుండు చూచి మ
హానందముఁ బొందు నతిశ♦యుప్రీతిమెయిన్॥ ఆది. ఆ౪. ప86

370 క॥ తనయుండు తల్లిదండ్రులు
పనిచినపని సేయఁడేని ♦ పలుకెదలోఁ జే
కొనఁడేని వాఁడు తనయుం
డనఁబడునె పితృధనమున ♦ కర్హుండగునే! ఆది. ఆ3. ప198

371 క॥ విను జేల యెట్టికష్టుఁడు
దనపురుషగుణంబు సెడఁగఁ ♦ దల్లిని దోఁబు
ట్టినవారి విడిచి రాగం
బునఁ జపలస్త్రీసుఖంబు ♦ వొందునె చెపుమా॥ ఆది.ఆ౬.ప196

౯. సహోదరులు.

372 క॥ విను భక్తియు పెరపు గలిగి
యనుజన్ములు పెద్దవాని ♦ నారాధింపన్
జనవర! యతండు దమ్ములఁ
గొనియాడన్ సిరికిఁ బట్ట♦గుదు రుజ్వలులై॥ అను. ఆ౪. ప182

(1) మొనరించుటకు,

373 చ॥ కరి తురగాదిఘట్టనయు ♦ గాలియు నొంపదెయొంటినున్నయ
త్తరువు ననేకభూరుహావి♦తానము [1]గుంపయియున్న బాధలం
బొరయునె యన్నదమ్ములును ♦ బొందిన నేరి కసాధ్యులట్లుగా
కెరవయి [2]నిల్చినం గెలని ♦ కెల్లిదమై పరివోదు రెంతయున్॥
ఉద్యో. ఆ౨. ప88

374 తే॥గీ॥బలముగలవాని బలువురు ♦ బలవిహీను
లొక్కటైకూడి నిర్జింతు ♦ రుత్సహించి
మధువుగొన నుత్సహించిన ♦ మనుజుఁబట్టి
కుట్టి నిర్జించు మధుకర ♦ కులమునట్లు॥ ఆర. ఆ౧. ప251

375 క॥ మానవనాయక యగ్రజుఁ
డైనను ననుజన్ముఁడైన ♦ నన్యాయంబుం
బూని సహోదరులకుఁ గీ
డైన నతఁడు దండ్యుఁడండ్రు ♦ నవనీపతికిన్॥ అను. ఆ౪.ప136

376 ఆ॥ వె॥ అన్న పతితుఁడైన ♦ నటుగాక సన్యాసి
యయ్యెనేని దమ్ముఁ ♦ డాతఁడుండ
దారసంగ్రహంబుఁ ♦ దాఁజేసి పాపంబుఁ
బొరయుఁడండ్రు బుధులు ♦ కురువరేణ్య॥ శాంతి. ఆ౧. ప301



## ౧౦. జ్ఞాతులు.

377 క॥ జ్ఞాతుల [3]పోరితమును గో
వ్రాతము నాక్రమము విప్ర♦వర్గము చనువున్
నాతుల [4]గారింపమియును
బ్రీతిం జననిచ్చు నతని ♦ పెంపొప్ప నృపా॥ ఉద్యో. ఆ౨. ప36

378 క॥ జ్ఞాతులు తమలోఁ బొందినఁ
జేతోమోదమునఁజెలఁగి ♦ చెలువొందుదు ర
న్నీతిం బాసిన విగతవి
భూతింగడుఁగొఱవులట్ల♦పొగయుదురధిపా॥ ఉద్యో. ఆ౨. ప275

(1) గుంపయి చేర్చి (2) నిల్చిఁనబరుల (3) పూరితమును (4) గారించుటనును.

379 వ॥ కావునఁ దమలో విరోధం బొప్పదు. సంభావన [1]భోజనాది
సత్కారంబులను సవినయవర్తనంబులను బ్రీతులైన జ్ఞాతు
లిహపరార్థసాధకు లగుదురని చెప్పి వెండియు॥ ఉద్యో.ఆ౨.ప27

380 క॥ అలమిఁగొని యొండొరుల ప్రో
వులఁ బ్రోవుల నెలమి కలిమిఁ ♦ బొంది బహు జ్ఞా
తులు నెమ్మిఁగూడఁ దామర
కొలనికి శ్రియఁ జిక్కఁ బట్టు♦గుదు రుజ్జ్వలులై॥ ఉద్యో.ఆ౨.ప87

381 తే॥గీ॥ కొంచమైనను దగఁబంచి ♦ కుడువ మేలు
పనులయెడ దుఃఖ మోర్చి యు♦ల్లంబు సుఖము
ననుభవించుట హితము శ♦త్రునకునైన
నిచ్చుటయు లెస్స యడిగిన♦యెడ నృపాల! ఉద్యో. ఆ౨. ప 47

382 ఉ॥ సారపుధర్మము న్విమల♦సత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొందలేక [2]చెడు ♦ పాలిది యైనయవస్థ దక్షులె
వ్వార లుపేక్ష చేసి రది ♦ వారలచేటగుఁ గాని ధర్మని
స్తారకమయ్యు సత్యశుభ ♦ దాయకమయ్యును దైవముండెడుఁ॥
ఉద్యో. ఆ3. ప273



## ౧౧. భార్యాభర్తలు.

383 క॥ సంతత గృహమేధిఫలం
బంతయుఁ బడయంగనోపు ♦ ననుగుణభార్యా
వంతుం డగువాఁడు క్రియా
వంతుఁడు దాంతుండు పుత్ర ♦ వంతుండు నగుఁ॥ఆది. ఆ౪.ప81

384 క॥ సతియును గుణవతియుఁ బ్రజా
వతియు ననువ్రతయునైన ♦ వనిత నవజ్ఞా
న్వితదృష్టిఁ జూచు నతఁడు
ర్గతి కిహముం బరముఁ గలదె ♦ మదిఁ బరికింపఁ॥ఆది.ఆ౪.ప80

(1) సహభోజనాది (2) చెడ పాలిది.

385 క॥ విను సౌభాగ్యసమేతుఁడు
మును నిజదారైకపరుఁడు ♦ ముందటిజన్మం
బున భార్యకుఁ బ్రీతియొన
ర్పని మనుజుఁడు సుభగతావి♦రహితంబొందున్ ॥ అను. ఆ౧. ప94

386 సీ॥ ఋతుమతిగాక శు♦ద్ధతయుఁ గల్గినయింతి
కన్య తత్పరిణయ♦కరణమునకు
నొడయులు విను తల్లి♦యును దండ్రియును దండ్రి
తోఁబుట్టినతఁడు మా♦తులుఁడు సోద
రుండును యోగ్యవ♦రునిఁ జూచి వారిలో
నెవ్వరైనను బ్రీతి ♦ నిచ్చువారు
పతి యంతనుండియుఁ ♦ బ్రభువు దానికి నట్లు
గావున నాతండ ♦ దైవ మనుచు
నతని మత మూఁది దేవతా ♦ పితృసమర్చ
నములు నతిథిపూజనము స♦న్మతి సమాచ
రించుచును జతిహితము వా♦టించి నడపు
సతి పతివ్రత యిహపర ♦ సౌఖ్యమహిత॥ అను. ఆ౫. ప285

387 క॥ పాతివ్రత్యము గలిగిన
నాతి యనఁగ దైవమన జ♦నస్తుత! వేరే
యాతతధర్మార్థసుఖ
ఖ్యాతులు సద్భార్యవలనఁ♦గాదే కల్గున్ ॥ అను. ఆ౨. ప219

388 చ॥ పతి గడవంగ దైవతము ♦ భామలకెందును లేదు, ప్రీతుఁడై
పతికరుణించెనేని కల♦భామిని భాసురభూషణాంబరా
న్విత ధనధాన్య గౌరవము ♦ విశ్రుతసంతతియున్ యశంబు స
ద్గతియునుగల్గు నొందుమెయిఁ♦గల్గు నెయెన్ని తెఱంగులారయన్.
ఆర. ఆ౫ ప314

389 ఆ॥ వె॥ కరము దుఃఖపడినఁ ♦ గాని యొక్కింత సౌ
ఖ్యంబు ధర్మగతియుఁ ♦గలుగ దెందు
[1]జూడ నబల భర్త ♦ శుశ్రూషఫలము సం
తతసుఖంబు గలదు ♦ ధర్మ వాదవు॥ ఆర. ఆ౫. ప315

(1) చూడుమబలా.

390 క॥ ధని యధనుఁడు రూపసి యొ
ప్పనివాఁ డవివేకి మూఢ♦భావుఁడు రోగుం
డనుగతరోగుఁ డనక యం
గన పతిఁ బాటింపవలయుఁ♦గామధ్వాంసీ॥ అను. ఆశ్వ. ప295

391 చ॥ పతికి ననుంగులైన తగు ♦ బంధుల మిత్రుల భోజనాదిస
త్కృతముల నాదరించుచు న♦కృత్రిమభక్తి విశేషసంతతో
ద్ధితమతివై చరింపుము త ♦ దీయ హితేతర వృత్తులైన వా
రతివ! భవత్సుహృజ్జనము ♦ లైనను గైకొనకుండు మేర్పడన్॥
ఆర. ఆశ్వ. ప 319

392 గీ॥ పనులయెడ మాఱువలుకక ♦ యనవధానుఁ
డైన పతిఁ దలఁపించి ధ ♦ ర్మార్థకలిత
కృతుల్లు నడపుచు సవతి గ♦ల్గినను బోరి
తంబులే కొక్కటైయున్కి ♦ తగవు సతికి॥ అను. ఆ శ్వ. ప291

393 క॥ కావున నిత్యము సమ్య
గ్భావము ప్రేమంబు వెలవు ♦ భక్తియుఁ బ్రియముం
గావింపుము ప్రియునెడ నీ
భావ మెఱిఁగియతఁడుదాన♦పైఁబడి మరుగున్॥ ఆర.ఆశ్వ. ప316

394 తే॥గీ॥ భర్తచేత నియోగింపఁ ♦ బడక సతికి
నేదియును జేయఁగాఁ దగ ♦ దెద్దియైన
భర్తచేత నియోగింపఁ ♦ బడినదానిఁ
జేయకునికి దోషం బని ♦ చెప్పెమనువు॥ ఆది. ఆశ్వ. ప92

395 క॥ పురుషులచే ధర్మస్థితిఁ
బరిగ్రహింపంగఁబడిన ♦ భార్యలకు నిరం
తరము నిజపురుషభక్తియుఁ
బరపురుష విసర్జనంబుఁ♦బరిచిత మయ్యెన్॥ ఆది. ఆ శ్వ. ప93

396 ఆ॥ వె॥ ఎట్టిసాధ్వులకును ♦ బుట్టినయిండ్లను
బెద్దకాల మునికి ♦ తద్ద తగదు
పతులకడన యునికి ♦ సతులకు ధర్మువు
సతుల కేడుగడయుఁ ♦ బతులచూవె॥ ఆది. ఆర. ప64

397 ఆ॥వె॥ పురుషుకంటె మున్ను ♦ పరలోక మేఁగిన
సతియ నోఁచినదియు ♦ సతులలోనఁ
బురుషహీనయయినఁ ♦ బరమపతివ్రత
యయ్యు జగముచేత ♦ వ్రియ్యఁబడదె॥ ఆది. ఆ౽. ప253

398 తే॥గీ॥ బాల్యమునఁ దండ్రి, యౌవన ♦ ప్రాప్తి మగఁడు,
వార్ధకంబునఁ దనయుఁడు, ♦ వామనయన
నరసి నడుపఁగా నెందును, ♦ నంగనలకు
వలసినట్టులు చేయఁగా ♦ వచ్చునెట్లు॥ అను. ఆ ౨. ప22

399 చ॥ అలయక మంత్రతంత్రవివి♦ధౌషధభంగులఁ జేసి యెంతయుఁ
వలతురు నాథులంట మగు♦వా! కడు బేలతనంబు దానముఁ
గలిగిన పేర్మియుఁ బొలియుఁ♦గాని యొకంటను సిద్ధిబొంద ద
ప్పొలఁతులతోడియున్నియహిఁ♦పొత్తుఁగఁజూచువిభుండెఱింగినఁ॥
ఆర. ఆ ౫. ప296

400 చ॥ మగువయొనర్చువశ్యవిధి♦మందులుమాయలునొండుచందమై
మగనికిఁ దెచ్చు రోగములు♦మానక మూకజడాది భావముల్
మొగి నొనరించు నద్దురిత♦ము ల్దనచేసిన చేఁతలై తుదిఁ
జగమున నెక్కు నిందయును ♦ సద్గతిహానియు వచ్చు నింతికిఁ॥
ఆర. ఆ౫. ప 297

401 క॥ కావునఁ బతులకు నెప్పుడుఁ
గావింపఁగఁ దగదు కపట♦కర్మంబులు ద
ద్భావ మెఱిఁగి వశవర్తిని[1]
యై వనిత చరింప నదియ♦యగు నెల్లవియుఁ॥ఆర. ఆ౫. ప298

402 క॥ గతి పతియ చువ్వె భార్యకు
నతని గడచినట్టి సత్వ♦రాయణము కృపా
యుత కలదే కావునఁ దా
నతనికి భక్తయగు టిచ్చు♦నఖిలశుభంబుల్॥ అను. ఆ౫. ప297

---

(1) యనువర్తిని

403 ఆ॥ వె॥ పురుషునందు దోష♦పుంజంబు గలిగిన
నెఱిఁగి యది సహించు♦నేని భార్య
పురుషునం దభీష్ట♦భోగంబు దేహాంత
రంబునందు ధర్మ ♦ రతియుఁ బడయు॥ ఆర.ఆ౨. ప159

404 తే॥ గీ॥ అనపహార్యంబు తేజోమ♦యంబు సర్వ
గుణములకు నలంకారంబు ♦ గురుతరంబు
భామలకు బతిభక్తియ ♦ పరమమైన
భూషణం, బిట్టివే పెఱ ♦ భూషణములు? ఆర.ఆ౨. ప142



౧౨. కు ల ధ ర్మ ము.

405 క॥ తన కులధర్మము విడువక
మనుట పరమధర్మ మండ్రు ♦ మాన్యులు చిత్తం
బునఁ గృపగలుగుట ముఖ్యపు
పని సైరణ వలయు నఖిల♦భావము లందున్॥ ఆర.ఆ౫. ప37

406 క॥ ఒప్పెడునదియైనను గడు
నొప్పనియదియైన నిజకు♦లోచితపథమున్
దప్పఁ దగ దండ్రు ధార్మికు
లప్పని నిజభాగ్యవిహిత ♦ మని యుండఁ దగున్॥ ఆర.ఆ౫.ప64

407 తే॥ గీ॥ ఒప్పకున్నను నాత్మకు♦లోక్తకర్మ
మూర్ధ్వగతిఁ జేర్చుఁ బరకర్మ ♦ మొప్పెనేని
నార్యజనములు కిల్బిష ♦ మండ్రు దానిఁ
గాన నడుపుము నిజవంశ♦కర్మ మధిప॥ శాంతి. ఆ౧. ప279

408 క॥ కుల రూప గుణ ద్రవ్యం
బులు విక్రమవంతునందు ♦ భూవిదితములై
నిలుచు నవిక్రమునకు నవి
గలిగియు లేనిక్రియ నప్ర♦కాశంబు లగున్॥ సభా. ఆ౧. ప127

409 క॥ ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదంబుఁ ♦ బొనరించును, స
జ్జను లైనవారి కడఁకువ
యును వినయము నివియె తెచ్చు♦నుర్వీనాథా॥ ఉద్యో.ఆ౨ ప35

410 క॥ కులనాశము సేసినఁ ద
త్కులధర్మ మడంగు నష్ట♦కులధర్ములకుం
గలుగును దుస్సంకర మ
క్కులఘ్ను లేగుదురు నరక ♦ కూపంబులకున్॥
భీష్మ. ఆ౧. ప187

411 ఆ॥ వె॥ ధాత నిన్ను నేమి ♦ ధర్మంబు నడుపుట
కై సృజించె దాని ♦ నాచరించి
యుండు నీకు నీవ ♦ యొడయుండవై ధాత్రి
నోదితపవిత్ర ♦నుఁడవు గాఁగ॥ శాంతి. ఆ౧. ప209

౧౩. ధర్మగుణము.

412 తే॥ గీ॥ వేదవిహితంబులును శాస్త్ర♦విహితములును
శిష్టచరితంబులును నన ♦ జెప్ప నొప్పి
ధర్మములు మూఁడు విధముల ♦ దనరుచుండుఁ
గడఁగి యిన్నియు సద్గతి ♦ కారణములు॥ అర. ఆ౫. ప49

413 చ॥ అరయఁగ ధర్మతంత్రముల ♦ యందు నిరర్థము లేదొకండు నె
వ్వరి మదియందు వారిలెఁ దగ♦వారలు దానినపూని యాచరిం
తు రదియ వారి కిష్టఫల ♦ దోహనకార్య మొనర్చు నెల్లెడం
బురుషులఁ జూడమే తమకుఁ ♦ బోలినధర్మముల న్వాలుంగఁగన్॥
శాంతి. ఆ౬. ప545

414 క॥ ధీరమతి యుక్తిజేసి వి
చారింపఁగ నిక్కువంబు ♦ సర్వజన స్వ

1. నోదితపవిత్రవర్తనుఁడవు.

ర్గారోహణ సోపానం
బారఁగ ధర్మంబుచూవె ♦ [1]యారంబుజనేత్రా. ఆర. ౫౧. ప229

415 క॥ ఉత్తమపథంబు ధర్మా
యత్తము ధర్మంబు మృతుల ♦ కధిప! సహాయం
బెత్తెఱఁగున ధర్మక్రియ
చిత్తంబునఁ జేర్పవలయు ♦ జీవించుతఱిన్. అను. ౫౮. ప251

416 క॥ అంతంతకు సత్కర్మము
లెంతయుఁ బెనుపొంద జీవుఁ ♦ డెక్కుడు చేయం
జింతాకలుషము వాయఁగ
సంతోషామృతము నాని ♦ సంశుద్ధుఁడగున్. శాంతి.౫౨. ప419

417 గీ॥ ఉత్సవంబుమీఁద ♦ నుత్సవ మందుచు
సుఖముమీఁద సుఖము ♦ చొప్పడంగఁ
బుణ్యపదముమీఁదఁ ♦ బుణ్యపదంబున
కరుగు నరుఁడు సుకృతి ♦ యైన నధిప. శాం. ౫౮. ప74.

418 తే॥ గీ॥ మేలు రెండులోకంబుల ♦ మేలు తెచ్చుఁ
గీడు చేసినఁ దప్పదు ♦ కీడె యగును
గానఁ [2] బుణ్యవర్తనమున ♦ కానుకూల్య
శీలమవు దైవ మది ఫల ♦ సిద్ధిఁజేయు. అను. ౫౧.ప137

419 క॥ ఈలోకమ యగుఁ గొందఱ
కాలోకము గొందఱకు ని♦హంబును బరమున్
మేలగుఁ గొందఱ కధిపా!
యేలోకములేదు వినవె ♦యిల గొందఱకున్. ఆర.౫౮.ప174.

420 చ॥ ధనములు సాల గల్గి సత♦తంబును నింద్రియవాంఛసల్పుచున్
మనమున నెన్నఁడున్ సుకృత♦మార్గముఁబొంతనుబోక శోభ మో
హనిరతబుద్ధులై తిరుగు ♦ నట్టిజను ల్పరలోకసౌఖ్యముల్
గనుటకు నేర [3]రెప్పటిసు♦ఖంబులు మేలయితోఁచు వారికిన్॥
ఆర. ౫౮. ప 176.

---

(1) యతిరక్షుఁడై (2) బుణ్యవర్తనునకు (3) రెక్కుడి

421 మ॥ ఉపవాసవ్రత సంతతాధ్యయన తీర్థోపాసనాదిక్రియై
కపరత్వంబునఁ జేసి యైహికము దుఃఖప్రాయమై పోవఁగా
విపులానందముఁ బొందగల్గుఁ దుది నావిర్భూతభోగైక లో
లుపబుద్ధిం జిరపుణ్యశీలురకు నాలోకంబునన్ భూవరా!
ఆర. ఆ ౪. ప 177.

422 ఉ॥ ధర్మము పల్కుచుం దగిలి ధర్మపథంబునఁ జేసి యర్థముల్
బేర్మియుఁగాంచి ధర్మవిధిఁ బెండిలియై ప్రజలన్ సృజించి స
త్కర్మములం బ్రశస్తములుగాఁ గ్రతువుల్ వొనరించుసజ్జనుల్
ధర్మజ! యిందు నందును ముదంబునఁగాంతురభీష్టసౌఖ్యముల్॥
ఆర. ఆ ౪. ప 178

423 ఆ॥ వె॥ సత్యమును శమంబు శౌచంబులేక నా
స్తిక్యమును నిషిద్ధ సేవనంబు
గలిగి తిరుగు దుష్టకష్టజన శ్రేణి
పొలియు నుభయలోకములకుఁగాక. ఆర. ఆ౪ ప 179.

424 తే॥ గీ॥ వనిత లీపాపములు చేసి వానివాని
పత్నులై జనియింతురు పాపభీతిఁ
దెరువుఁ దప్పక నడిచిన నరులు సౌఖ్య
మందుదురు రెండులోకంబులందునసఘ! అను. ఆ౪. ప268

425 క॥ విను, మాంస శోణిత వివ
ర్ధన మగు నైహికమునందుఁ దత్పరులు పరం
బని యొకటి కలిమి దలఁపరు
గొనరు బుధులమాట నాస్తికులు వినయనిధీ! శాం. ఆ౬. ప225.

426 క॥ వినను గాథనిరూపణ
మానసుఁడై యార్యజనుల మహితవచనముల్
-వీనుల నూనుచు ధర్మము
లైనవి సేయంగఁ దప్ప కగుఁదత్ఫలముల్. శాంతి. ఆ౪, ప78.

427 తే॥ గీ॥ పుణ్యపాపానుగుణభంగిఁ బుట్టి సౌఖ్య
దుఃఖమయ సంసరణమునఁ దొడరి నరుఁడు

వినుము కేవల ధర్మవ♦ర్తనసుఖైక
[1]భాజనము నొందు ధర్మైక ♦ పరత మేలు॥ అను.ఆ౪.ప257

428 క॥ అమరఁగ దాక్షిణ్యము ధ
ర్మమునకుఁ గుదురండ్రు గీర్తి ♦ మహిమ నెలవు దా
నము సత్యము సురపురి మా
ర్గము శీలము సంశ్రయము సు♦ఖంబుల కెల్లన్॥ ఆర.ఆ౭.ప443

429 క॥ ధర్మంబుఁ బరిజ్ఞానము
నిర్మలమతి నభ్యసించి ♦ నృప! యనిశంబున్
ధార్మిక సంగతి గలిగినఁ
బేర్మి యుభయలోకముల న ♦ భిస్తుత్య మగున్॥ శాంతి.ఆ౬.ప74

430 ఆ॥వె॥ అంతకుండు జనుల ♦ కాసన్నుఁడై యుండ
నిమిషమాత్రమేని ♦ నిశ్చయింపఁ
దగని జీవనంబు ♦ దద్ద సుస్థిరముగాఁ
జేసి కార్యమెడయుఁ ♦ జేయఁదగునె॥ ఆర.ఆ౧.ప261

431 తే॥గీ॥ జరయు మరణంబు మర్త్యని♦జన్మమాది
గాఁగ వెనువెంటఁ దగులు నం♦గంబు వేచి
యెల్లి చేసెద ననక మే♦లిపుడు సేయు
మనఘ యోర్చునె మృత్యువు♦జనులపనులు॥ శాంతి.ఆ౬.ప234

432 తే॥గీ॥ మీను వల తన్నుఁ బొదువుట ♦ గాన కిష్ట
వృత్తివిహరించుచుండెడు ♦ విధమ కాదె
యెల్లిచేసెద ననక మే ♦ లిపుడ చేయు
మనఘ [2]యోర్చునె మృత్యువు ♦ మనుజుపనులు॥ శాంతి.ఆ౫.281

433 క॥ ఆపద యయినను ధర్మువ
ప్రాపుగ రక్షింపవలయుఁ ♦ బరమార్థము [3]ధ
ర్మోపాయము ధార్మికులకు
నాపద జన్మాంతరమున ♦ ననుగత మగుటన్॥ ఆది.ఆ౬.ప218

434 ఆ॥వె॥ పడయరాని యాయు ♦ వొడలికిఁ గలిగినఁ
బాపకృతుల దానిఁ ♦ బదటఁ గలుప

(1) భాజనత (2) దార్చునె? (3) ధర్మోపాయము

నగునె? పుణ్యవిధి స♦మాచరణముల గై-
సేయవలయు గాక ♦ చెలువు మిగుల॥ శాంతి.ఆ౫.ప480

435 క॥ అనఘా! మర్త్యుల జీవన
మనిత్య మని యెఱిఁగి సుఖము ♦ నప్పుడు దుఃఖం
బు నపుడు ధర్మం బేమర
కునికియ యొజ్జాతి కైన ♦ నురు వూహింపఁ॥ శాంతి.ఆ౫.ప489

436 క॥ జాతుఁడు మృతుఁడగుట ధ్రువము
భూతోల్లాసము లనిత్య♦ములు విను సద్యః
పాతియగు శరీరంబున
కై తోరఁగునె ధర్మపథము ♦ నార్యుండధిపా॥ శాంతి.ఆ౫.ప519

437 క॥ భూతము లింద్రియగుణసం
ఘాతము సత్త్వాదిగుణని♦కాయము గాయం
బై తోఁచు టెఱిఁగినను ధ
ర్మేతర కృత్యములు సేయు♦నే నరుఁడనఘా॥ శాంతి. ఆ౫ ప518

438 క॥ జనన జరామరణగ్రా
హానిబిడ కాలాబ్ధిమగ్న♦మని జగము నెఱిం
గినవాఁడు ధర్మవర్తన
మున నుండును జింతదక్కి ♦ భూపవరేణ్యా॥ శాంతి.ఆ౧.ప219

439 క॥ ఎఱుకఁ గలవారిచరితలు
గఱచుచు సజ్జనులగోష్ఠిఁ ♦ గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగినదానిని
మఱువ కనుష్ఠించునది స♦మంజసబుద్ధిఁ॥ ఆది. ఆ3.ప202

440 చ॥ తనతనధర్మమున్నడపి ♦ దానన వంతనమంది శాంత భా
వ విరతి నుండువారిఁగని ♦ వారలు చెప్పెడు ధర్మవృత్తి ని
చ్చెనయుఁగ న్మాఁది వత్పథము♦జెందుట కెక్కుము పొత్తి నూలిప
ట్టున కెనగాకు బంధకుఁడ♦వుం దన కజ్జుఁడు దానయమ్మెయిఁ॥
శాంతి. ఆ౬. ప227

441 తే॥ గీ॥ పాపకర్మంబు లెల్లను ♦ బాయఁ బెట్టి
పుణ్యకృత్యంబు లందును ♦ బురుషుఁ ద్రోపి
నట్లు శుద్ధమనస్కుఁడై ♦ యాచరించు
వాఁడు సజ్జనసంగతి ♦ వలయు నెపుడు॥ శాంతి. ఆ ౫. ప451

442 తే॥ గీ॥ పాప మించుక తోడరెడు ♦ [1]పనుల నెట్టి
ఫలముగలిగిన వల దల్ప♦ఫలవిధాయి
యైన పుణ్యమిశ్రిత కార్య ♦ మాచరించు
నది శివం బగు దాన ని♦హాముష్మఁ బరము॥ శాంతి. ఆ౫. 460

443 క॥ ధార్మికులు సలుపు నుత్తమ
కర్మముఁ జెడనాడు నాస్తి♦కజనము విను మా
దుర్మతుల తెఱఁగుఁ గనుఁగొని
ధర్మమునెడఁ బ్రీతి వదలఁ ♦ దగదు బుధునకున్॥ఆర.ఆ౫.ప40

444 క॥ పులుగులలోఁ బూత్యండక
ములు సారములైన ధాన్య♦ములలోనను బొ
ల్లులుఁ బోలెను జూవె మను
ష్యులలో ధర్మరహితాత్ము♦లుర్వీనాథా ! శాంతి. ఆ ౪. ప75

445 క॥ పాపంబులు కర్దము లని
యేపునఁ జేయంగ నవియు ♦ నింపగు ధర్మ
వ్యాపారంబులు గార్యము-
లై పరిణతిఁ బొందెనేని ♦ నట్టుల చెల్లున్॥ ఉద్యో. ఆ౨. ప69

446 సీ॥ సత్యహితాలాప ♦ చతురత యర్థంబు
సంతత సుజనపూ♦జనము వలయు
[2]వినుఁ క్రోధసంరంభ ♦ విద్వేషములుఁ జేసి
మతి గలంగినను ధ♦ర్మంబుఁ దప్ప
కుండంగ నడచు ట♦త్యుత్తమసరణి య
ప్రియములు యందును ♦ బ్రియము లందు
దైన్య హర్షంబులఁ ♦ దగులక యున్నట్టి
కల్యాణవర్తన ♦ కాంతు లెన్న

(1) పనియు (2) వినుకామ

గీ॥ యెగ్గు సేసినవారికి ♦ హితము సేత
యార్యజనములు గీర్తింతు ♦ రన్యదోష
కారి![1] దనపాపమునఁ దాన ♦ కాలిపోవు
వేఱ వానికిఁ గీడు గావింప నేల? ఆర. ఆ౫. ప39

447 క॥ శరణం బని వచ్చిన భీ
కరశత్రుని నైనఁ బ్రీతిఁ ♦ గావఁగవలయుం
గరుణావరుల తెఱం గిది
యిరువుగ సరిగాఁపు దీని ♦ కేధర్మంబుల్॥ ఆర. ఆ౫. ప411

448 ఆ॥వె॥ కావరయ్య యనినఁ ♦ గరము దుర్మార్గుఁ డైన
జెనసి యోపినంత ♦ చేయు ననిన
నూరకుండు నయ్య ♦ యుత్తమశూరుండు
దీనజనుల యున్న ♦ తెఱఁగు చూచి॥ ఆర. ఆ౫. ప412

449 క॥ కృత మెఱుఁగుట పుణ్యము స
న్మతి దానికి సమము చేఁత ♦ మధ్యము, మఱి త
త్కృతమున కగ్గలముగ స
త్కృతి సేయుట యుత్తమంబు♦కృతబుద్ధులకున్॥ఆది.ఆ౬.ప241

450 క॥ మనమున [2]వైరము దలఁపమి
యును సద్ధర్మాత్ముఁ డగుట♦యును గుణములు చే
కొని దోషంబులు విడుచుట
యును నుత్తముఁడైన పురుషు ♦ నుత్తమగుణముల్॥
సభా. ఆ౨. ప266

451 క॥ ఒరు లేమేని యొనర్చిన
నరవర! యప్రియము దనమ♦నంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ♦పథముల కెల్లన్॥ శాంతి. ఆ౫. ప220

452 క॥ దొరకొని పుణ్యముఁ బాపముఁ
నరుఁ డర్థిం జేయుచుండ ♦ నడుమ [3]నొకంట

(1) దనదోషమున (2) నేరమిఁ దలఁపమియును సత్ క్షమ చిత్తుఁ (3) నొకటియన స్వైరవుక

స్వైర వెడలి తప్పినను ద
త్పరిణతి ఫలమొందు నందురి ♦ ధర్మవిధిజ్ఞుల్ ॥ఉద్యో. ఆ౩. ప240

453 క॥ అనలం బించుకయైనఁ బ
వనుచే వెలుగొందుమాడ్కి ♦ వర్ధనముం బొం
దును సత్కర్మాచరణం
బున దైవం బానుకూల్య♦మునఁ గురుముఖ్యా॥అను. ఆ౧. ప138

454 క॥ విను కుసుమంబుల వాసిం
చిన నొప్పనికంపు విడిచి ♦ చెందును సౌర
భ్యనిరూఢిం దిల లట్టుల
యనఘా! సుకృతముల జీవుఁ ♦ డకలంకుఁ డగున్॥
శాంతి. ఆ౫. ప418

455 చ॥ జనులకుఁ గీడు రోయక య♦జస్రము ధర్మరతిం జరించి స
జ్జన గురు పూజనంబులును ♦ సత్యహితోక్తులు దీనపోషణం
బును నతిథిప్రియత్వమును ♦ భూరిదయార్ద్రతయుం గలట్టి వా
రనిమిషలోకగాము లని ♦ యాత్మ నెఱుంగుము మేనకాత్మజా!
అను. ఆ ౫. ప219

456 క॥ సుకృతముల నరుఁడు నాకము
నకుఁ జను నవి కొంచమైన ♦ నరుఁడ యగును వా
నికి దివి కేగి డిగిన యత
నికి మానుషవైభవములు ♦ నెరయం గల్గున్. అను. ఆ౫.ప121

457 క॥ ధర్మార్థకామగోచర
కర్మములకు సాత్వికాది♦కప్రకరవికా
రోర్ములు హేతువు లగు ని
ష్కర్మత కేతద్విభూతి♦కారణమునుఁడీ॥ అశ్వ. ఆ ౨. ప129

458 ఆ॥ వె॥ సకల పుణ్య కర్మ ♦ చయమును నొకదెస
వినుము పాడి దప్ప ♦ కునికి యొక్క
వలను దీని తప్రతులు ♦ తెలిపెదు నెడఁ బాడి
కలిమి [1]యుండ పెద్ద ♦ గానుపించు॥ ఉద్యో. ఆ౨. ప66

(1) గుండుఁ బెద్దగా నుతించు

459 తే॥ గీ॥ పాడి గలిగిన నిహలోక♦ఫలములెల్లఁ
జేరుటయుకాదు కీర్తియుఁ ♦ జెందుఁ బురుషు
[1]ధరణిఁ బరఁగుఁ బొగడ్త యెం♦దాక నంత
కాలమును బుణ్యలోకంబు ♦ గల్గు నందు॥ ఉద్యో. ఆ౨. ప67
460 చ॥ చిరముగ ధర్మము ల్నడుపఁ♦జిత్తము దేఱుఁ బ్రసన్నచిత్తుఁడై
పరువడి నింద్రియార్థముల ♦ భంగులు రిత్తలుగా నెఱింగి చె
చ్చెర నవి యంతవట్టు నిర♦సించి తపోదమ సత్యశీలతం
బరిణతినొంది పొందుఁబిద♦పం బరమార్థ పదప్రభావముఁ॥
ఆర. ఆ౫. ప77



౧౮ దానవిధి

461 తే॥గీ॥ వినుము దానంబుఁ దపమును ♦ వృద్ధసేవ
నము నహింసయు నియతకృ♦త్యములు సర్వ
జనుల క్షేమహాగుణములు ♦ మనమునందు
దృఢముగా నిల్పి నడుపుము ♦ ధీరవర్య!॥ అను. ఆ౫. ప434
462 తే॥గీ॥ ఇందుఁ జేసిన పుణ్యంబు ♦ లందుఁ గుడుచు
మీఁదిజన్మంబునకు నది ♦ మేలు సేయుఁ
గావఁ దన శక్తితోఁ గూడ ♦ దానధర్మ
చిరపరోపకారంబులు ♦ సేయవలయు॥ ఆర. ఆ౬. ప 109
463 శా॥ అన్యాయార్జితమైనవిత్తమునఁ జే♦యంబూను దానంబు మూ
ర్ఖన్యాయం బది దానఁ జేసి ఫలసా♦కం బేమియుఁ లేదు యు
క్తన్యాయార్జిత మించుకంత యయినం ♦ గాలంబు దేశంబు స
న్మాన్యంబై తగఁ బాత్రయోగమునసా♦మ్యంబై ఫలించుందుదిఁ॥
ఆర. ఆ౬. ప 112
464 క॥ తనకుఁ దనయులకు సతులకు
జననీజనకులకు బంధుజనులకుఁ గీడాం

1 ధరణిఁ బొగడిత యెందాఁ పరగునంత

దని తెరువునఁ గీర్తి గొనం
జనుఁ గాకందఱును జెడుయశం బేమిటికిన్॥ అర. ఆ౭. ప297

465 క॥ ధన మించుకేని ధర్మం
బునఁ బడచినయట్టిదైన ♦ భూవర! పాత్రం
బున నిడిన నది మహాఫల
జనకం బగు నండ్రు వేద♦సంవేదిజనుల్॥ శాంతి.ఆ౫.ప483

466 ఆ॥ వె॥ ధర్మలబ్ధమైన ♦ ధనము పాతికయేని
బహుళఫలము నిచ్చుఁ ♦ బాపవృత్త్యు
పార్జితంబు కోటి ♦ యైన నిష్ఫల మండ్రు
దాన శాస్త్రవిదులు ♦ మానవేంద్ర॥ శాంతి.ఆ౫.ప492

467 క॥ పరమత్వము లే కంతః
కరణంబున శుద్ధి జాలఁ ♦ గలిగి ప్రియము పొం
పిరివోవఁ జేత దానము
పరమోత్కృష్టంబు పద్మ♦పత్రనిభాక్షీ॥ అను.ఆ౫. ప212

468 క॥ తమతమ సారములకుఁ దగఁ
గమలాక్షీ! చేయుదాన ♦ కల్పనల విశే
షము లొక్కరూప యగుఁ ద
త్ప్రమాణరూపణము నేసి ♦ పలికెదఁ దెలియన్॥ అను ఆ౫.ప210

469 క॥ విను మొక కుంచెడుధాన్యము
దన కాయతి గల్గునతఁడు ♦ దాని నొసఁగినన్
ధనకోటి గల్గువాఁ డ
ద్ధన మొసఁగిన నొక్కరూప♦తత్ఫలముల్॥ అను.ఆ౫.ప211

470 క॥ నిజదార పరులు సంతత
యజనరతులుఁ గామ రోష ♦ హంతలు నగు స
ద్ద్విజుల నరసి ధన మిచ్చుట
త్రిజగత్సామ్రాజ్య మగు నండ్రు ♦ క్షితివిచారా! అను. ఆ౨.ప341

471 క॥ దారిద్ర్యముచే గుందుచు
నేరిని నడుగంగఁ బోవ ♦ కెంతయుఁ గృశతన్

గూరిన విప్రిన కర్వర
వారని దయ నీగి ఫలము ♦ వాగ్గోచర మే? అను. ఆ౨. ప353

472 క॥ అడుగక యుండిన నాలిం
గొడుకుల రక్షింపలేక ♦ కుతిలపడుచు నె
ప్పుడుఁ బేదతనము గల నరు
నెడరుడుపఁగవలయు నదిమ♦హితగుణ మనఘా! అను. ఆ౨. ప340

473 క॥ అరియైన దీనుఁడై తను
శరణం బని వేఁడినం బ్రి♦యన్నాత్మత న
ప్పురుషుని కోరికదీర్చినఁ
బురుషోత్తముఁ డందు రతనిఁ♦బురుషవరేణ్యా! అను. ఆ౨. ప339.

474 క॥ మౌనమున దృఢజ్ఞానము
దానంబున నభ్యుదయము ♦ ధర్మనిరత! యా
శానిర్వాహణంబున నర
కానీకాహరణసౌఖ్య ♦ మగు నండ్రిబుధుల్. శాంతి. ఆ౬. ప585

475 చ॥ ధన మది యేల భోగమును ♦ దానము లే దగు నేని, శత్రుమ
ర్దన మొనరింపఁ డేని బల♦దర్పము లేల, సధర్మవృత్తికిం
గొనకొనఁ డేని విన్కి ముని♦కుంజర! యేల, జితేంద్రియుండు గా
డనఁ జను నేని నాత్మవిధ♦మారయు నాగ్రహ మేల? చెప్పుమా॥
శాంతి. ఆ౬. ప243

476 చ॥ అడిగిన నిచ్చు కంటెను న♦యాచకుఁ గాఁగ నెఱింగి యిచ్చు టె
క్కుడుఫల మిచ్చు దానవిధి♦కోవిద! వేఁడుట చావు వేఁడఁగాఁ
బడు టది పెద్దచావు, తగు♦ ప్రార్థన పూర్ణము చేయు నాతఁడా
యడిగినవానిఁ దన్నును ద♦యారతిఁ గావఁగఁ జాలువాఁ డగుః॥
అనుః ఆ ౨. ప 343

477 క॥ ఇచ్చునది ధనము పాత్రిన
కిచ్చుగ నొరు వేఁడకుండు ♦ నది యభిముఖులై
వచ్చిన యాశార్థుల వృథ
పుచ్చక చేయునది సర్వ♦భూతప్రీతిః॥ ఆది. ఆ౩. ప123

478 క॥ చెలులుం జుట్టలు సంబం
ధులు ఋత్విజులును బురోహి♦తులుఁ దగుపాత్రం
బులు హింసాక్రోధేర్ష్యా
దులు లేని జనంబులైన ♦ దురితవిదూరా! అను. ఆ ౨. ప162

479 క॥ [1]శిల దేపమ్రానుగాఁ గొని
జలనిధిఁ [2]గడవంగఁ గోరు ♦ చాడ్పగుఁ బాత్రం
బులు గానియెడల దానం
బులఁ బాపము నిస్తరింప ♦ బుద్ధిఁ దలఁచినన్॥ శాంతి.ఆ౧.ప330

480 క॥ కావున విను పాత్రము మే
లై విహితాచరణ సామ్య ♦ మగుదానము ధా
త్రీవర! [3]పాత్రము దాతలఁ
దా వెలయించు భువనద్వ♦తయరంజకతన్॥ శాంతి.ఆ౧.ప334

481 తే॥గీ॥ షండునకు బిడ్డ నిచ్చిన ♦ చంద మొందు
బూదిలో నేయి వ్రేల్చిన♦[4]పోల్కి యోటి
కడవలో నీళ్ళు పట్టిన♦కరణి యగు న
పాత్రజనులకుఁ బెట్టుట ♦ పౌరవేంద్ర! శాంతి. ఆ౧. ప332

482 ఆ॥వె॥ పునుకఁ గుక్కటిత్తి♦ బోసినపాలు నీ
ళ్ళధిక[5]నింద్యమైన ♦ యట్లు దుష్ట
మై యపాత్రవిషయ ♦ మగు నీగి వృథవోవు
నిచ్చుచోట బాత్ర ♦ మెఱుఁగ వలయు॥ శాంతి.ఆ౧.ప331

483 సీ॥ పాడియు నాడియు♦బ్రదుకువారలఁ బరి
హాసకు దుర్జను ♦ నంగహీను
మత్తుని మ్రుచ్చు ను♦న్మత్తు నపుంసకుఁ
జనఁటిమాటలఁ దేల్చు ♦ మనుజుఁ గులము
చాలమి వేదంబు ♦ చదువమి నిజవృత్తి
హాని దుర్వృత్తి గ♦లట్టివాని
దానపాత్రంబులు ♦ గా నియ్యకొనరు పె
ద్దలు దీనులును విప♦ద్బాధితులును

---

(1) శిలచేవ మ్రాను దెప్పఁ (2) గడచంగ దొంకొనన (3) దాతృదాతల
(4) పోలనూటి (5) నింద పొందునట్లు

గీ॥ నీగి కర్షాలు దయపేర్మి ♦ నిచ్చుచోట
నైన నవగుణ మెక్కుడై ♦ కానఁబడిన
నిందితాత్ముల కిచ్చుట ♦ నిష్ఫలంబు
పాత్రనిశ్చయ మిట్టిది ♦ పౌరవేంద్ర! శాంతి. ఆ ౧. ప329

484 ఆ॥ వె॥ పాడి దప్పకుండఁ ♦ బడసినయర్థ మ
పాత్రములకుఁ నీగి ♦ పాత్రములకుఁ
బెట్ట కునికి యనఁగ ♦ నెట్టన రెండు వి
ధములఁ గీడు దొడరు ♦ ధరణినాథ! ఉద్యో. ఆ౨. ప43

485 తే॥గీ॥ అడవి గోవులకై శాల్చు ♦ టధ్వరమునఁ
బశువుఁ జంపుట దానము ♦ పాత్రభూతుఁ
డగు లెఱుంగక యిచ్చుట ♦ తగనిబంటు
బ్రోవకుండుట గీడులు ♦ గావు వత్స! శాంతి. ఆ౧. ప302

486 క॥ దానవిధి యరయ నసమీ
చీనం బగు నేనిఁ గీడు ♦ నేయుం గురుధా
త్రీనాథ! మఱియు బాత్రం
బైనను గొన్నతని కిచ్చు ♦ నతనికి నెట్లుఁ॥ శాంతి. ఆ ౧. ప333

---

౧౫—అన్నదానము.

487 క॥ దానార్హవస్తువులలో
మానిత మన్నంబ యన్న ♦ మయముల యసువుల్
మేను దదీయబలంబును
గాన బుధులు దానిఁ దద్ద ♦ గైకొండ్రుమదిన్॥ అను. ఆ౪. ప550

488 క॥ తనకుఁ గలయట్టి యన్నము
నన సుర పితృపూజనములు ♦ నరునకు నడుపం
జను నతిథితర్పణము దా
నన తగ నొనరించువాఁడు ♦ నరవరముఖ్యా! అను. ఆ౨. ప407

489 తే॥గీ॥ దివసము వంధ్యంబు గాకుండఁ ♦ దివిరి యన్న
పానదానంబు లొదవిన ♦ భంగిఁ జేసి

మఱి భుజించుటఁ బోలెడు ♦ మహిత ధర్మ
కార్య మొండొకఁ డెందును ♦ గలదె యరయ॥ అను.ఆ౮.ప275

490 తే॥గీ॥ అజుఁడు కల్పాదియం దన్న ♦ మమృత మనియె
నన్నహాని బలాధికు ♦ నైన దుర్బ
లాత్ముఁగాఁ జేయుఁ గావున ♦ నన్న భుక్తి
సకలధాతు వృద్ధికినయి ♦ జనము గోరు॥ అను. ఆ ౭. ప 374

491 క॥ కులమును విద్యయు వృత్తము
నలఘుమతీ యన్నమిడుట ♦ కై యడుగంగా
వలవదు విప్రుని నాదర
మలరంగా నిడుట లెస్స ♦ యడిగినమాత్రన్॥ అను.ఆ౭.ప372

492 సీ॥ ప్రాణంబులకును ధా♦రక మన్న మింటికి
నంబుల కుడిగి యై♦నను సభక్తి
నతిథికిఁ బెట్టుట ♦ యధికపుణ్యము శ్రాంతు
వృద్ధుఁ దాపసు బాలు ♦ వికలు వనితఁ
గడపఁగా దాకలి ♦ గదిరి యర్థించిన
[1]గృహమేధి కవమతి ♦ కినుక దగదు
కాలంబుతోఁ గుక్క మాలఁడు ♦ తుదిఁగాఁగ
నాఁకొని వచ్చిన ♦ ననుగుణముగ
గీ॥ నాచరింపవలయు ♦ నాహారకల్పన
మునులు దేవ పితృ స♦ముత్కరముల
నన్నదానవిధుల ♦ నాదరంబుగఁ బ్రియ
మొందఁజేత బోల ♦ వొండువిధులు॥ అను. ఆ౭. ప371

493 క॥ మునులును దివిజులు నన్నము
వినుతింతురు లోకతంత్ర ♦ విధి గ్రతువులు ద
క్కనుగల సర్వము నన్నం
బున నడచుం గాన నన్న♦ము విశిష్టమిలన్॥ అను. ఆ౧. ప369

494 ఆ॥వె॥ అన్నదానసదృశ ♦ మగుదాన మెందు నె
న్నఁడును లేదు గావు♦నను విధేయ

(1) గృహమేధి,

మన్నదాన మధిక ♦ యత్న పూతంబుగాఁ
బూని దానిచేఁత ♦ పుణ్యతమము॥ అను. ఆ౨. ప370

495 క॥ విను దానంబులఁ బాపము
లనఘా! చెడు దానములకు ♦ నన్నిటికిని స
జ్జనసేవ్య! యన్నదానము
మను లధికం బండ్రు పాప♦ములఁ బాపు నెడన్॥ అను.ఆ౪.ప270

496 ఆ॥వె॥ అన్నమిడిన మణిమ♦యావాస శయ్యాస
నములు నమృత భోజ♦నంబు హృద్య
మాల్యలేపనములు ♦ మహనీయ మహిళాను
భవముఁ జిరతనొందు ♦ దివమునందు॥ అను.ఆ౨. ప376

---

16–జలదానము.

497 క॥ పానీయదాన ముత్తమ
దానంబని యఖిల ధర్మ♦తత్త్వదృఢ పరి
జ్ఞానానూనుం డగు మను
మానవపతి చెప్పె నృపస♦మాజవరేణ్యా! అను. ఆ౨. ప383

498 సీ॥ దేవ తిర్యఙ్నర ♦ స్థావరాశ్రయము త
టాకంబు వినుమట్లు♦గాక యందు
గోకులంబులు నీరు ♦ గొని దానకర్తకు
లము నెల్ల బుణ్యలో ♦ కమున కనుచు
నీలోకమున శ్రీయు ♦ నెక్కుడు కీర్తియు
నతనికిఁ జేయు వ♦ర్షాగమమున
నీతున వేసవిఁ ♦ జెరువులో నీరున్న
నగ్నిహోత్రాదిమ ♦ యజ్ఞవాజి

గీ॥ పేయ ఫలము లోలి ♦ నొయునకగుఁ గట్టఁ
దగిన తరువు లిడిన ♦ సుగతి గలుగు

నిహసుఖంబుఁ బొందు ♦ విహగాదిబహుభూత
వాససౌఖ్య మతఁడు♦చేసెఁగాన॥ అను. ఆ ౩. ప330

499 తే॥గీ॥ ఆకలేక యెవ్వాని జ♦లాశయమున
మందువేసవిరుందును ♦ మనుజకోటి
యవభృథస్నాన పానంబు ♦ లాచరించు
నతఁడు వొందఁడు విషమ[1]దు♦ర్గాదిగతులు॥ అను. ఆ౨. ప386

500 క. అనఘా యెవ్వఁడు గావిం
చిన సలిలాశయమునందుఁ♦జెలఁగుచు గోవు
ల్గాను నీ రాతనివంశం
బున కని కావించు నూర్ధ్వ ♦భువనప్రాప్తిన్॥ అను. ఆ౨.ప385

501 క॥ కావునఁ జెరువులు నూతులు
బావులు గొలఁకులను నెపుడుఁ ♦ బౌరవవర్యా!
కావింపవలయు నవి కడుఁ
బావనములు పుణ్య[2]లోక ♦ భాగ్యతనిచ్చున్॥ అను. ఆ౨. ప384



౧౭-భూదానము.

502 క॥ వసుదాయనిమైన వసుధ
నొసఁగి నతనిఁ దన్న తన్న ♦ యొసఁగె ననుచు సం
తసపడు భూతములన్నియు
నసమానము భూమిదాన ♦ మమరాధీశా! అను. ఆ ౨. ప363

503 ఆ॥ వె॥ పూర్వదత్తమైన ♦ భూమి నెవ్వఁడు పుచ్చి
కొనియె నతఁడు తనదు ♦ కులమువారి
నిరువదొక్కతరము ♦ నరకవాసులఁ జేయు
[3]దాను మున్నుగాగఁ ♦ ధర్మనిరత॥ అను. అ ౨. ప365

504 ఆ॥ వె॥ భూమి రత్నగర్భ ♦ పురుహూతయటుగానఁ
గలుగు భూమిదాన ♦ కర్తమైన

(1) దుర్గాభి (2) లోకభాగిత (3) దానుఁడును

వాసి కళ్వహ స్తి ♦ వనితాది సర్వర
త్నములు నిచ్చు నట్టి ♦ యమితఫలము॥ అను. ఆ౨. ప362

505 ఆ॥వె॥ భూమి నిఖిల మగువి♦భూతివిశేషజా
తంబు గలుగుఁ గానఁ ♦ దత్ప్రదాన
మెల్లవస్తువులును ♦ నిచ్చినయ ట్లగు
దానఁ బోని పాప ♦ తమము లేదు. అను. ఆ ౫. ప193

506 క॥ ఆజి ప్రాప్తమృతులు గురు
పూజకులును మఱియు నెట్టి ♦ పుణ్యాత్మకులుక్
రాజోత్తమ! భూదాన
భ్రాజిష్ణునిఁ బోలరండ్రు ♦ పరమ మునీంద్రుల్ ॥అను.ఆ౨.ప356

507 క॥ కనకము రజతము వస్త్రం
బును ధాన్యము వివిధరత్న♦ములు నిచ్చిన య
వ్వినుతఫలంబుల నెల్లను
గను నుత్తమభూమిదాన♦కర్త నరేంద్రా! అను.ఆ౨.ప351

508 క॥ దానము లన్నిటికిని భూ
దానం బెక్కుడు సమస్త ♦ ధాన్యములుఁ బ్రభూ
తానేక(1)వస్త్ర ఘనర
త్నానూనత్వ మునుభూమి♦ నవుటకతమునక్ ॥ అను. ఆ౨. ప.350

---

౧౮–గోదానము.

509 ఆ॥వె॥ పుణ్యదినమునందు ♦ భూసురానుజ్ఞతో
నుపవసించి గోవు ♦ లున్నమంద
కరిగి పరమనియతి ♦ నయ్యహోరాత్రి మ
గ్గోష్ఠమున వసించి ♦ నిష్ఠతోడ॥ అను.ఆ౩. ప7

510 ఆ॥వె॥ సంగవాభిధాన♦సత్కాలమునఁ దన
యిచ్చుగోవుఁ బేర♦నెలమిఁ బిలిచి

(1) వస్త్రధన.

యజుఁడు కరుణఁ జెప్పి ♦ నట్టి యవ్వాక్యర
త్నముఁ బఠించునది యు♦దాత్తచరిత! అను. ఆ3. ప9

511 ఆ॥ వె॥ తల్లి గోవు వృషము ♦ దండ్రి గర్భప్రదే
శంబు దివము ధరణి ♦ సంప్రతిష్ఠ
యని పఠించి యోగ్యుఁ ♦ డగువిప్రు నర్చించి
పలుకవలయు నీగి ♦ కలిమి దెలియ॥ అను. ఆ3. ప10

512 క॥ సారము లగుగోవులు మ
ద్ఘోర సకలకల్మషములఁ ♦ దున్మించును సౌమ్యా
త్వారూఢంబులు శాశ్వత
సారోదారపథ మిచ్చి ♦ సౌఖ్యముఁ జేర్చున్॥ అను.ఆ3.ప12

513 క॥ అనిపలికి గోవు లిచ్చితి
ననుచు నుదకధారఁ బ్రీతి ♦ న విప్రకరం
బునఁ బోయవలయు నర్ఘ్యం
బని చెప్పెను రజ్జలంబు ♦ లాదిమునీంద్రుల్॥ అను .ఆ3. ప13

514 క॥ [1]విను విప్రుఁడు వ్రతశీలుం
డనఘుఁడు దాంతుండు శాంతుఁ ♦ డకోధనుఁ డి
వ్వినుతప్రదానవిధికిని
జననాథవరేణ్యా! యెఱుఁగు ♦ సత్పాత్రంబుల్॥ అను.ఆ3.ప14

515 క॥ తేపకడ నీరు ద్రావక
మేఁపు గొనక మున్న గోవు ♦ మిక్కిలిభక్తిన్
భూపాల! యిచ్చునది ది
వ్యాపారసుఖంబుఁ బడయు ♦ నాత్మ దలఁచినన్! అను.ఆ3.ప18

516 క॥ మొదవులలో నెల్లఁ గపిల
మొదవు వరిష్ఠంబు రాజ♦ముఖ్యా! నియతిమై
నిది విప్రున కిచ్చు టరయఁ
దుదిదానంబులకు నఱకు ♦ దురితాటవులన్॥ అను. ఆ3. ప19

---

(1) విను ♦ ప్ర్యఁడు.

517 క॥ విను గోవులను ఋషిభాతం
బునఁ దలఁచుట తద్గుణములు ♦ వొగడుట భక్తిం
గనుఁగొనుట యధికపుణ్యము
లని యెఱిగించును జనములకు నాగమఫణుతుల్॥ అను.ఆ౨.ప31

518 క॥ గోవులు సూర్యుని యుజ్జ్వల
గోవులయ ట్లగుటఁ జేసి ♦ గోదానపరుల్
భూవినుతా! సూర్యసదృశు
లై వెలుగుదు రిట్లు చెప్ప ♦ నాగమఫణుతుల్॥ అను.ఆ.ప461

519 క॥ గోవులపా లమృతం బని
దేవేంద్రుఁడు చెప్పెఁగాన ♦ ధీరత్వనిధీ!
గోవునొసఁగ నమృతము స
ద్భావంబున నిచ్చినట్టి ♦ ఫల మొనగూడున్॥ అను. ఆ౨.ప399

520 తే॥గీ॥ అనఘ! గోవులు ప్రాణంబు ♦ లని సమస్త
మునులు సెప్పుదు రట్లుగా♦వునఁ దలంపఁ
బ్రాణదానవిధానసం♦ప్రాప్త మైన
ఫలము గోదానకర్తకుఁ ♦ గలుగుఁ జూవె॥ అను.ఆ౨ ప400

521 ఆ॥వె॥ గొడ్డు బడుగుఁ దెవులు ♦ గొంటెఁ గ్రొ పెడలిన
దాని నెచ్చులేని ♦ నూనమైన
యట్టిదాని నొకట ♦ నాయాసపడియున్న
దాని నీరు గోప్ర♦దానవిదులు॥ అను.ఆ౨.ప402

522 క॥ క్రూరునకు నాస్తికునకు దు
రారంభున కిచ్చినం బ♦రమదుఃఖమునం
గూరును గో వది దాతకు
వారకఁ జేయును భరితు♦ణము గడు వలయున్॥ అను.ఆ౨.ప401

## ౧౯-కన్యాదానము.

523 క॥ అతివా! కన్నియ నిచ్చినఁ
బితృపతి ముదమందు సురలుఁ ♦ బ్రీతు లగుదు రం
చితగతి కర్తకు దారకొను
నతి తేజశ్శ్రీయశస్క ♦ మగు నబ్బవముల్॥ అను.ఆ౫.ప194

524 క॥ కులమును శీలము విద్యయుఁ
గలవానిం బిలిచి ప్రీతిఁ ♦ గన్నియ నీఁగా
వలయు నుదక[1]ప్రధారా
కలితంబుగ బ్రాహ్మ్యకర్మ♦గతియిది యధిపా! అను.ఆ౨.ప221

525 తే. గీ. రూప గుణ శీలముల ననురూపుఁడైన
వరున కీక కన్నియఁ దన ♦ వలసినట్లు
తగనివానికి నిచ్చుట ♦ ధర్మదేవ
తా తనూభవ! బ్రహ్మ హ♦త్యాసమంబు॥ అను.ఆ౨.ప70



## ౨౦-విద్యాదానము.

526 ఆ॥వె॥ రాజముఖ్య! తగు స♦రస్వతి శిష్యున
కొసఁగ భూమిదాన ♦ మూర్జితముగఁ
జేసినట్టి ఫలము ♦ సిద్ధించు ధేనువు
నిచ్చుటయును భూమి ♦ నిచ్చినట్లు॥ అను. ఆ౨. ప412

527 గీ॥ విద్య యిచ్చుట సత్పాత్ర ♦ విషయమైన
నవ్య యానందపదముఁ జే ♦ యంగఁజాలుఁ
దగఁగ దక్షిణ యిచ్చి పే♦దలకు విద్య
యా నియోగించుటయుఁ దత్స♦మానకృతియ॥అను.ఆ౫.ప195



(1) ప్రదాన.

## ౨౧-ఇతరదానములు.

528 క॥ అలఘుతర సకల కామ్యం
బుల నిచ్చినయట్టి మహిత ♦ పుణ్యం బైతా
వెలుఁగుఁ గనక మిచ్చుట యని
పలికెన్ గర్గ్యుఁ డత్రి ♦ పరహితచరితా! అను. ఆ౨. ప381

529 తే॥గీ॥ కనక మాయుఃపవిత్రదంబు పా♦వనము భావ
శుద్ధి నొనరించు దాతకు ♦ సువ్రతమున
వేడ్కతో దాని నిచ్చుట♦వేర పొగడ
నేల యనియె హరిశ్చంద్రుఁ ♦ డిద్ధతేజ! అను. ఆ౨. ప382

530 ఆ॥వె॥ ఛత్ర మిచ్చి కాంచుఁ ♦ బుత్రులఁ బురుషుండు
సకల కామ్యదాన ♦ సమము శకట
మిచ్చుటనఘ! చెప్ప ♦ లిచ్చినఁ గంటకు
లైన రిపులఁ ద్రొక్కి ♦ యతఁడు దిరుగు॥ అను. ఆ౨. ప389

531 చ॥ తెవుళులు గొన్నవారి కవి ♦ దీరుట కౌషధ మిాగి దుర్గతుల్
దవులు జనాలి ప్రోవు సుప♦థంబుగఁ దైర్థికకోటిఁ దన్పు బాం
ధవరహితత్వ దీనశవ♦దాహము దుఃఖితులైన వారిఁ దే
ర్చ వెరవు నోర్చు గల్మియును♦బ్రస్తుతి కెక్కిన మేటిధర్మముల్॥
అను. ఆ౫. ప214

532 క॥ తిలలు పితృభోజ్యములుగా
జలజభవుఁడు చేసెఁ బితృని♦చయ మలరఁ గడుం
దిల లిచ్చిన శుచు లగుదురు
తొలఁగుం బర్వాసురతాది ♦ దోషము లెల్లన్॥ అను. ఆ౨. ప390

533 క॥ దానప్రవణయుపాన
ద్దానంబును నాతపత్ర♦దానము సుర(1)స
న్మానసభాజనము లగుట
నానాబుధజనులచే వి♦నంబడు నెపుడున్॥ అను. ఆ3. ప267

---

(1) పద్మానన.

534 క॥ యాగాదికర్మముల కుప
యోగింపంబడుటఁజేసి ♦ యుత్తమము ఘృతం
బాగురువస్తువు నిచ్చుట
యాగములకు నగ్నికిం బ్రియంబై యుండుఁ॥ అను.ఆ౨.ప357

535 తే॥గీ॥ అర్థి కోరినవస్తువు ♦ లర్థితోడ
నీగి యెల్లదానములకు ♦ నెక్కుడరయ
నఖిలభూతమ్ములకు నభయంబు నిచ్చు
టంతకంటెను మే లందు ♦ రార్యజనులు॥ అను. ఆ౨. ప335

536 తే॥గీ॥ కుడుపునకు ముంద¹రొక్కని ♦ గోవునకు స
మంచితగ్రాసముష్టి నిత్యంబు నేడు
గాల మిచ్చిన నతఁ డెల్ల ♦ కామ్యములను
బ్రాహ్మణుల కర్థి నొసఁగిన ♦ ఫలము వడయు॥అను.ఆ౨.ప415



౨౨-ధూపదీపములు.

537 తే॥గీ॥ తగినయట్టిధూపము దేవతలకు నిచ్చి
పరమపుష్టియు నాయువుఁ ♦ బడయు గర్త
యక్షగంధర్వపన్నగ ♦ రాక్షసులును
ధూపమున మెచ్చి కోర్కు లిత్తురు కుమార!అను. ఆ ౪. ప15

538 ఆ॥వె॥ దైవతార్చలపుసు ♦ తామసభూతర
క్షోముఖంబులైన ♦ కుత్సితంపు
జాతు లెల్ల దీప ♦ సన్నిధి నడఁగు న
ట్లగుట దీపదాన ♦ మధికఫలము॥ అను. ఆ౪. ప17

539 క॥ ఒరు లిచ్చిన దీపం బప
హరించి తత్పాతకమున ♦ నంధుం డగు భూ
²వర ! సభ గుడిపై లోపల
గిరిదీపం బిడి విభూతిఁ గిం బాత్రి మగుఁ॥ అను. ఆ ౪. ప21

(1) ముందఱొద్దుల (2) వరరథ్యా సభగుడిపై

540 తే॥గీ॥ ఆలనేయి ముఖ్యము మహిషాది మేష
జనిత ఘృతమును దైలంబు మనుజనాథ!
మధ్యమము లగు మేదోస్థి మాంసరసము
లరయ నింద్యము ల్దీపసమర్పణమున॥ అను. ఆ౮. ప22

541 క॥ జ్యోతిస్సాలోక్య కులో
ద్యోతన మహితప్రకాశ యోగంబులు పు
త్రా! తెచ్చు దీపదానము
దాత కొసఁగు నమరపూజితశుచిత్వంబుల్॥ అను. ఆ౮. ప23

---

## ౨౩-పుష్పములు.

542 సీ॥ ఓషధు లమృతమయ్యు త్తమవస్తుసం
తతిలోనఁ బుష్పవంతములు మేలు
పుష్పము ల్గాని సురపూజ లొనర్చిన
మానవులకు మంచి మనసు గలుగు
నట్లుగావున సుమనోభిధానము పుష్ప
ముల కయ్యెఁ దద్ద్రవ్య పూజ లిచ్చు
నరుల కోర్కులు సుమనస్కతఁ దీర్చుట
నమరులు సుమనస్కు లనఁగఁ జనిరి
గీ॥ కంపురూపు దెలుపు గలిగి యకంటక
భూరుహాదులందుఁ బుట్టినట్టి
పుష్పములఁ బ్రియంబుఁ బొంది కైకొందురు ని
ర్జరులు పూజనములఁ గురువరేణ్య! అను. ఆ౮. ప5

543 క॥ నలినంబులు జాజులునుం
దులసీదళములుఁ బ్రభూతతోషము గీర్వా
ణులకుం జేయును యక్షా
దులకు జలోద్భవములెల్లఁదుష్టియొనర్చున్॥ అను. ఆ౮. ప6

(1) సఖిత్వంబుల్.

544 క॥ దేవత లర్హ్యా కుసుమపూ
జావిధిఁ బ్రియ మంది యపుడ ♦ జనులకుఁ దగ సం
భావించి వారికోర్కులు
గావింతురు సఫలములుగఁ ♦ గౌరవనాథా! అను. ఆర. ప11

545 క॥ అరుణంబులును సకంటక
తరుభవములు గటుకగంధ ♦ దామములు నొన
ర్తుదు శాత్రవాభిచారిక
కరణమున నధర్వమాంత్రి♦కత గుసుమంబుల్॥ అను.ఆర.ప7

546 క॥ పారావతములు శుకములు
శారికలును బుష్పలతలు ♦ జనవర!పసిఁడిన్
దారమున నైన ముట్టులు
నారయ గృహమంగళంబు ♦ లాదర్శంబుల్॥అను. ఆర.ప118

547 క॥ విను దేవాలయమునఁ బిత్రు
వనములఁ బుట్టు కుసుమములు ♦ వలదు వివాహం
బునకును శాంతిక పౌష్టిక
వనితాజనరంజనాది ♦ వర్తనములకున్॥ అను. ఆర. ప3



౨౮-వనప్రతిష్ఠ.

548 తే।గీ॥ ఛాయ నతిథివర్గంబుఁ బు♦ష్పములు సురగ
ణంబుఁ బండులఁ బిత్రునివ♦హంబుఁ బ్రీమద
మందఁ జేయు వృక్షంబు ల ♦ ట్లగుట వృక్ష
రోపణక్రియ మేటిధ♦ర్మువృకుమార! అను. ఆ 3. ప 382



౨౯-ఉపవాసము.

549 క॥ నరవర! యర్థంబులునుం
బరివారము లేకయును శు♦భస్థితిఁ జేయన్
దొరకొనియుండుట గని యం
గిరసుం డుపవాసముం బ్ర♦కీర్తించెఁ దగన్॥ అను.ఆర.161

550 తే॥గీ॥ మాతకును వేదమునకు ధ♦ర్మంబునకును
బరము లగు గురుశాస్త్రలా♦భ ములు లేవు
తపములే దుపవాసవ్ర♦తంబుకంటె
నధికమైనది యందు మ♦హాత్మ యనఘ॥ అను. ఆ౬. ప153

551 క॥ కావున నుపవాసవ్రత
సేవనము శరీరమునకుఁ ♦ జిత్తంబునకుం
బావన మైహికమహిమయు
దేవనిలయసుఖము[1]నిచ్చు ♦ ధీరవిచారా! అను. ఆ౪. ప157



౨౬-తీర్థసేవ.

552 సీ॥ కడఁగి బుద్ధీంద్రియ ♦ కర్మేంద్రియంబులఁ
యందు సంతతచిత్తు ♦ లైనవారు
ధృతి నహంకార ప్ర♦తిగ్రహాపేక్షల
యందు నివృత్తాత్మ ♦ లైనవారు
నల్పభోజనులు న♦నారంభకులును నై
యత్యంత సంతోషు ♦ లైనవారు
సత్యవ్రతులు శుభా♦చారు లక్రోధను
లనఁగ ధర్మాన్వితు ♦ లైనవారు
గీ॥ నఖిలతీర్థశతము♦లాడినఫలములు
నఖిలయజ్ఞవిధుల, నైనఫలము
బడయుదురు విహీన♦భాగ్యదుఃఖితులకు
బరమతీర్థసేవ ♦ పడయ నగునె॥ ఆర. ఆ౨. ప157

553 క॥ క్రతుఫలములు వడయఁగ దు
ర్గతులకు దొరఁకొనదు తీర్థ♦గమనంబున ద
త్క్రతుఫలము లందుదురు దు
ర్గతులును నిది మునులమతము ♦ కౌరవవృషభా! ఆర.ఆ౨ ప242

(1) నిర్వ్యధిఁ సమకూరుఁ.

554 క॥ వెలి శుచిరై మఱి తీర్థం
బులుసొచ్చుట మేలు నియమ♦ములు దీర్చి తగ
న్వెలలిన యెడ దేవార్చన
ములు విప్రార్చలు నవశ్య♦మును గృత్యంబుల్॥ అను. ఆ॥ప.185

555 క॥ విను తీర్థసేవ కామం
బును గ్రోధము మదము లోభ♦ముం జేరని నె
మ్మనము గలిగి నడుపవలయు
ననఘా! ఫలసిద్ధి దాన♦ నగు బురుషునకున్॥ అను. ఆ॥. ప90

556 క॥ చేరువతీర్థము కంటెను
దూరపుతీర్థంబు మేలు ♦ తోయజవదనా!
శారీరాయాసము ద
త్కారణ మను వేదవాక్య♦గతి[2] యట్లుండెన్॥
అను. ఆ॥: ప166

557ఆ.వె॥ నాతి! తీర్థసేవ♦నంబును నియమవి
శేష మగుట దాని ♦ జెప్పవలయు
సకలనదులు తీర్థ♦సంజ్ఞలుగల నబ్ధి
కరుగు నట్టి విచ్చు ♦ నధికఫలము॥ అను. ఆ ॥. ప182

558 తే॥ గీ॥ వాని యందును మునివర! మాననీయ
దేశములు నబ్ధిసంయోగ♦దేశములును
దెలియు మన్యోన్యసంగమ♦దేశములును
బరమతీర్థంబులగు ♦ బద్మపత్రనయన! అను. ఆ ॥. ప133

559 క॥ వనధి మహాతీర్థం బం
దును సంయమివరులచేతఁ ♦ దొల్లి ప్రియమునం
గొనియాడఁబడినచోటులు
విను ముత్తమతీర్థములు వి♦వేకాభరణా! అను. ఆ ॥. ప184

560 క॥ విను గంగ గంగ యను కీ
ర్తనములతో నొండు నీటఁ ♦ దగ మునిఁగిన య

(1) స్వేలుడిన (2) యట్లుంటున్
17

జ్జనులు దురితములఁ దొరఁగుదు
రని యార్యులు సెప్ప విందు ♦ నంచితచరితా! అను.ఆ౨.ప112

561 ఆ॥ వె॥ అరయ దుర్గమములు ♦ నతివిషమంబులు
నైన తీర్థములు ధ♦రాధినాథ!
యధిక భక్తియుక్తి ♦ నాత్మఁ దలంచిన
జాలు నరులకల్మ♦షములు వాయు॥ అను. ఆ౨. ప93

562 క॥ దమమును దపము నహింసయు
శమమును దీర్థములు దాన ♦ శౌచాతిశయం
బమలగుణ! కలుగు రిత్తజ
లములం దోగిన శుచిత్వ♦లాభము గలదే॥ అను. ఆ౪. ప 242

563 క॥ దొరకొనని వానిఁ గోరక
దొరకొని నందును మమత్వ♦దుష్టహృదయతకా
బొరయక విగతస్పృహు లగు
పురుషులె శుచు; లేల తీర్థ♦ములు వారలకున్? అను.ఆ౪.ప244

564 ఆ॥ వె॥ ఆత్మధర్మనిరతు ♦ లైన పుణ్యాత్ములు
దుర్లభులు సమస్త ♦ దురితములును
శాంతిఁ బొందు వారి ♦ సంసర్గమునఁ దీర్థ
భూతమతులు వారు ♦ భూతలమున॥ ఆర. ఆ ౭. ప242

---

౨౭. శీలము.

565 సీ॥ దానంబు సత్యంబు ♦ దమము యజ్ఞము నార్జ
వము గామలోభాది ♦ వర్జనంబు
గురుజనశుశ్రూష ♦ క్రోధరాహిత్యంబు
దమము సంతోష మ♦ధ్యయన నిరతి
డాంబికత్వము లేమి ♦ దైన్యంబుబొగయమి
యనసూయ యనహంకృ♦తాభియుక్తి
తలపంగ నాద్యమై ♦ తనరు [1]ధర్మము నెప్డు
గొనియాట నాస్తిక ♦ గోష్ఠిఁ జనమి

---

(1) ధర్మము చెప్డు

గీ॥ శీలసంరక్ష తీర్థసం • సేవ శౌచ
మఖిలభూతంబులందు ద • యార్ద్రి ( దగుట
మితహితోక్తులు సంశ్రిత • మిత్రగుప్తి
యిన్నియును శిష్టచరితంబు • లిద్ధచరిత! ఆర. ఆ౹౹. ప44

566 క॥ క్రమమున శిష్టాచార
క్రమ మెఱుఁగఁగ ధర్మమునకుఁ • గడు వాటంబై
విమలంబగు చిత్తము స
త్యమును నహింసయును దనకుఁ • దావలము లగుణా. ఆరఆ౹౹45

567 సీ॥ ఇరుపొద్దు గుడుచుచు • నెడనెడ గుడువక
యుండునాతండు స • దోపవాసి
ఋతుకాలమున నాత్మ • సతియందు రతిసల్పు
భవ్యశీలుఁడు సదా • బ్రహ్మచారి
దేవపితృతిథిపూ • జావిధులం దిడి
మఱి నంజపురుషుఁ డమృతాంసభోజి
తనయట్లు పక్షి-వా • రును భుజింప భుజించు
నంచితాత్ముఁడు విఘ • సాశనుండు
గీ॥ భృత్యవర్గంబు గుడిచిన • పిదపఁ గుడుచు
నాతఁ డమృతాశి దివసంబు • నందు నిదుర
వోని పుణ్యుఁ డస్వప్నుఁ డి • వ్వాలవుల లగు మ
హాధికవ్రతములు దేహ • బాధముకలు॥ శాంతి. ఆర.ప368

568 చ॥ పగలును రేయిఁ గుడ్చి జల • పానము లోనుగఁ గుడ్చునప్డు తు
ష్టిగ నొనరించి మర్త్యుఁడొక • టెన్నడుమ న్మరి యెప్డు నంటకే
మిగతిని పాపముంబొరయు • ముంచలపొల్చుచు హేయమకార్యము
న్దగు మెయిఁ జేయుచున్న విను • తంగటిజున్న గునూర్ధ్వలోకముల్॥
అను. ఆర. ప 164

569 క॥ వినుశిష్టచరితఁ గైకొని
యనపాయత నడువ నడువ • నంతఃకరణం
బునఁ బొదలునట్టి సమ్మద
మనఘా! దుర్లభము సూవె • యన్యపథములన్॥ఆర.ఆ౹౹:ప46

570 తే॥ గీ॥ సత్కులంబునఁ బుట్టుట ♦ సకలవేద
ములుఁ బురాణంబులును శాస్త్రములును జదువు
టయును సద్గతి జేయఁ బ్రా♦ప్తములు గావు
శీలసామగ్రి లేని దు♦శ్చేష్టితునకు॥ అను ఆ౨ ప 42

571 క॥ పరహితము సిగ్గుపాటుం
బొరయక యుండంగ నెదిరి ♦ బోధించుటయున్
నరసముదయంబు వొగడెడు
చరితము శీలమున కంగ♦సంపద వత్సా! శాంతి.ఆ 3.ప14

572 క॥ ఒలసి మనోవాక్కాయం
బుల [1]దోషాభావ మఖిల ♦ భూతములయెడం
గలిమి విను శీల మది మే
లొలయించును దానసుల్లమూన్సుముపుత్రా॥ శాంతి. ఆ3ప.14

573 మ॥ అనయంబున్ శమవంతుఁడై వినుత శిష్టాచారమార్గంబులన్
జను పుణ్యాత్ముఁడు దుర్గతుల్గడచి ప్రజ్ఞాహర్మ్యసంరూఢుఁడై
కనుచుండున్ బటుమోహపంకజలమగ్నంబైనలోకంబు వీఁ
క నధోభాగమునందు డిందికడుదుః♦ఖం బొందఁగా నవ్వుచున్.
ఆర. ఆ ౫. ప 50



౨౫. శాంతి.

574 క॥ వైరాగ్యంబు ప్రశాంతికిఁ
గారణము ప్రశాంతి ముక్తి ♦ గను మోక్షానం
దారామ జరామృత్యువు
లేరూపునఁ జేరనేర ♦ విద్ధచరిత్రా!॥ అను. ఆ ౫. ప242

575 క॥ విను తెవు లుడుపఁగ భేషజ
మునకుం దలఁకొసిన చంద♦మున మది సత్యం

(1) దోషాభావ.

బును శౌచము శమమును దమ
మును నెలకొలుపంగవలయు♦మోహచ్యుతికిన్॥ శాంతి.ఆ౪2౩6

576 క॥ విధివశమున వచ్చిన కీ
డధములు గొనియాడి వెఱఁగులై విపులభవాం
బుధి మునుఁగుదుర్, ♦ మునుంగరు
సధర్ములగు నుత్తములు ప్రశాంతిఁ జులకనన్॥ అను. ఆ౧ ప9

577 క॥ ఏవిధమున దుర్దశకును
భూవర! ధైర్యంబు మందు ♦ భూరిధృతిమెయిం
జేవగలుగు దృఢనిశ్చయ
భావము నెవ్వగల [1]త్రోడఁ ♦ బక దేభంగిన్॥ శాంతి,ఆ౪.ప420

578 క॥ అవమానమునకుఁ దృప్తుం
డవు నమృతము త్రావినట్లు ♦ యంచితసన్మా
నవిధికి నుద్వేగముఁ బొం
దు విషంబును బోలె శమకతుండు మునినాధా!॥ శాంతిఆ౫25

579 క॥ ధనములు బంధులు భోగము
లనియెడు నస్థిరములెల్ల ♦ నాత్మ కెరవు చే
సిన శాంతి యలవడును మన
మున శాంతిశ్రీసమృద్ధి ♦ మోక్షమునిచ్చున్॥ శాంతి.ఆ౪.ప346



౨౯. క్షమ.



580 క॥ క్షమయును దమమును సత్యము
నమేయమహిమాస్పదంబు ♦ లని యిందును ధ
ర్మములం దెల్లను నభివ
ర్ణముల విహృద్గ్రంధిభేద♦నపౌరిథంబుల్॥ శాంతి. ఆ౫. ప544

581 క॥ క్షమయును సత్యంబును శౌ
చమును సుధర్మములు బ్రహ్మ♦చర్యం బత్యు

(1) దాటుచు వనదెబ్బంగన్

త్తమధర్మము వానికిఁ జి
త్తము నలవఱుపంగవలయు ♦ ధైర్యము పేర్మిన్ ॥ శాంతి. ఆర. ప299

582 క॥ క్షమగలవానికిఁ బృథ్వీ
సమునకు నిత్యంబు విజయ ♦[1]సంసిద్ధి యగున్
క్షమి యయినవాని భుజవి
క్రమము కడు న్వాలయు సర్వ ♦ కార్యక్షమమై॥ ఆర. ఆ౧ ప228

583 క॥ క్షమియించువారిఁ గని చా
లమి వెట్టుదు రైననుం ద ♦ లఁప ననూన
క్షమయ కడు మెఱయు తోడ వు
త్తమరూపము గోరువారు ♦ దాల్తురు దానిన్ ॥ ఉద్యో. ఆ౨.40



30 - ద మ ము



584 క॥ దమమునఁ గర్మేంద్రియముల
శమియింపఁగఁ జేత యది ని ♦ సర్గగుణంబై
రమియించునె పురుషుని చి
త్తము దానవతండు సర్వ ♦ ధర్మకరుఁడగున్ ॥ శాంతి. ఆ౫.ప550

585 తే॥గీ॥ సర్వవర్ణాశ్రమములకు ♦ శమము దమము
గలిగి యునికి విశిష్టప్ర ♦ కార మగుట
బ్రాహ్మణునకు విశేషించి ♦ రాజవర్య!
దమసమాహితవృత్తి పెద్దయును వలయు॥ శాంతి. ఆర.ప362

586 సీ॥ శౌచ మక్రోధంబు ♦ సంతోష మార్జవ
మనసూయ విగత[2]దై ♦న్యప్రవృత్తి
యప్రమాదంబు దు ♦ రభిమానరాహిత్య
మతివాదవర్జన ♦ మఖిలభూత

(1) ప. సిద్ధి. ప్రాశక్షముఁడై. (2) దైన్యత్వ

దయ గురుపూజ నిం♦దాస్తుతి ప్రవణతా
త్యాగం బపైశున♦త్వంబు సాధు
జనసంగమం బమృ♦షాభిభాషణము ని
స్స్పృహత యహింస సు♦శీలభావ
గీ॥ మింద్రియగ్రామజయ మివి ♦ యెల్ల దమము
నాకృతులు వీని గలవుణ్యు ♦ డభయుఁ డైహి
కముల వలనను నాముష్మి♦కములవలన
శాంతిఘంగళనిధి బోధ ♦ సౌఖ్యమూర్తి॥ శాంతి.ఆ౪.ప364

587 క॥ శీలంబు మైత్రి కరుణ దయ
లోలుపభావము తితిక్ష ♦ లోనగు మునిలో
కాలంబనవుగు సద్గుణ
జాలంబు దమంబు రూప♦సంపద యధిపా!॥ శాంతి.ఆ3.ప408

588 క॥ దమనుం గడచిన సద్ధ
ర్మము లేదని విందు నాశ్ర♦మము లన్నిటికిన్
దమవంతుఁడు గామము గ్రో
ధము లోభము మత్సరంబు ♦ దర్పము గెల్చున్॥ శాం.ఆ3.ప407

589 తే॥గీ॥ దమము నిశ్శ్రేయసముఁ బుణ్య♦తమము ధర్మ
సార మది వెలిగా ధర్మ♦సంచయంబు
సిద్ధిఁ బొందునె, దమముతో ♦ బుద్ధి పొందు
గనినఁ బొందని యున్నతుల్♦గలవె? యధిప!॥ శాంతి.ఆ3.406

590 క॥ తమతమ కలవడు విజ్ఞా
నము తెరువున నాదరించి ♦ నానాగతులన్
సుమతులు ధర్మము దెలిపిరి
దమముపరాయణము ధీర♦తమ! యిన్నిటికిన్॥ శాంతి.ఆ3.ప405

591 క॥ గుహాయందు నియతి మనియెడు
మహనీయబ్రహ్మపదము ♦ మహిత దమత్వో
పహితుం డగువానికి స
న్నిహితం బనిచెప్పుదురు మ♦నీషిజనంబుల్॥ శాంతి.ఆ3.ప409



---

(1) కాలంబనీయ.

## ౩౦. అహింస.



592 క॥ జననీజనకారాధన
మున గురుభక్తిని సువృత్త◆మున శాంతిని దాం
తిని సత్యమున నహింసను
విను కాంతురు మోక్షపదము◆ వేద్వేజజనుల్॥ శాం.ఆ౬.ప553

593 ఆ॥వె॥ దంతియడుగులోనఁ ◆ దక్కిన జంతుచ
యంబునడుగులెల్ల ◆ నడఁగియుండు
నట్ల ధర్మకోటు ◆ లన్నియు లోనగు
నిద్ధగుణ! యహింస ◆ కింత నిజము॥ అను. ఆ౪. ప283

594 ఆ॥వె॥ జంతుపదములెల్ల ◆ దంతిపదంబులో
నడఁగుకిర్యి నహింస ◆ యందు సకల
ధర్మములు నడంగుఁ ◆ గర్మసంత్యాగికి
నైన భూతదయ స◆మర్థ్యగుణము॥ శాంతి. ఆ5. ప145

595 క॥ విమలాత్మ! యహింసయు దా
నము సత్యముఁ గోర్ధవర్జ◆నంబును విను ము
త్తమధర్మరాశి యిది ధ
ర్మమునఁ బరమసీమ దీని◆మరవుము మదికిఁ॥ అను.ఆ5.ప421

596 ఆ॥వె॥ దానమును దపంబు◆ధర్మంబు యజ్ఞంబు
శౌచ మంత్రి తంత్రి ◆ సత్యములును
బుధు లహింస రూప◆ములుగాఁగ జెప్పుట
యెల్లకల్మి నమ్మ◆హింసకలిమి॥ అను.ఆ4.ప310

597 ఆ॥వె॥ శమను దమము లేమి ◆ జనులకు హింస నొ
నర్చుఁగాన ధరణి◆నాథ! విను మ
హింస శమ దమములు ◆ హృదయంబునకు నెప్పు
డలవడంగఁ జేత ◆ యందురి [1]మునులు॥ శాంతి. ఆ5. ప511

598 ఆ॥వె॥ సర్వభూతదయకు ◆ సత్యవాక్యమునకు
నుత్తమంబు ధర్మ ◆ వాం డెఱుంగ

(1) బుధులు.

నొరులనొప్పికోడ ♦ కుపతాప మొనరించు
నదియ కడు సధర్మ ♦ [1]మనిరి మునులు॥ ఆది. ఆ౩. ప218

599 క॥ విను పశుహింసాకృతయా
గవిరూథుని ధర్మపరుని♦గా వేదంబు
లొగ్గినియాడెడు సముచితహిం
సన మరయ నహింసగాన ♦ జగతీనాథా!॥ శాంతి ఆ1. ప111

600 తే॥గీ॥ విధివశంబున మృతిబొందు ♦ వివిధజంతు
నిచయమందు దనహంకార ♦ నిష్ఠుడైన
పురుషుఁ గల్మష మేమియుఁ ♦ బొందనేర
దెట్టు లంటేని విను మది ♦ యేర్పరింతు॥ అను. ఆ౫ ప57

601 సీ॥దివియలోఁబడు[2] పుర్వు ♦ దివియమొత్తినవారిఁ
బాపంబు వొందునే ♦ యోపి దున్న
నాగంటిమొనఁ జచ్చు ♦ నానావిధప్రాణు
లన్నరుఁబొందునే ♦ యఘము వారు
తమపనుల్సేయ వి♦ధాతృవశమున నా
యువుదెగినట్టి జం♦తువులు సచ్చు
నేము చంపితి మని ♦ యించు కేనియు నహం
కారంబు వారికిఁ ♦ గలుగ దట్లు
గీ॥ గానఁ జూవె వారిఁ ♦ గల్మష మొందదు
పుణ్యపాపములకు ♦ బుద్ధి మూల
మని శివుండు మఱియు♦ను నహింసవోలు న
య్యాత్మికధర్మ మైన ♦ విధము వినుము॥ అను. ఆ౫. ప58

602 క॥ శ్రుతివిహితహింస హింసా
గతిఁ దలఁపఁగ రాదు ముని ని♦కాయంబిది దు
ష్కృతతతిఁ బాపెడు ♦ పరమసు
కృతమని కొనియాడుఁ గాన♦గీర్వాణసుతా!॥ అను.ఆ౫.ప73

(1) పడనఁగబడియె. (2) పుర్వే.

603 సీ॥ సకలధర్మములలో ♦ సర్వభూతాఽహింస
మేటి యహింసాస♦మేతుఁ డైన
వానికి నుత్తరు ♦ జ్ఞానోదయం బగు
నది మోక్షమొనరించు ♦ ననఘులార
కోరికమెయి గర్మ♦కారి యయ్యెడువాఁడు
వొందు గతాగతం♦బుల ఫలాభి
లాషఁబు లేక ని♦ర్దోషత మేలాచ
రించిన ముక్తి సిద్ధించు వినుఁడు
గీ॥ విషయపురుషుండు సత్యంబు ♦ విషయ మెట్లు
భోక్తృ భోజ్యత్వసంబంధ♦మునఁ బొసంగి
యుండియును బద్మపత్రిప♦యోలవంబు
కరణి నతఁడు తత్సంగంబుఁ ♦ బొరయకుండు॥ అశ్వ.ఆ.౨.ప188
604 క॥ సమదర్శియై యఖిలభూ
తములను దనయట్లగాఁగఁ ♦ దలఁచుచు నెవ్వాం
డమలన్యాయపరుం డగు
నమరు లతనివందనీయుఁ♦డండ్రు నరేంద్రా॥ శాంతి.ఆ౫.ప482

## ౩౨. సత్యము.

605 క॥ క్షమయు నహింసయు సత్యము
సమతయు నింద్రియజయంబు ♦ శమముఁ బరిత్యా
గమును దపోలక్షణములు
క్రమమున నిన్నియును నూర్ధ్వ♦గతికారణముల్॥ అర.ఆ౬.108
606 క॥ సత్య క్షమా దమంబులు
నిత్యపదంబునకు నెక్కు ♦ నిచ్చెన లవి సం
గత్యనుగతములు సత్సాం
గత్యము గాఁపునను ముఖ్యకార్యముసుండీ॥ శాంతి.ఆ౫.ప556
607 క॥ సమతయు దమముఁ దితిక్షయు
నమత్సరము హ్రీయు ధృతియు ♦ ననసూయార్య

త్యములు నహింసా దాన
క్షమాత్యజనరాన్నృతములు సత్యము మూర్తుల్॥
శాంతి. ఆ3. ప413

608 క॥ సత్యమ తపమును యజ్ఞము
సత్యమ వేదంబు దాంతి ♦ శాంతులు నగుటన్
సత్యము దొఱగిన నిర్మల
నిత్యానుష్ఠానములును ♦ నిష్ఫలములగున్॥ శాంతి. ఆ౪ 151

609 క॥ [1]సత్యము ధర్మము దపమును
సత్యము ప్రజలను సృజించు ♦ సత్యమ లోక
[2]సిత్యాదానముఁ జేయును
సత్యంబన్నృతంబు చేత ♦ సంవిహిత మగున్॥ శాంతి. ఆ౪.100

610 క॥ సత్యంబు నహింసయు నను
నత్యుత్తమధర్మయుగళ ♦ మందు నహింసన్
సత్యము గాచుట ధర్మము
సత్యమున నహింపఁగాఁ [3]జను నందు బుధుల్॥ కర్ణ.ఆ3.ప73

611 సీ॥ సత్యంబు పలుకుట ♦ సర్వధర్మములకు
మిక్కిలి యన్నృతంబు ♦ మేటిపాత
కము తద్విశేషంబు గలదు చెప్పెద నొరు
నర్థంబు లెప్పుడు ♦ నపహరింప
జూచు పాతకులతో ♦ సూన్నృతం బొడుట
పాపముల్ బొందులు ♦ వలికి యట్టి
వారి హింసించుట ♦ వరధర్మ మొకఁ డిది
యేల భూతములకు ♦ హితము సేయు॥

గీ॥ బొందు లెల్లను ధర్మముల్ ♦ భూత బాధ
కములు నిక్కములగు పాత♦కములు వినుము
భూతముల దుష్టశిష్టత్వ ♦ ములు వివేక
సూక్ష్మతా వేద్యములు వానిఁ♦జూడవలయు॥ శాంతి.ఆ3.ప 45

(1) సత్యమ బ్రహ్మము (2) స్థిత్యాధానము (3) బ్రాణంబు

612 ఉ॥ భూతహితంబుగాఁ బలుకుఁ♦బొందును సత్యఫలంబు నిచ్చఁదు
ద్భూతభయాస్పదం బగు ప్రభూతపుసత్యము బొంకునట్ల ప్రా
ణాతురుఁడైన చోఁ బరిణ♦యంబులయందును బల్కు బొంకు స
త్యాతిశయంబయం డ్రుమహి♦తాత్మక! యిట్టివిధర్మసూక్ష్మముల్
ఆర. ఆ౫. ప62

613 ఆ॥ వె॥ విను మహింస ధర్మ♦వితతి కెల్లను మేటి
యదియు సత్యయుక్త ♦ మైన వెలయు
ననఘ! శిష్టచరిత♦లందు సత్యము కడు
నధిక మనిరి శ్రుతుల ♦ నరసి బుధులు॥ఆర. ఆ౫. ప48

614 చ॥ నుతజలపూరితంబులగు ♦ నూతులు నూఱిటికంటె[1] సూనృత
వ్రత! యొకబావిమేలు మఱి♦బావులు నూఱిటికంటె నొక్కస
త్క్రతు వది మేలు తత్క్రతుశ♦తంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటెనొక♦సూనృతవాక్యము మేలుచూడగన్.
ఆది ఆ ౪. ప92

615 తే॥ గీ॥ సర్వతీర్థాభిగమనంబు ♦ సర్వవేద
సమధిగమము సత్యంబుతో ♦ సరియుఁగావు
ఎఱుఁగ మెల్లధర్మంబుల ♦ కెందు పెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞ ♦ [2]లైన మునులు॥ ఆది. ఆ ౪. ప94

616 చ॥ కుదురు సమస్తధర్మముల♦కున్నను సత్యము యోగమోక్షస
త్ప్రదములు సత్యకార్యములు ♦ పాప మసత్యముకన్న నొండు లే
దు దలఁప నశ్వమేధములు♦దొమ్మిదినూఱులు వెండి నూఱునై
యొదవిన నీడుగావు భరతోత్తమ! సత్యముతోడ నారయన్॥
శాంతి. ఆ ౩. ప 419

617 తే॥ గీ॥ వాజిమేధము ల్వేయొక్క ♦ వలను పెట్టి
యలఘుసత్యంబు తక్కటి ♦ వలనియందు
నిల్పి తులఁ [3]దూన్పఁగా సత్య ♦ నిష్ఠలోని
యర్థమున కెత్తు వచ్చె న♦య్యధ్వరములు॥ అను॰ ఆ ౨. ప 43

(1) సున్నృతపౌ్రిశ (2) లైనవారు (3) దూపఁగా

618 క॥ వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్కసత్య♦మును నిరుగడలం
దుల నిడి తూఁచఁగ సత్యము
వలనను ములుసూపు గౌర♦వంబున పేర్మిన్॥ ఆది. ఆర. ప 93

619 క॥ దివికిం జనినను నెవ్వని
వివిధగుణము లఖిలజనులు ♦ వినుతింతురు వాఁ
డవనీశ్వర! సత్పురుషుం
డవునని కయికొందుబ్రుద్ధి♦[1]నార్యజనులిలన్॥ శాంతి.ఆ౧.ప193

620 క॥ తను లోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుండు ♦ వెండియుఁ గడుమే
లొనరించుఁ గీడొకించుక
యును దనదెసఁదోఁచనీక♦[2]ముడుగుచువచ్చున్॥ఉద్యో.ఆ౨.48

621 క॥ సత్యాకృతులగు గుణములు
నిత్యానుష్ఠిత సమగ్ర ♦ నిర్మల యోగ
స్థిత్యభిముఖునకు సులభము
లత్యంత సుఖప్రదంబు♦ లవి కార్యంబుల్॥ శాంతి. ఆ3 ప 418

622 క॥ అమృతము మృత్యువు నన స
త్యము మోహము గానవిను మ[4]♦హాత్మక! యేస
త్యమునన మృత్యువు గెల్చెద.
సమసుఖదుఃఖుండ నగుచు ♦ శాంతిపరుఁడనై॥ శాంతి.ఆర.ప26

623 చ॥అనఘుఁడు సాత్వికుండగుమ♦హాత్ముఁడుబోధనిరూఢిఁ[4]దత్వముల్
గనుఁగొని లోకవృత్తములు ♦ గా వని రోసి సమస్తసంగభం
గనిరతుఁడై తొలంగు మమ♦కారవికార మహంక్రియాచ్యుతిన్
బనుపడి సంయమప్రకట♦ భావన నుత్తమశాంతిఁ గైకొనున్॥
ఆర. ఆ ౫. ప 98



---

1 నార్యజనంబుల్ 2 యొదుపుచు 4 మహాత్మా ఓ పర్వముల్.

## 33 - స్వర్గము.

624 క॥ ఈలోకమునకు మీఁదై
చాలగ వెలుఁగొందుచుండు ♦ స్వర్లోకము నా
నాలంకారయుతము ది
వ్యాలోకము దేవయాన ♦ మది మునినాథా! అర.అ౽.ప129
625 క॥ ఇది కర్మభూమి భోగా
స్పద మాలోకంబు ధర్మ♦పరులకు సులభం
బది సత్య శౌచ సౌజ
న్య దయాదులు లేనివారి ♦ కప్రాప్య మగుఁ॥ శాంతి.అరప110
626 తే॥ గీ॥ ఇందు జేసిన పుణ్యంబు ♦ నందుఁ గుడుచుఁ
గాని మర్త్యున కందుండి ♦ కడ గి పుణ్య
మాచరింపంగ లేదు పు♦ణ్యావసాన
మగుడు నవనికి త్రోతురు ♦ మగుడ నతని॥ అర. అ౽. ప109
627 క॥ ఈలోకము దుఃఖబహుల
మాలోకము భూరిసుఖ ని♦రంతర మందే
జాలియును లేక యొండొరు
తో లెస్సగఁబొంది యుండు♦దురు జను లనఘా. శాంఅర.ప111
628 తే॥ గీ॥ హస్తిమశకాంతరము గల ♦ దరసి చూడ
వాసగృహ శయ నాసన ♦ వసన గంధ
మాల్య తూర్యత్రియారామ ♦ మానినీజ
నాది సుఖసాధనములకు ♦ నందు నిందు॥ శాంతి. అ ర. ప 112
629 చ॥ మనువులుధాతలు న్మునులు♦మానుగనుండుదురందులోభముం
గినుకయుఁదాపముం బగయుఁ ♦ గిల్బిషముఁఘనదుఃఖవైకృతం
బును జనియింప నీభువన ♦ ముద్దెగునప్పుడు నాశమొంద ద
వ్వినుతపదంబు దానియెడ ♦ వేడుక సేయుదు రింద్రముఖ్యులుఁ॥
అర. అ౽. ప 133
630 ఆ॥ వె॥ అనఘ! యింద్రలోక♦మునకంటె మీఁద ని
శ్శోక మగుచు బ్రహ్మ♦లోక మమరు

నది యనన్యదీప్త ♦ సదనమై తనదైన
వెలుగునను జగంబు ♦ వెలుఁగఁజేయు॥ ఆర. ఆ ౬. ప 12

631 చ॥ అమల తపోనివాసులు మ♦హాధ్వరశీలురు సత్యసంధు లు
త్తములుజితేంద్రియు ల్నములు ♦ దానపరుల్గిణశూరులందుహా
ర్షమున వసింతు రప్సరలు ♦ సాధ్యులు దేవమును ల్మరుద్వసు
ప్రముఖులు వేలువేల తగు♦పట్టుల నుండుదు రందునిమ్ములన్॥
ఆర. ఆ ౬. ప130

632 సీ॥ పుణ్యంబులును బాప♦ములు రెండు జోకలై
యుండుఁ బుణ్యంబుల ♦ నొదవు నాక
సుఖము పాపంబులఁ ♦ జొప్పడు నరక దుః
ఖము విను మున్ను నా♦కంబు సుఖము
ననుభవించినయట్టి ♦ యతఁడు పదంపడి
యధికనారకపీడ ♦ ననుభవించు
మున్ను నరకదుఃఖ♦మునబడ్డ వాఁ డనం
తరముగ నాకమునఁ దాఁ ♦ బొరయు సౌఖ్య
గీ॥ మల్పపుణ్యుండు తొలితొలి ♦ యమరతాసు
ఖంబు గైకొని మఱియు దుః♦ఖముల నొందు
భూరిపుణ్యుండు మును మును ♦ ఘోరనిరయ
యాతనల నొంది వెండి సౌ♦ఖ్యముల నొందు॥ స్వర్గా. ఆ౨. 39

---

3౮. సూర్యప్రభావము.

633 సీ॥ ఆశ్చర్యముల కెల్ల ♦ నాస్పద మాదిత్యుఁ
డాతనివలనన ♦ భూతజాల
మఖిలంబు జనియించు ♦ నది యచ్చెరువుగాదె
యద్దేవునంశువు ♦ లందుఁ బ్రీతి
నమరులు వాలఖి♦ల్యాది మునీంద్రులు
సిద్ధులు శాఖలఁ ♦ జెందియుండు
విహగకులంబుల ♦ విధమున వసియింతు
రంతకంటెను నెక్కు ♦ డద్భుతంబు

గీ॥ గలదె యమ్మహాత్ము ♦ వలనన వాయువు
వెడలి యతని నడిమి♦విపులరశ్మిఁ
బొంది వృష్టిగురియు ♦ నెందును నట్టిచో
ద్యములు గలవె భాను♦రాగ్రిగణ్య॥ శాంతి. ఆ౬. ప598

634 క॥ రవి సృజియించును వర్షము
రవియ మగుడఁ గిరణతతుల ♦ రసమంతయుఁ దాఁ
దివుచును విస్మయకారక
మవనీసురవర్య! దాని ♦ కధికము గలదే॥ శాంతి. ఆ౬. ప599

635 క॥ ఇను వేఁడిమి శోషించిన
జనములయం దాత్మనిష్ఠ ♦ శాశ్వతికత్వం
బున వెలుఁగుచుండు దానికి
ననఘా! మిగులంగఁ జిత్రి ♦ మైనది కలదే?॥ శాంతి. ఆ౬. ప600

636 తే॥గీ॥ సూర్యువలనన బీజంబు ♦ ధార్యమాణ
మగుఁ జరాచరధారిణి ♦ యైన ధరణి
చేత నంతకు మిగులఁ జ♦ర్చింప నక్క
జంబు లెందును గలవె ని♦ష్ఠానిరూఢ॥ శాంతి. ఆ౬. ప601

637 క॥ పరముండు నిరంజనుఁ డ
క్షరుఁ డజరుం డద్వయుండు ♦ శాశ్వతుఁ డగు న
ప్పురుషుఁడు రవియందు వెలుఁగు
నరు డంతటికంటెఁ గలదె ♦ యగ్రిమవర్ణా॥ శాంతి. ఆ౬. ప602

637 లయగాహి॥ వారిరుహమిత్రు నమ ♦ రోరగ మునిద్యుచర। చారణగణప్రణుతచారుగుణు లోకా। ధారు నఖిలశ్రితశ♦రీరు హరి శంకరస♦రోరుహభవప్రతిము♦దారుణతమిస్రా।ధారణమారీచపరి♦పూరితదిగంతరుని భూరికరుణానిరతు ♦ సూరుఁగ్రిజగద్రి। ద్వారుణసహస్రకరుఁగోరిభజియింపుముమ ♦ నోరథఫలంబులగు ♦ భూరమణ! నీకుఁ॥
ఆర. ఆ౧, ప40

(1) భూ-కా-ధారా.

## ౮-నివృత్తిప్రకరణము

### ౧-విరక్తి.

1 సీ॥ విను మోహబీజ సం♦జనితంబు గామద్రు
మంబు ప్రమాదజ♦లంబు దనకుఁ
బరిషేచనంబుగఁ ♦ బెరుగు నజ్ఞాన(1)స్థి
రాపాదకలితమై ♦ యం దసూయ
పత్రసంపద యతి ♦ చిత్రతరంబు మా
నస్కంధదృఢత నున్నతి వహించు
శోకశాఖంబు న♦నేకచింతోపశా
ఖంబుఁ బురాకృత ♦ కర్మసార
గీ॥ ఘనము తృష్ణాలతాపరి♦గతము నగుచుఁ
బూలుచుఁ దత్ఫలములకు లు♦బ్ధులు గడంగి
ప్రాఁకి పడుదురు విడుపు శ♦స్త్రముగ నది వి
ఖండితము చేసి బుధుఁడు దుః♦ఖములఁ దొరఁగు॥
శాంతి. ఆ౫. ప199

2 క॥ మాయారహితుఁ డహంకా
రాయత్తతఁ జూవె పుట్టు ♦ వను చెఱఁ బడి నా
నాయాసంబులఁ బడు నా
జ్ఞాయుతుఁడై యాత్ముఁ డింత♦చర్చింపు మదిన్॥ అను. ఆ౫. ప157

3 క॥ భూతంబులఁ బచరించుచు
భూతాత్ముఁడు వానిఁ దన వి♦భూతి నడంచున్
భూతాహరణంబు నిజ
ద్యోతనము దదీయవృత్తి♦దుర్దశ పుత్రా॥ శాంతి. ఆ౫. ప161

4 చ॥ తలఁపఁగ నాయు వింతియుక♦దా యని సౌఖ్యముదుఃఖముంబొరిం
గలుగవె కాలవృత్తి నని ♦ కర్మము లిట్లని వేదబోధనం

(1) స్థిరాధార

బులు బహుభంగు లిట్టి వని ♦ బుద్ధికి సత్వ రజ స్తమో గుణం
బులకుఁబ్రివర్తనంబు లివి♦పొమ్మని కాంచుట చాల మేలగుౕ॥
శాంతి. ఆ౫. ప601

5 క॥ శారీర మానస మహా
దారుణ దుఃఖములఁ జేసి ♦ తఱిఁగి శరీరుల్
కూ్రరత బాధలఁ బొందుదు
రా రెంటిని జెఱుతు రార్యు ♦ లమలినబుద్ధిౕ ఉర. ఆ౧. ప21

6 క॥ శారీర మానసము లగు
నీ రెండువిధములు దన్ను ♦ నేపకయుండం
గోరికొని నియమములఁ బ్రీతి
కారము లొనరింపఁగా సు♦ఖం బొందునరుౕ॥ శాంతి.ఆర.ప104

7 క॥ ఒలయు జరా వ్యాధి ప్రిభృ
తులు శారీరములు గాఢ ♦ తోదకశోకా
దులు మానసములు దుఃఖం
బులు రెండువిధముల నిట్లు♦పురుషులనలఁచుౕ॥శాంతి.ఆర.ప103

8 ఉ॥ మేలున సంతసిల్లు నెడ ♦ మేకొని య్యాపద పొందు నాపదం
దూలఁగఁబూని సౌఖ్యములు♦దోఁచుఁగృతంబులుదప్ప వెమ్మియుౕ
బోలఁగ నింతయుం గని ప్రి♦బుద్ధమనస్కులు ఖేదమోద ని
ష్కాలిత ధైర్యసాగరులు ♦ గాన సుఖింతురు సర్వకాలమున్॥
ఆర. ఆ౫. ప341

9 క॥ విను విధికృత్యము లూరక
కనుఁగొనుచును సి ద్ధ్యసిద్ధి ♦ కల్పిత సుఖదుః
ఖ నిరూఢిఁ బొందకుండఁగ
మనముండొలగించు వెరవు♦మహనీయమగుౕ॥శాంతి.ఆర.ప379

10 క॥ విను దుఃఖంబుల దిగఁద్రో
చిన పురుషుఁడు సౌఖ్యసక్త ♦ చిత్తుఁడు గా² కా
దిని వైరాగ్యముఁ జెందిన
ననుపమమగుపరమపదము♦నమ్మెయిఁజేర్చుౕ॥శాంతి.ఆర.ప105

1.నిర్గాళిత ధైర్యసాగరులు గాక 2 గాకిన.

11 క॥ కోరికలకుఁ జోరక యసం
గారూఢత కలిగి యెల్ల ♦ యందును సమతం
గూరిన చిత్తంబులు గల
సారాత్మకు లీపదంబుఁ ♦ జనుటకు శక్తుల్॥ అశ్వ. ఆ౨. ప215

12 క॥ మానుషము దుర్లభము సో
పానం బగు నదివిముక్తి ♦ పథము గనుటకున్
దానిగని తొంటిచందము
రానీక సముద్యమమునఁ ♦ బ్రోకఁగ వలదే॥ శాంతి.ఆ౬.ప237

13 క॥ నురువున నొనరించిన పం
జరంబులోనున్న పులుఁగు ♦ చాడ్పున దేహం
బురుషవర ! జీవ ముండుట
పరికింపక యేమరంగ ♦ బాడియె నీకున్॥ శాంతి. ఆ౬. ప224

14 క॥ కామాదితృప్తుఁడై నరుఁ
డేమఱి యుండంగ గోరియ ♦ నెత్తెడుపులి యు
ద్దామత మృత్యువు గొని చను
నామూఢుని యట్లుకాకు ♦ మతులవివేకా॥ శాంతి. ఆ౬. ప229

15 తే॥గీ॥ఎన్నికొనుచుండఁ జనుచుండు ♦ నేడు లివ్వి
ధమున నాయువు వోట్టోడఁ ♦ దరుగు జీవ
హాని వాటిల్లఁగాఁ బుత్రి ♦ యనవధాన
నిద్రిమోహితుఁడై యున్కి ♦ నీకుఁ దగునె॥ శాంతి. ఆ౬. ప225

16 క॥ ఇంతకుమునుఁ జూచితి నతఁ
డెంతయు సొప్పు గొనియుండె ♦ నిది గడుచిత్రిం
బెంత వెసఁ జచ్చె నని తను
చింతంబడు జనుఁడు మూఢ♦చిత్తత్వమునన్॥శాంతి. ఆ౮. 445

17 ఆ॥ వె॥ తనకు దాన కలఁడు ♦జననంబు నప్పుడు
మరణమునను సుగతి ♦ నరకములను
దల్లిదండ్రిదక్కు ♦ నెల్లబంధులు శరీ
రంబు ననుగమించి ♦ క్రిమ్మరుదురు. అను. ఆ౪. ష250

18 తే॥ గీ॥ తాను దెగునేని బాంధవ ♦ దారపుత్ర
మిత్రులను సజ్జనంబు లే♦మిటికి విగత
[1] చిత్తుడై గుహ సొచ్చి ని♦శ్చింతబుద్ధిఁ
దడవి కానంగవలవదే ♦ తన్నుఁ దాన. శాంతి. ఆ ౬. ప233

19 ఆ॥ వె॥ ఆశ్మశానగమను ♦ లంతియు చుట్టంబు
లగ్నిఁ గలిపి మరలు ♦ నఖిలమైన
జ్ఞాతిజనము దీనిఁ ♦ జర్చింప కందఱ
యందు మమతఁ బెనుచు ♦ నజ్ఞుఁ డనఘ! శాంతి. ఆ ౬. ప235

20 తే॥ గీ॥ యౌవనంబును రూపంబు ♦ జీవితంబు
ద్రవ్యసంచయములు ననిత్యములు గావె
వీనిహానికి వగప వి♦వేకమగుటఁ
బండితులు వగఁ గూరరు ♦ పౌరవేంద్ర! స్త్రీ. ఆ ౧. ప27

21 క॥ దారాపేక్షం గష్ట
ప్రారంభముఁ బూని యిహమునందుఁ బరమున
న్వారని సంక్లేశంబుల
గూరు నరుఁడు దానిఁ జేర♦గొనకొండ్రెబుధుల్. శాంతి. ఆ౬. ప242

22 క॥ మిత్రులు భార్యలు భ్రాతలు
బుత్రులు నిజకార్యపరులు ♦ బోధము సుమ్మా
త్మత్రాణమునకు మూలము
ధాత్రీపతివర్య! యెవ్వి♦ధంబునఁ జూడన్. శాంతి. ఆ౧౭. ప537

23 తే॥ గీ॥ [2] వఱదఁ గాష్ఠము ల్గూడిన ♦ వడువు బంధు
సంగమం బని వాసిన ♦ చాడ్పు తద్వి
యోగ మింత సూచినవాని కు♦మ్మలికము
వారయనేరదు దానవ♦వరతనూజ! శాంతి. ఆ ౪. ప56

24 క॥ కదియుం గాష్ఠము కాష్ఠము
నదిలో, మఱిగొంత సేపు♦నకు బాయును, నె
మ్మది నట్లుగఁ దలపఁగ వల
వదె పితృపుత్రాదిబంధు♦వర్గము నధిపా! శాంతి. ఆ౪. ప 10

(1) చింతుఁడై గుహసొచ్చి యశాంత (2) వఱుత.

25 క॥ క్షయవృద్ధులఁ జంద్రుఁడు న
బ్ధియు లోనుగఁ బొందుచుండఁ ♦ దెలియఁడు బంధు
క్షయమునకు వగచు నజ్ఞుం
డయమహితా! దీని నెఱుఁగు♦టమలత్వఁ దెచ్చున్. శాంతి. ఆ౧. ప608

26 క॥ విను దార పుత్ర మిత్రులు
చనిరి కొడుక! మున్ను చనిన♦జన్మంబుల నీ
కును వారు వారలకు నీ
వును మఱుపుట్టువునఁ గొరయు♦వుట గల్గెనొకో॥ శాంతి. ఆ౬. ప240

27 తే॥గీ॥ మాతృ పితృ దార పుత్రిక♦భ్రాతృ శతస
హస్రికంబులు సంసృతి ♦ ననుభవింపఁ
బడియె నందులో నెవ్వరి ♦ కడలువాఁడు
నరుఁ డనిత్యత యూహించు ♦ టరయ నుఱువు. శాంతి. ఆ౧. ప218

28 క॥ అనిమిత్తము భూతంబుల
జననం బవి రూపు సెడుట ♦ సంపన్నములై
యునికి విషాదము మోదం
బును జేయఁగ లే వనిత్య♦ములుగ నెఱిఁగినన్. శాంతి. ఆ౨, ప55

29॥ తే. గీ॥ వగతు మన్న నెవ్వారికి ♦ వగవఁ జనదు
చిత్తమున నేమిటికి సంత♦సింపరాదు
కాన గతమునందును ననా♦గతమునందు,
వగవ రార్యులు సంతోష ♦ వంతు లగుచు॥ ఆర. ఆ౫. ప 141

30 క॥ వగచినఁ బోయిన కార్యము
మగుడునె వగవంగ లోక♦మాన్యం డగునే
వగ పుణ్యగతికి మూలమె
వగ పెల్లవిధముల నుడుగ♦ వలయు నరేంద్రా! స్త్రీ. ఆ౧. ప20

31 క॥ వగవునఁ దేజోహీనుం
డగు నాత్మహితక్రియలకు ♦ నక్షముఁ డగు న
వ్వగవు దఱిఁగి యుద్యోగము
దగఁ జేయఁగఁ గలుగు సంచి♦తములగు శుభముల్॥ ఆర. ఆ౫. ప142

32 ఉ॥ కావున నెవ్వగ ల్విడుపు ♦ గైకొను మాత్మకు లార్వాకర్మసం
సేవనతత్పరత్వము వి♦శిష్టజనంబుల సంగతిఁ భవ
ద్భావము కల్మషంబు దెగ♦బాచి శుచిత్వముఁ బొందులోకసం[1]
భావితవృత్తి నయ్యెడు నృపాలక! నాపలు కూఁదు[2]పాడిగన్॥
శాంతి. ఆ౧. ప212

33 క॥[3]దివమును రాత్రియునుం బోరిఁ
బరివర్తనముఁ బొందుచుండు ♦ పగిదిని సుఖసం
భవదుఃఖజననములు జం
తువులకు వలదుబ్బ♦[4]దురపిల్లంగన్॥ అశ్వ. ఆ౨ప164

34 తే॥గీ॥ పొదలుఁ దరుగుటకై పొడ ♦ వొదవు బడుట
కై కడుం జేరుఁ బాయుట ♦ కై జనించు
బోలియుటకు నై సుఖంబును ♦ బొందు దుఃఖ
మందుటకు నైపదార్థము ♦ లఖిలములును॥ అశ్వ ఆ౨. ప165

35 క॥ పెరుగుట సగ్గఁగఁ [5]జవులం
బొరయుట యరుచంబుగాఁగ ♦ బుట్టుట సావం
బెరయుట పాయఁ బదార్థో
త్కరముల నైజ మది యెట్లు ♦ దప్పింప నగున్॥ స్త్రీ.ఆ౧ప.24

36 సీ॥ ఒకయింటనుండి వే ♦ ఱొకయింటి కరిగిన
విధమును వస్త్రంబు ♦ విడిచి యొండు
వస్త్రంబు గట్టిన ♦ వడువును నైయుండు
కొడలు దొఱంగి యొం ♦ డొక్కయొడలు
గైకొంట నృప! విను ♦ కడవకు సారెపై
నమరవృత్తిక యిడు ♦ నపుడువిరియు
టయు వెరవారఁ బట్టఁగరాక చెడుటయు
వానియెత్తెడు నెడ ♦ వ్రియ్యుటయును
గీ॥ నెత్తి యొకచోటడించిన ♦ నెడలుటయును
నెండి యవియుటయును నావ ♦ మిడినఁ జగిలి

1 సంభావితకీర్తి 2 పాటిగన్ 3 దివసము 4 దురపిల్లన్ 5 రుచులం.

పోవుటయు వాడుజనులచేఁ ♦ బొల్చియుటయును
గలుగు గతి మేని కెట్లును ♦ గలుఁగు జేటు॥ స్త్రీ. ఆ౧. ప34
37 క॥ తనయొడ లెర వసినను మను
జునకును బంధుతతి సతము ♦ శోకించిన వ
చ్చునె చచ్చినజంతువు నె
మ్మన మధికము నొచ్చుగాక ♦ మహితవిచారా॥ శాంతి. ఆ౧. ప320
38 తే॥గీ॥ అరయ వచ్చినఁ దనమేను ♦ నెరవ తనకు
నొండురూపులు దక్కఁక ♦ యునికి యరుదె
యను తలంపు ధృవంబుగా ♦ నలవరించి
బుధజనంబులు శోకంబు ♦ బొరయ రధిప॥ స్త్రీ. ఆ౧. ప33
39 క॥ భూతిము లనిత్యములు నీ
వీతెప వెప్పడును [1]విషమ ♦ హీన[2]ధృతి నెయిం
జేతోగతి నలవఱుపుము
భూతానిత్యత్వ మదియ ♦ పుచ్చును వగలన్॥ స్త్రీ. ఆ౧. ప67
40 క॥ ఆరయఁ గదళీగర్భా
సారము సంసార మిట్టి ♦ చంద మెఱిఁగినం
జేరవు జనన మరణము లు
గారించును దీనిభంగి ♦ గానకయున్నన్॥ శాంతి. ఆ౫. ప530
41 ఆ॥వె॥ అడవిఁ జొచ్చి యంత ♦ కంతకు నవ్వులకు
నతికుతూహలమున ♦ నరిగి యరిగి
చూచుచుండునట్లు ♦ చూచె సంసారకా
ననమునందుఁ దిరుగు ♦ జనులనడుపు॥ శాంతి. ఆ౪ ప285
42 క॥ నలసారము సంసార మ
ఖిలదుఃఖావహము భయని ♦ కేతన మతిచం
చలము పరాధీనం బిం
దుల జీవన మేల నమ్ము ♦ దురు[3]తత్త్వజ్ఞుల్. ఆది. ఆ౬. ప 245
43 క॥ మతిఁ దలపఁగ సంసారం
బతిచంచల మెండమావు ♦ లట్టుల సంప

1 విషమహీన 2 ధృతిన్ని. 3 తత్త్వవిదుల్.

త్రృతతు లతికృతికంబులు
గతకాలము మేలు వచ్చు ♦ కాలముకంటెన్. ఆది ఆ౫. ప163
44 క॥ ఇవియెల్ల నశాశ్వతములు
భవమరణాకలితములును ♦ బటుసంసారో
ద్భవ దుఃఖ యుక్తములు సుఖ
లవయుతములు వీనియందు ♦ లౌల్యం బేలా? అను. ఆ ?. ప308
45 తే॥ గీ॥ అస్థిరేంద్రియ సలిలము♦యంబు గామ
రోషదారుణగ్రాహ ప్ర ♦ దూషితంబు
నైన సంసారసాగర ♦ మతుల ధైర్య
పోతపాత్రిక నిస్తరిం♦పుము కుమార! శాంతి. ఆ ౬. ప 228
46 క॥ విను సంసృతి మృత్యువుప
ట్టనఘా! నిస్సంగవృత్తి ♦ యమరగృహము నె
ట్ట నట్లగుటం గనుఁగొని
తునుముము సంసారరజ్జు ♦ దురితవిదూరా. శాంతి.ఆ ౪ ప 25
47 క॥ ప్రియవస్తు వెడలుటయు న
ప్రియంబు వాటిల్లుటయు ♦ బరిజ్ఞాన విని
శ్చయహీనులైన యల్పా
శయులకు దుఃఖంబుఁ జేయు ♦ జగతీనాథా! స్త్రీ. ఆ ౧. ప 30
48 చ॥ గజ తురగాదిసంపదలు ♦ గాంతలతోడి విహారలీలలుం
బ్రజ కనురాగమొందఁ బరి♦పాలన సేయుక్రమంబు బోరుల
న్విజయముఁ బొంది పేర్చుటయు ♦ విస్ఫురితాభరణానులేప వ
స్త్రజనిత వైభవంబు గల ♦ రాజులుఁ బోయిరిగాక నిల్చిరే
ఉద్యో. ఆ ౨. ప 93
49 క॥ ప్రియములు నప్రియములును హృ
దయమునఁ జిక్కువడఁ జేయ ♦ దత్తదనేక
క్రియలకు, జొచ్చు నరుఁడు మేఁ
వ్రియ మగు [1]టెంకు గండు చెడు జ♦రావ్యాధులచే॥
శాంతి. ఆ ౮. ప 345

(1) టెంకుగండు విరిగి.

50 క॥ ప్రియములు వాయుటయును న
ప్రియములు వెసబొందుటయును ♦ బెల్లుగ నగుఁ ద
త్క్రియలందు మూఢమతికి వ్యా
దయతాపము వాయ దెపుడు♦దరికొనిమంచున్. ఆర. అ౧. ప140

51 క॥ వినుఁ డీసుఖమును దుఃఖము
ననిత్యములుగాన వాని ♦ యాగమకాలం
బున ముదమును శోకము మొగ
[1]కొనమియుబుధులకు వెశాంతి♦గోరుజనులకున్. శాంతి.అ౧ప189

52 ఆ॥ వె॥ బ్రదుకు [2] చెడుట పొగడఁ♦బడుట దూఱొందుట
యీఁగి వేఁడుకొనుట ♦ యిట్లు మఱియు
గలుగు సౌఖ్య దుఃఖ♦ములు వచ్చు నెడనెడ
వాని కింతయేల ♦ వగవ నధిప! ఉద్యో: అ ౨. ప 79

53 క॥ విను పర్యాయంబున సుఖ
మును దుఃఖముఁ జెందుజనులఁ ♦ బురుషుఁడు ధైర్యం
బున గర్వంబు విషాదం
బు నడంగింపఁదగు నండ్రు ♦ బుధులది వినవే. శాంతి. ౪ర.ప428

54 క॥ కడుకొని కడు దుఃఖము లగు
నెడ నుచితమె యాత్మనింద ♦ యెయ్యెడల మనం
బడలక యేకాకృతి నె
వ్వడు నుండుటచూవె పురుషు ♦ పుషార్థ మిలన్॥ఆర. అర. ప114

55 క॥ ఈలోకము నిస్సారం
బాలోకింపంగ నధిప! ♦ యట్టుల యని తా
లోలతఁ బొందని పురుషుం
డేలా నెవ్వగలఁ జేర ♦ నిచ్చు మనంబున్॥ స్త్రీ. అ ౧. ప 32

56 క॥ నేర్పరి పెక్కువిధంబుల
నార్పఁగ బొమ్మలు గడంగి ♦ యాడెడు చందం

(1) కొఃమి

బేర్పడఁ గాన్పుము కొలస
మర్పితకార్యకరు లైన ♦ మానవుల దెసన్॥ శాంతి.ఆ౧. ప28౬

57 క॥ నరవర! సరసాన్నంబులుఁ
బరిమళ సద్వస్తువులును ♦ బరమశయనవి
స్తరములుఁ గాలాధీనత
నరుఁబొందుం బాయు నాని ♦ నమ్మమియు యుఱుక్ ॥

శాంతి. ఆ ౧. ప 215.

58 క॥ కాల మడఁగించు జనుఁ గ
ల్లోలిని గిరి డెల్పించుకరణి ♦ లోభ క్రోధా
శీలత్వ కామ భయములఁ
దేలు జనుఁడు కాలవృత్తి♦ తెలుఁగు నెఱుఁగునే? ॥ శాంతి.ఆ౪. 444

59 క॥ కమలంబులు దొగలు వికా
సముఁ బొందుట లతలు దరులు ♦ సకుసుమఫలభా
వముఁ బొందుట పక్షులును మృ
గములును మదకలము లగుట ♦ కాలకలితముల్ ॥

శాంతి ఆ ౧. ప 186

60 తే॥ గీ॥ మేలు గీడును నరుఁ బొందుఁ ♦ గాలమున న
వశ్యమును దానిఁ గోరిన ♦ వచ్చుటయును
వినుము దొలిచినఁ బోవుట♦యును సురేంద్ర!
కలదె యేరికిఁ గావున ♦ వలదుచింత॥ శాంతి. ఆ౪. ప416

61 తే॥ గీ॥ రాత్రి తెగుదల దిన మేల ♦ రాకయుండు
దినము తెగుదల రాత్రి యే♦తేరకున్నె?
పరఁగ సుఖదుఃఖములు కాల♦పర్యయమున
నెందు మనుజులఁ బొందక ♦ యేలయుడుగు॥ ఆర. ఆ౫. ప340

62 క॥ బలమును బుద్ధియుఁ జేవయు
నలఘుమతీ! యుల్లసిల్లు ♦ నగు కాలమునం
బొలియుం గాలవిపర్యయ
కలనంబున బుధుల కుబ్బుఁ ♦ గలకయుఁ గలవే?॥మౌ. ఆ౧. ప221

63 క॥ కళలుం గాష్ఠలు లోనుగఁ
గలచి దురలఁ గూర్చుకొనుచుఁ ♦ గాలంబు జనం
బుల వడ్డి కిచ్చునాతని
వలె నలవడఁ బొదిచి తనకు♦వశ్యులఁ జేయున్॥ శాంతి.ఆ౪.ప443

64 క॥ లోకము కాలముచే ని
ట్లాకులపడు చునికి గాంచి ♦ యధికధృతిని ధ
ర్మైకాంతతా నిరూఢిం
గైకొని క్రోవంగ వలదె ♦ కాలవికృతులన్॥ శాంతి. ఆ౩. ప236

65 క॥ ఈలోకంబుల నెల్లం
గాలము పక్వములు సేయఁ♦గా నెవ్వాఁ డ
క్కాలము పక్వముఁ జేయుం
జాలు నతం డమృతు నజరు♦సత్యుఁ గనుటకున్॥ శాంతి.ఆ౫.ప112

66 క॥ కాలము నేమనవచ్చును
గాలము గాలంబ పోలుఁ ♦ గా కొంటికి నీ
లీలలు గలవే లెస్సగ
నాలోకించి తిది హితము♦నభిమతమునగున్॥ మహా.ఆ౧. ప6

67 ఉ॥ కాలవిపర్యయంబున సు♦ఖంబును దుఃఖము వచ్చుచుండు నె
క్కాలము నేరికిన్ ధ్రువము♦గాదు సుఖంబునుదుఃఖమున్ మహీ
పాల! బుధుండు దద్ద్వివిధ ♦ భంగు లెఱింగి ప్రమోదఖేదసం
శీలుఁడుగాఁడు రెంటను బ్ర♦సిద్ధపదంబుననప్రమత్తుఁడై॥ ఆర. ఆ౬.106

68 ఆ॥ వె॥ కాలకబళనైక ♦ శీలుఁడై మృత్యువు
గెలిచి శాశ్వతము న♦చలము శివము
నచ్యుతము ననామయము ♦ నమృతము నవ్య
యంబు నగుపదంబు ♦ నందు నిలుచు॥ శాంతి. ఆ౬. ప132

69 క॥ అర్థమ యనర్థమూలం
బర్థమ మాయావిమోహ ♦ నావహము నరుం
డర్థార్జన దుఃఖమున న
పార్థీకృతజన్ముఁ డగుట ♦ పరమార్థ మిలన్॥ ఆర. ఆ౧. ప28

70 తే॥ గీ॥ ధనము గలిమియు లేమియుఁ ♦ దారిసు నందు
నిలిపి యెత్తంగ ములుసూపె ♦ నిర్ధనత్వ
మెక్కుడై దాని దిక్కున ♦ నెట్టు లన్న
వినుము గుణదోషములభంగి ♦ విస్తరింతు॥ శాంతి. ఆర. ప33

71 క॥ ఎచ్చోటనైన సధనుఁడు
విచ్చలవిడి నుండు లేదు ♦ వెఱపించుకయుం
బొచ్చెంపు చంద మొల్లఁడు
మెచ్చరె సురలైన బలుకు♦మృదువై యుండుఁన్॥ శాంతి.ఆర.ప36

72 క॥ కోపంబును లోభంబును
నేపారి మనంబు గలఁప ♦ నెప్పుడుఁ జింతా
తాపంబు నొందు సధనుం
డాపదగా కవ్విధము సు♦ఖావహ మగునే॥ శాంతి ఆ ర. ప35

73 క॥ ధనముగలవాఁడు మృత్యు వ
దనమున నున్నట్లు భయము ♦ దనచిత్తమునం
దనుకఁగ నుల్లల నుడుకును
విను శిఖి చోరాదిముఖ్య♦విషయాపదకున్॥ శాంతి, అర. ప34

74 తే॥ గీ॥ జలములందు మత్స్యంబులు ♦ చదలఁ బక్షు
లామిషం బెట్లు భక్షించు ♦ నట్లు తివిరి
యెల్లవారును జేరి య♦నేకవిధుల
ననుదినంబును భక్షింతు ♦ రర్థవంతు॥ ఆర. ఆ౧. ప27

75 ఆ॥ వె॥ విను ధనార్జనంబు ♦ ధనరక్షణంబు ధ
నవ్యయంబు ధనవి ♦ నాశనముఁ బ్రి
గాఢ దుఃఖదములు ♦ గావున దుఃఖభా
జనము ధనము గాల్పు ♦ మనగవలయు॥ అను. ఆ ౫. ప231

76 తే॥గీ॥ కలిమియును లేమియును విను ♦ కాలవశగ
తములు బోధవిహీనుల ♦ దర్పదైన్య
కలిత సుఖదుఃఖములఁ బెట్టు ♦ గాక యర్థ
ముల యనిత్యత యెఱిఁగినఁ ♦ గలదె వికృతి॥ శాంతి. ఆ౫. ప398

77 తే॥ గీ॥ కలిమి[1] లేము లనఁగఁ ♦ గల వాకరెం డవి
యత్నగౌరవమున ♦ యత్నతయును
గలుగవచ్చు ననుట ♦ గా దదిసూ బేల
దనము వినుము తెలియ ♦ ననిమిషేంద్ర॥ శాంతి. ఆర. ప372

78 క॥ తేరక యుండఁగఁ జేరం
దేరంగాఁ బొలియు విధి య♦ధీనంబులు గా
కారయ విత్తంబులు పుడు
పారంభాయత్తములె మ♦హాబుద్ధినిధీ! శాంతి. ఆ ర. ప373

79 క॥ సారపుసిరి చేటు నరుఁడు
కోరకయే వచ్చునట్ల ♦ కోరకయుండన్
శ్రీరాక గలుగు దైవము
కారుణ్యము గలిగెనేని ♦ గాఢవివేకా!॥ శాంతి. ఆ 3. ప32

80 క॥ జననీ జనకులును సుహృ
జ్జనులును దెగు నపుడు కావఁ ♦ జనమిఁ దెలియదే
ధనములు వారలకంటెన్
మనుజేశ్వర! వగపు వాని ♦ మగుడించునొకో॥ శాంతి. ఆ 3. ప29

88 ప॥ లోకముచందము గనుఁగొని
యీకొనఁగ నగు ధనాదు ♦ లెల్లను గాల
వ్యాకులతఁ బొందఁగలయవి
గాకుండమి యెఱిఁగి విడువు ♦ శమఁ జదురెందున్॥ శాంతిఆర. ప37

82 తే॥ గీ॥ అర్థవంతుఁడై భోగంబు ♦ లనుభవించు
చున్నయప్పుడ యిది యిట్టు ♦ లుండనేర
దస్థిరము తానులోనుగా ♦ నని యెఱుంగు
నతఁడు వగఁబొందఁ డేదియె♦ట్టైన నధిప! శాంతి. ఆ 3. 27

83 క॥ శత్రుజనులఁ జెరుచుటయును
మిత్రుల బ్రీతికించుటయును ♦ మిన్నక యాప
త్ప్రాతత్రిత సంపద యనగ వి
ధాతృఁడు చెందించుఁజూవె♦తరితోఁ బురుషున్॥ శాంతి. ఆర. 374

(1) లేమియనఁగ

84 క॥ వెరవును లావును గలిగిన
పురుషులు లే రెట్లు లోకమున నెవ్వరికిన్
సిరి శాశ్వతంబె యని వగఁ
బొరయుఁడు ధీరుండు కలిమిఁ బోకకు నధిపా॥ శాంతి. ఆ3. ప3.

85 క॥ మానమునకు సుఖము గోరెడు
జనులకు నరకక్రియా విశారద భంగుల్
పొనుపడ విడిచి భరము లే
కునికియ యూహించిచూడ నురు వెబ్బంగిన్॥ శాంతి.ఆ౪. ప13

86 క॥ ధనవత్త్వము దుఃఖకరం
బని కని తత్కాంక్ష విడుచు నతనికి ధనతా
జనితాత్మాధీనత్వం
బనుపమ సౌఖ్యంబు సేయు నక్షీణ ముగన్॥ శాంతి. ఆ౪ ప38

87 క॥ సిరి విడుచును బురుషుని విను
పురుషుఁడు సిరిదొలఁగు నిదియ పూర్వమె ఫలమా
లగతుంక్షై వాజ్ఞియతిం
బొరసిఁ యునికియట్టిచోటఁ బురుషున కమరున్॥ శాంతి.ఆ3ప33

88 తే॥గీ॥ సకలభూతంబులకును శాసకుఁడు గలఁడు
గాదె యొక్కరుఁడా తని కల్పనమున
బ్రాప్తమైనది నీళ్ళులు వల్లమునకు
వచ్చుక్రియఁ దానవచ్చు గీర్వాణముఖ్య॥ శాంతి.ఆ౪. ప412

89 క॥ నరనాథ! సుఖము దుఃఖము
పరువడి మైఁబొరయుఁగాకఁ బన్నగ నునిం
బొరయునె యం దొక్కటి యవి
పొరసిన వల దూఁద మోదమును ఖేదంబున్॥ శాంతి.ఆ౪.ప13

90 క॥ శోకభయస్థానంబు ల
[1]నేకము గలిగిన వివేకహీనుఁడు మదిలో

(1) నేకంబుఁగల్గినను వివేకవిహీనుండు డా

నాకులతఁ బొందునట్లు వి
వేకముగలవాఁడు బుద్ధి ♦ [1]వికలుం డగునే॥ అర. ఆ ౧. ప20

91 క॥ కానియటు లుండి నెఱిఁ బను
నైన తెఱఁగు దోఁచి మాయ ♦ మగు నిబ్భంగి
న్మానసమున కుబ్బు వగయు
దే నోపుం బనులు బుధుఁడు ♦ దేలఁడు రెంటన్॥ శాంతి.ఆ.౩ప28

92 ఆ॥ వె॥ ఏను గర్తననుట ♦ యెరుగమిఁ దాగర్త
యేని నెల్లఫలము ♦ లెసఁలకుండ
నఖిలకర్మములును ♦ నాచరించుచునున్న
వాఁడె కానఁ గర్త ♦ గాఁడు దాను॥ శాంతి. ఆ ౪. ప377

93 తే॥ గీ॥ కార్యఫలములయెడ దాన ♦ కర్తననుట
కడు నెఱుంగమి సువ్వె తా ♦ గర్తయేని
తగిలి తనదైన కార్యజా ♦ తంబు నెల్ల
జెడక ఫలియించునట్లుగాఁ ♦ జేయరాదె॥ అర. ఆ ౫. ప66

94 క॥ ధైర్యబున వీర్యంబున
శౌర్యంబునఁ బ్రజ్ఞఁ బడయఁ ♦ జాలునె నరుఁ డే
కార్యమును బ్రాప్యమైనను
నార్యుం డది యెఱుఁగు గాన ♦ నడలఁడుశక్రా॥ శాంతిఆర.ప415

95 క॥ ఎలమియు వాడుటయును దన
వలచినయట్టివె యెఱుంగ ♦ వా విధిచరితం
బులు బలవంతము లగుటయు
వలదె వివేకంబు పెద్ద ♦ వారికి నిందా॥ శాంతి. ఆ౪. ప397

96 క॥ ఇది నాకయ్యెం గాఁగల
యదియే యను గాఢనిశ్చ ♦ యం బెవ్వని నె
మ్మదిఁ గలుగు నుబ్బు వగ సం
పద యాపద గలుగ దట్టి ♦ భవ్యున కింద్రా!॥ శాంతి. ఆర.ప414

97 క॥ భీరుఁడు శూరుఁడు జడుఁడు వి
శారదుఁ డబలాత్మకుండు ♦ సబలుం డన లే

(1) వికలుండనుటే.

దేరినయిన మృత్యువు దు
ర్వారంబై యపహరించు ♦ వైదికవర్యా॥ శాంతి. ఆ౪. ప24

98 క॥ మొదల విధి నియతియును న
ట్టిద యందురు పెద్దలది ఘ♦టింపకపో దే
మదిఁ జూచి చెప్పినను ద
ప్పదు మేరువు దిరిగనేనిఁ♦ బాంచాలసుతా॥ఉద్యో. ఆ3. ప123

99 క॥ గతమునకును వగవక యా
గతమునకును నోరుదెరచి ♦ కడుఁ గోరక దీ
నతఁబొందక దైవం బే
గతిఁ బంచిన దానఁబోదు♦గా కనవలయున్॥ శాంతి.ఆ3.ప30

100 క॥ హర్షంబును మానంబు న
మర్షము నపరాధమును స♦మదభావము ను
త్కర్షాపకర్ష చింతల
నార్షసమాచారమును ని♦ర స్తగుణంబుల్॥ శాంతి. ఆ ౫. ప24

101 ఆ॥వె॥ అనియతంబులైన ♦ యాహారవిహరణ
శయనముల విధాత్ర ♦ సంప్రియుక్త
భంగిఁ బరఁగు నంత♦రంగనిర్బాధవ
ర్తనము కలిమి యజగ♦రవ్రతంబు॥ శాంతి. ఆ౪. ప63

102 ఆ॥వె॥ చలనమేదిపుట్టుఁ ♦ జావునుం బిరువెట్టి
యామిషార్థిజనుల ♦ నపహసించు
నెలమితోడ లేమి ♦ కలిమివాటింప నీ
రమణ నునికి యజగ♦రవ్రతంబు॥ శాంతి ఆ౪. ప62

103 క॥ సరసాన్నము బిణ్యాకము
సరిగా భుజియింతు మృదుల ♦ శయ్యాతలమున్
ధరణియు శయనరుచికి నా
కరయంగా నొక్కరూప ♦ యసురప్రవరా॥ శాంతి. ఆ౪. ప59

104 ఆ॥వె॥ నారచీరయేనిఁ ♦ జారుచీనాంబరం
బైనఁగట్టుకొనిన ♦ యపుడు హృదయ

మెప్ప దొప్ప ననక ♦ యుండురూపాదుల
నలమికొనవు చక్షు ♦ రాదికములు॥ శాంతి.ఆ౪.ప260

105 క॥ మే లర్థింపను గీడున
జాలింబడి తొలఁగఁదొవ ♦ నరి దూష్ణీభా
వాలంబిమనస్కుఁడనై
యాలంబుగఁ జేసి నడతు♦నయ్యిరుదెఱఁగుల॥ శాంతి.ఆ౪.ప58

106 క॥ శాకకణమూల ఫల పి
ణ్యాకాదుల భైక్ష్యమైన ♦ యన్నంబున ని
శ్శోకత నాఁకలి వుచ్చుచు
లోకాలోకంబున నచ♦లుఁడు గావలయుఁ॥ శాంతి.ఆ౪.ప316

107 క॥ దాంతుఁడు ప్రజ్ఞావంతుఁడు
శాంతుఁడు నగువాని మాన♦సం బా యాస
శ్రాంతముగా దమ్మెయి ని
శ్చింతుఁడనై యుండుదును వి♦శిష్టవిచారా॥ శాంతి. ఆ౪. ప331

108 ఆ॥ వె॥ భావములు నిజస్వ♦భావంబునన తోఁచు
నడఁగు నట్లుగాన ♦ నస్థిరతకు
నెలవు లనియెఱుఁగ ♦ నేర్చినభావంబు
లందుఁ దగులు నెట్లు ♦ జెంద మనకు॥ శాంతి. ఆ౪. ప375

109 చ॥ బలమును నొప్పుబుద్ధియును ♦ బ్రాభవయుం గలవారు లేనివా
రలనక యొక్కభంగిఁదరి ♦ రాకయ చూచి హరించుచుండు వి
చ్చలవిడిఁ గాలుఁ డట్లగుట ♦ సారమతిం గనియున్నవాఁడ ను
మ్మలికము నుబ్బు నాదుమది ♦ మందునకైనను లేదు వాసవా!
శాంతి. ఆ ౪. ప395

110 క॥ కావున భూతానిత్యత
భావించుట యెపుడుఁగలిగి ♦ బంధచ్ఛేద
ప్రావీణ్యము సంపదితో
పావహాముసు గన్నవాఁడ ♦ నమరప్రవరా॥ శాంతి. ఆ౪.ప380

111 క॥ వినుఁ డవ్యక్తాంతం బగు
పనియెల్ల నవిద్య నొలయు ♦ బంధము మమతం
బనఁ బడినమృత్యు వమృతం
బన జనునది నిర్మమత్వ ♦ మారఁగలిగినన్॥ అశ్వ.ఆ౨.ప210

112 క॥ ప్రజ యేనకాన నన్నుం
బ్రజ సుగతికి బుచ్చునని భ♦రంపడి కోరం
బ్రజ విడిచెద నాయం దది
యు జేయుమును నవ్యయంబు♦నగుపదమిచ్చున్. శాంతి.ఆ౫.ప387

113 క॥ విను పశుయజ్ఞము హింసన
మనంత ఫలదంబుగా ద♦యాంకృతి సహితం
బనఘా! వాఙ్మనసమయం
బను యాగం బిచ్చునవ్య ♦ యానందబున్. శాంతి.ఆ౪. ప28

114 క॥ మనసును వాక్కును రక్షిం
బనుపడు నెవ్వనికి శుద్ధి త♦పస్త్యాగము లా
తనిచేతిలోని వగు నని
మునిజనములచేత వించు♦ము నిరంతరమున్॥ శాంతి.ఆ౫.ప552

115 క॥ పాణి[1]యుపస్థయు నుదరము
వాణి యనఁగ మూఁడు రాని ♦ వాకిళ్ళవి గీ
ర్వాణుఁడు వీని బుధుఁడు పు
రాణపురుషరక్షకై తి♦రంబుగ మూయున్॥ శాంతి. ఆ౫ ప18

116 క॥ గతహర్షభయ క్రోధుఁడు
ధృతిమంతుఁడు నప్రమత్త ♦ ధీమహితుఁడు సం
శ్రితధర్ముఁడు దాంతుఁడు నగు
నతఁ డవసాదంబు నొందఁ ♦ డతులవివేకా!॥ శాంతి.ఆ౫.ప87

117 క॥ చుట్టము పగయును భేదం
బెట్టిజనులవలనఁ దగుల ♦ దెల్లప్పుడు నే

(1) యుపస్థం-బుదరము

పట్టున నెట్టానదు మదిఁ
బుట్టదు సంతోషహాని ♦ బుద్ధాత్మునకున్॥ శాంతి. ఆ ౫. ప 26

118 ఆ॥ వె॥ ప్రియము నప్రియంబుఁ ♦ బెల్లగు సౌఖ్యదుః
ఖములు భూతభావి ♦ కార్యములును
నెవ్వనికి సమంబు ♦ లిపి సర్వధని యనఁ
బరఁగుఁజువ్వె యక్కి ♦ భవ్యుఁడనఘ॥ ఆర. ఆ ౭. ప454

119 క॥ సంగము బంధ మ్మఖిల ని
స్సంగత మోక్షంబు బహువి ♦ చారము లేలా?
పింగజటాజూటకలిత
గంగాబాలేందుసహిత ♦ గౌరీసహితా! అను. ఆ ౮. ప 238

---

౨ - జ్ఞానము

120 సీ॥ పంచభూతంబులఁ ♦ బరఁగింప గుదియింపఁ
జాలు దక్షతవాని ♦ నేలుప్రభుతఁ
దనరు మనంబు ర ♦ థ్యముల సారథియెట్టు
లట్టింద్రియంబుల ♦ నాఁగ నడప
నదియు వలంతిభూ ♦ తాత్మకంబును బుద్ధి
సన్నాహమును మన ♦ స్సారథికము
నింద్రియాశ్వము లైన ♦ యీాఢ్య రథంబున
నభిమతగతి నంత ♦ రాత్ముఁ డెందు
గీ॥ నెలమి వర్తించు నిట్లగు ♦ టెఱుఁగు బుధుఁడు
ఘోరసంసారమోహావా ♦ గురకు లోను
గాక నిర్గుణపదమునఁ ♦ గ్రాలి కను ని
రామయము నవ్యయంబును ♦ నగుపదంబు॥ అశ్వ. ఆ ౨.ప198

121 వ॥ అవ్యక్తప్రభవంబును బుద్ధిస్కంధంబును నహంకారవిటపంబును మహా భూతోపశాఖంబును నింద్రియకోటరంబును [1] సంతతశాశ్వతంబును శుభాశుభ ఫలంబు నైన సంసారవృక్షంబొప్పుచుండు॥ అశ్వ. ఆ ౨. ప178

---

(1) సంతతిపర్ణ పుష్పంబులు, సంతతశాఖా పల్లవంబును.

122 క॥ జ్ఞానాసి నది నజికి యభి
మానాహంకారదూర ♦ మతియగు పురుషుం
డానందము ప్రిస్ఫుటముగఁ
గానంగా నేర్చు విగత♦కల్మషలారా!॥ ఆశ్వ. ఆ ౨. ప177
123 క॥ విను గుణములు మాయకు నోడ
లని యెఱిఁగి తమోరజస్సు ♦ లడఁచి సుసత్వం
బున నిలిచి సద్వివేకం
బున నదియుండో్రిచి విమల♦బోధాత్ముఁడగుక్॥ శాం ఆ౪.ప124
124 క॥ వేదాంతవిద్ముడు దుర్లభుఁ
డాదరము ప్రివృత్తి లక్ష♦ణాన్వితమగు ధ
ర్మోదయమందె కలుగు నది
లే దరయ నివృత్తి సౌఖ్య♦లీనత్వమునక్॥ శాంతి ఆ ౪. ప282
125 క॥ తోలు దిగవిడిచి నాగము
లీలఁ బొలుచు మాడ్కిఁ గర్మ ♦ లేపముఁ దనలోఁ
గీలుకొన నీక వెలుఁగు ని
రాలంబనబోధ ఘనుఁడు ♦ రాజనరేణ్యా!॥ శాంతి. ఆ ౪.ప358
126 క॥ పాపక్షయమున బోధం
బాపాదింపంగ మెఱుఁగు ♦ టద్దము కరణిం
జూపునకువచ్చుఁదనుఁ దా
నాపురుషుఁడు గాంచుపనికి♦నై తన్మయతక్॥ శాంతి.ఆ౪.ప187
127 క॥ స్థావరముల జంగమముల
నావిభుఁడు వసించు నతని♦యందు నవి నిస
ర్గావాసతనుండును ద
ద్భావన మెఱుఁగుట దద్వైక్య♦పదముం జేర్చుక్॥ శాంతి.ఆ౫.ప110
128 చ॥ వినయమువిద్యయుం గలుగు♦విప్రినియందును గోవునందు నొ
ప్పు నెరయు హస్తియందు నొక♦పోకకుఁబోవనికుక్కయందు దా
ని నడిచి తెచ్చి వండి తిను ♦ నీచపుమాలనియందుఁ దుల్యద
ర్శనులు తదంతరాత్ముని ని♦రంజనునిం గనునట్టి పండితుల్॥
శాంతి. ఆ ౫. ప109

129 క॥ విమల[1]జ్ఞానముఁ దపమును
దమమును ద్యాగంబు శాశ్వ♦తప్రిచు రానం
దమునకు మూలము లండ్రు ని
జముగాఁ గైకొం డ్రవియ ప్రసన్నవివేకుల్॥ శాంతి. ఆ౧. ప142

130 క॥ జ్ఞానము కేవల కృప న
జ్ఞానికి నుపదేశవిధిఁ బ్ర♦కాశము♦ జేయం
గా నది సకలధరిత్రీ
దానంబునకంటె నధిక♦తర ఫలద మగున్॥ శాంతి. ఆ౪. ప255

131 క॥ గురు డెవ్వఁడైన నగు ని
వ్వార వుపదేశించువాఁడ ♦ వేల్పుగ శ్రద్ధా
పరమతిగావలయు జనన
మరణంబులు శ్రద్ధలేని♦[2]మనుజుం జెందున్॥ శాంతి. ఆ౬. ప165

132 క॥ అలయక యేండ్లు గడుం బె
క్కులు జీవించుట నెర గలు♦గుటయుం దగు వృ
ద్ధుల లక్షణమే జ్ఞానము
గలఁడేని బాలుఁడైనఁ♦గడువృద్ధుమహిన్॥ ఆర. ఆ 3. ప248

133 క॥ జ్ఞానంబు వడయుటకు వా
జ్మానసములు సునియతములు ♦ గావింతురు స
న్మానితశాంతికోటికి వి
జ్ఞానంబున నాత్మనియతి♦సల్పుదురు బుధుల్॥ శాంతి. ఆ౫. ప90

134 క॥ మనసును వాక్కును గాయం
బు నియంత్రితములుగఁ జేసి ♦ పొందుదురు ధనం
బునకై ముచ్చులు దానిం
గనుఁగొనఁగావలదె మోక్ష♦కాంక్షికివత్సా॥ శాంతి. ఆ౪. ప313

135 క॥ విను మజ్ఞానంబునఁ గ
ర్మ నిరూఢత గలుగు దాన ♦ మలగవు జననం

(1) జ్ఞానము శమమును (2) మనుజుని పొందవు.

బును మరణము సమ్యజ్ఞా
న నిత్యుఁడగువాఁడు మోక్షముఁ జుల్కఁ గనుఁ॥
శాంతి. ఆ౬. ప166

136 క॥ జ్ఞానాజ్ఞానంబులకుం
దాన యుపాశ్రియము బుద్ధి ♦ తత్త్వాహంకా
రానూన లక్షణాద్యం
బైన యొఱుక దాని జీవుఁ♦డని చెప్పు శ్రుతుల్॥ శాంతి.ఆ౪.ప294

137 క॥ జ్ఞానంబు నాశ్రియించిన
వానికి సేపనులఁ గీడు ♦ వాటిల్లదు ప్రి
జ్ఞానరహితుండు గామా
ధీనతమెయిఁ గర్మసమితి♦[1]త్రిప్పులఁజిక్కుఁ॥ శాంతి.ఆ౫.ప326

138 ఆ॥వె॥ జ్ఞానము నన కాని ♦ జన్మజరామృత్యు
వుల జయించునట్టి ♦ యలఘు మోక్ష
పదము గల్గనేర ♦ దది గారణముగ సు
జ్ఞాన మెల్లభంగి ♦ సాధ్యతమము॥ శాం.ఆ౬. ప164

139 ఆ॥వె॥జ్ఞానపూర్వమైన ♦ సన్న్యాసకలనంబు
పరమగతి నొనర్చు ♦ భవ్యులార!
ద్వంద్వరహితుఁ డగున♦తని జరా మృత్యు ని
స్తరణకరణమైన ♦ ధర్మమొందు॥ అశ్వ. ఆ౨. ప158

140 క॥ మానవులకుఁ దలఁపఁగ న
జ్ఞానము నట్టిపగ లేద ♦ సంగతకృత్యా
ధీనుండై రూపు చెడును
దానం గావున నుదాత్త♦ధర్మవిధిజ్ఞా!॥ శాంతి.ఆ౫. ప521

141 క॥ వినుము మృణాలంబున నం
టిన రొంపి జలంబులం గ♦డిగినను బెడవా
సిన క్రియ విమలజ్ఞానం
బున సంసారంబుపాయుఁ♦బురుషు నరేంద్రా॥ శాంతి. ఆ౫ ప533

---

(1) త్రిప్పున

142 క॥ జ్ఞానంబు దృష్టి నరునకుఁ
గాన నయనవిహీను నడుపు ♦ కరణి యగును బ్రి
జ్ఞానవిహీనుని నడవడి
దీని నెరుఁగవలయు నెఱిక ♦ దెచ్చుకొనంగన్॥ శాంతి ఆ౨ ప298

143 ఆ॥వె॥ నిత్యతృప్తిశౌచ ♦ నిరతి తాల్మి సమత్వ
మారఁ గలిగి చిత్తు ♦ జ్ఞానుభవము
పరిచరమగుట యజగ ♦ రవ్రత మది విను
యుజ్ఞదుర్లభంబు ♦ ప్రాజ్ఞభూమి॥ శాంతి. ఆ౨. ప64

144 క॥ ప్రజ్ఞయ ప్రతిష్టలాభము
ప్రజ్ఞయ నాకం బనంగఁ ♦ బ్రజ్ఞయ చువ్వే
ప్రజ్ఞయ [1]కైవల్యమ్మను
బ్రజ్ఞాసాధ్యములు కాని ♦ పనులుం గలవే॥ శాంతి. ఆ౨. 64

145 క॥ ప్రాజ్ఞుఁడు రమించు నొక్కఁడ
ప్రాజ్ఞుఁడు పెక్కండ్రఁ బ్రీతిఁ ♦ బరఁగఁగ జేయుం
బ్రాజ్ఞుఁడు బలవంతుం డగుఁ
బ్రాజ్ఞుఁడు కలహంబు[2]దొట్టి ♦ వడకతోలంగున్ ॥శాంతి.ఆ౫.ప564

146 తే॥గీ॥ వినుము ప్రజ్ఞాధిరూఢుడై ♦ వనటదక్కి
సంసృతిక్లేశపరుల భూ ♦ స్థలి జరించు
వారి నచలంబుపై నున్న ♦ వాఁడు చూచు
నట్లు చూచుటను వ్వో నే ♦ ర్పమలహృదయ!॥ శాంతి ఆ౧.ప129

147 క॥ సుత! నీవు సుప్రసన్నా
త్మతఁ బొంది నగాగ్రగతుఁడు ♦ మహి వారలఁ జూ
చు తెఱంగున నీ భూత
ప్రతతిం గనుఁగొనుచునుండు ♦ పరితృప్తుఁడవై॥ శాం.ఆ౫,ప185

148 తే॥గీ॥ వాఙ్మనఃకాయములు శౌచ ♦ వంతములుగ
జేసికొని యనహంకార ♦ శీల శాంత

(1) కైవల్యదమును (2) దొట్టు.

బుద్ధియై నిరపేక్షతఁ ♦ బొంది యఖిల
భూతదయఁగల్గి మెలఁగంగ ♦ బోధ మొందు॥ శాంతి ఆ౪.ప312

149 క॥ విను రేఖామాత్రిపుఁ జం
దు్రనియట్టుల జీవుఁ డతని ♦ దుష్కృత్యముఁ బో
లిన యజ్ఞానము నపగమ
మున బోధానందసాంద్ర♦పూర్ణతఁబొలుచున్॥ శాం ఆ౫.ప130

150 క॥ ఈ తెరువున వేదవిదుఁడు
వీతామ్నాయుండు ధర్మ♦వేదియుఁ[1] బాపా
స్వోతుఁడు సరియై కడతు ర
నాతురత జరామరణ మ♦హాంభోరాశిన్॥ శాంతి. ఆ౫. ప91

151. క॥తమము రజస్సు దొరఁగి స
త్త్వమునన రమియించి యాగుణ♦త త్త్వము గని స
త్త్వమును దిగవిడచు వైరా
గ్యమహితుఁ డగుముసివరుం♦డకల్మషులారా!॥అశ్వ.ఆ౨.ప207

152 క॥ ఆ తెఱఁగఘములఁ బాపును
బాతకములు వాయు మొగులు ♦ వాసిన సంపూ
ర్ణోదితుఁ డగు నమృతాంశుని
భాతి వెలుఁగు నాత్మ మోక్ష♦పథ మదిసుండీ॥ శాంతి.ఆ౫.ప551

153 క॥ జ్ఞానము సవిశేషస్థితి
దానికి నాశంబు లేదు ♦ దానిఁ దెలియుట
న్మానాహంకృతి మమతలు
మానిననిర్మలుఁడు మోక్ష♦మార్గముఁగాంచున్॥అశ్వ.ఆ౨.ప166

154 క॥ జ్ఞానము యింధనముగ వి
జ్ఞానాగ్నిం బ్రిబలఁజేయ ♦ జరయు మరణము
న్నానావిధదుఃఖంబులు
లేనియమృత మక్షరంబు♦లెస్సైతోఁచున్॥ శాంతి. ఆ౪.ప317



1 బాపస్నీతుఁడు.

3 – తపము.



155 క॥ ఇయ్యఖిలము సృజియింపఁగ
నెయ్యది ప్రభు వమ్మహామ♦హితభూతము పొం
దయ్యెడి శుభంబు తపమునఁ
జయ్యన సిద్ధించు నది య♦సంశయ మనఘా॥ శాంతి.ఆ౫.ప101

156 క॥ అవ్యక్తాదిక సకలము
నవ్యయుఁ డగు పురుషుఁ డాశ్రి♦యంబుగఁ బరఁగున్
సువ్యక్తంబుగ నది గను
భవ్యులు వడయుదురు మోహ♦బంధవిముక్తిన్॥ అశ్వ.ఆ౨.ప201

157 క॥ వినుఁ డక్కనుటకు మూలం
బనఘం బగు తపమ యగుట ♦ నతినిష్ఠఁ దపో
ధన సమ్యగ్విధ సముపా
ర్జనము నవశ్యంబు వలయు ♦ సన్మతులారా! అశ్వ.ఆ౨.ప202

158 క॥ తప మనగ సకలవిషయ
వ్యాపేత మగు నట్టిబుద్ధి♦వైభవము సుమీ
తపమున సుస్థిరుఁ డగు యో
గపరునకుం గలవె యొండు ♦ కర్తవ్యంబుల్॥ ఆర. ఆ౫. ప90

159 క॥ శివకరము దపము మేథా
ధవ! సకలజనంబులకును ♦ దానికి మూలం
బవిరళ శమ దమసంపద
లవుట నివి మనంబుతోడ ♦ నలవడవలయున్॥ శాంతి.ఆ౫.ప69

160 ఆ॥వె॥ అధ్వరంబుకంటె ♦ నధికంబు తపము ద
పంబునాగ మేని ♦ ప్రిన్నఁదనము
నివురఁ జేతగా ద ♦హింసయు సత్యవా
క్యంబు దమము దయయు ♦ గాని యరయ॥ శాంతి. ఆ౨.ప348

161 క॥ సత్యంబు బ్రహ్మచర్యము
నిత్య శుచిత మౌన మతుల♦నియమము దయ శు

ద్ధత్యాగంబుఁ దపస్సం
పత్త్యాకృతు లండ్రు బుధులు♦పౌరవముఖ్యా! అను. ఆ౩. ప206

162 క॥ క్షమలేని తపసి తపమును
బ్రిమత్తసంపదయు ధర్మ ♦ బాహ్యాపరిభు రా
జ్యము భిన్నకుంభములతో
యము లట్టుల యధ్రువంబు ♦ లగు నవియెల్లన్॥ ఆది.ఆ౨.ప171

163 క॥ అనఘా! తపోవనంబున
జననంబును మరణదశయు ♦ సంప్రాప్తము ల
య్యెనయేని వాఁడు ముక్తుఁడౌ
మనంబు బహుకామవికృతి♦మగ్నం బైనన్॥ శాంతి.ఆ౬.ప238

164 తే॥గీ॥ అనఘ! సుఖదుఃఖములు వచ్చి♦నపుడు ముద వి
షాదములు లేక సంప్రాప్త ♦ సముపభోగ
రతుఁడు నప్రాప్తవాంఛాని♦రాసకుండు
నగుట సారతపోరూప ♦ మండ్రు బుధులు॥ శాంతి.ఆ౫. ప501

165 క॥ మమతాహంకృతి [1]రహిత త
పమునఁ బ్రజాపతిసమీప ♦ భవ్యపదము సం
యమి పొందు నిందు సందే
హ మొకింతయు లేదు నిర్మ♦లాత్మకులారా! అశ్వ. ఆ౨. ప204

166 తే॥గీ॥ పంచవిధవృత్తులగు మహా ♦ పాతకములు
లోనుగాఁ గిల్బిషము లెల్ల ♦ లుంఠితంబు
లగుఁ దపంబున సత్యశౌ♦చాదు లోలయు
నఖిలసిద్ధులు నజుచేత ♦ నావహిల్లు॥ శాంతి. ఆ౩. ప415

167 క॥ తపము నిదానము ధర్మ
ప్రపంచమునకెల్ల దానిఁ ♦ గ్రమమున వ్రతతం
త్రపరాయణు లొనరింతు ర
ధిప! ఫలమూలాంబువృత్తిఁ♦తృప్తి బొరయుచున్॥ శాం.ఆ౩.ప413

168 క॥ ఈ తెరువున జరియించుచు
నే తెఱఁగుననైనఁ దప్పె♦నేనియుఁ బురుషుం

1 సహిత.

డాతత నాకసుఖము గనుఁ
దొలెంచును మగుడ సద్బ్రుధులవంశమునన్॥ శాంతి.ఆశ్వా.ప627

169 క॥ విను నీవును నాపదలకు
మనమున నొక్కింత యోర్చి మహనీయముగా
నొనరింపుము తపము తపం
బునన కదా సకల సౌఖ్యములు సిద్ధించున్॥ అర. ఆ౬. ప107

170 క॥ [1]వసువులు రుద్రాదిత్యులు
వసుధేశ! తపంబు గౌరవంబున నైశ్వ
ర్యసమృద్ధులైరి తపమునఁ
బ్రసిద్ధముగ నిష్టసిద్ధి వడయుము నీవున్॥ అర. ఆ౧. ప34

171 చ॥ కమలభవుండు దాఁ దపముకల్మినగాదె సృజించె నెల్లలో
కములను నాదిరాజు లధికం బగుపెంపు వహించు టెల్ల ను
త్తమ తపమాచరించుటన తద్దయు సౌఖ్యకరంబులైన భో
జ్యములును గంధమాల్యములు శయ్యలు భవ్యతపఃప్రభూతముల్॥
శాంతి. ఆశ్వా. ప498

172 సీ॥ ఇంద్రియార్థంబులం దింద్రియవ్యాపార
ముడిగించి క్రియ లెల్ల విడిచి పుణ్య
పాపబంధంబుల నొప్పి బంధింపఁగఁ
బడక మనోవృత్తి విడిచి నాకు
నిది ప్రియం బప్రియం బిది నింద యిది మహా
స్తుతి యిది యనక సంతత నితాంత
సంతోషయుతుఁడనై వంతయు భయమును
శీతాతపంబులు వాతగతియు

గీ॥ నెఱుఁగ కివ్విధమున మఱచి శరీరంబు
మరణ జీవితముల కురువిషాద
రోషవృత్తు లుడిపి భీషణాటవి నుండి
చేసెదను దపంబు భాసురముగ॥ ఆది. ఆశ్వా. ప64

---

1 వసు రుద్రాదిత్యాదులు.

173 సీ॥ భూరితపంబునఁ ♦ జూరె ప్రజాపతు
ల్బహువిధసృష్టి నిర్వాహణ నిపుణు
లైరి వన్యంబు లాహారంబులుగఁ దప
మాదరంబునఁ జేసి ♦ కాదె మునులు
కాలత్రయంబు లో ♦ కత్రితయంబును
గాంతురు విద్యల ♦ గౌరవంబు
లొందవుఁ దపంబున ♦ నొండువిధంబులఁ
బడయంగరాని యొ ♦ క్కుడుపదంబు
గీ॥ లచ్చమైన తపంబున ♦ వచ్చుఁ బడయ
బ్రహ్మవధ మద్యపానాది ♦ పాతకంబు
లెల్లఁ బాయుఁ దపఃకృతి ♦ నిద్ధతపము
పేర్మి సర్వభూతంబులు ♦ ప్రీతి బొందు॥ అశ్వ. ఆ౨. ప203

174 క॥ విను మశననిగ్రహము తప
మను నభిధానంబు గల మహాధర్మము త
ద్ధనవంతుచిత్తవశగతిఁ
జను నఖిలస్థావరములు ♦ జంగమతతులున్॥ శాంతి. ఆ౩. ప414

175 క॥ యజ్ఞంబులలోన దపో
యజ్ఞం బుత్తమము దాని ♦ నాదరణమునం
బ్రాజ్ఞోత్తమ! చేయుము స
ర్వజ్ఞుఁడు ప్రీతుఁడగు శాంత ♦ రసమొప్పఁ జుమీ॥ అశ్వ.ఆ౨.ప80

176 క॥ వాకును మనసును గాయము
నేకాయనవృత్తి శౌచ ♦ మెడలని తపముం
జేకొనునది యది బోధ
శ్రీకి ఘృతంబునకు వెన్న ♦ క్రియజనకమగున్॥ శాంతి.ఆ౪ ప333

177 క॥ ఆతతసంసారము తృ
ష్ణాతంతుస్యూతబంధ ♦ నంబున దృఢమై
చేతస్సంగతిఁ బొరయుమి
కా తెఱఁగుతపంబు పుత్ర! ♦ యౌషధము సుమీ॥ శాం.ఆ౪.335

178 క॥ వికసిత తృష్ణాలతికకు
నకుటిలమగు తపము దాత్రి • మై నఱుకంగా
వికృతులఁ బ్రకృతినిఁ బురుషుని
నకలంకజ్ఞానదృష్టి • నవలోకింతుర్॥ శాంతి. ఆర.ప336

179 తే॥ గీ॥ బ్రహ్మచర్య మహింస నాఁ • బరఁగు పరమ
ధర్మములు రెండునువ్వో యు • త్తమతపంబు
దాని గలవాఁడు నిర్మల • జ్ఞానయోగ
వంతుఁడై చూడనేర్చుస • ర్వంబు నవఘ! శాంతి. ఆర.ప334

180 క॥ మమతాహంకార విము
క్తము శుద్ధము నైన యచలి • తధ్యానముతో
[1]సముపేత మగు తపము సం
యమి గను సకలోత్తరావ్య • యపదప్రాప్తిన్॥ అశ్వ.ఆ౨.ప205



౪ - యోగము.



181 సీ॥ జ్ఞానయోగము కృపా • సంపన్నబుద్ధి నా
కెఱిఁగింపవే యన్న • నెలమి నాతఁ
డతని కిట్లను నన • ఘాత్మ! సత్కర్మయో
గశ్రద్ధ దానికిఁ • గారణం బ
నిష్టంబు ద్రోవను • నిష్టంబు దేరను
నరుఁడు కర్మాచర • ణం బొనర్చు
నెయ్యది సుఖము లో • క్కింత గాలమునకు
నదియ దుఃఖంబులై • యావహిల్లు
గీ॥ నింత యెఱిఁగి ఫలము • నెడ నిరపేక్షుఁడై
సమత సౌఖ్యదుఃఖ • చయము ద్రోచి
కామ ముఖ్యవిపద • కంపితజ్ఞాన వి
శేషబుద్ధిఁ బరమ • సిద్ధిఁ బొందు॥ శాంతి. ఆర. ప 172

1, సముపేతంబగు కొపమున

182 క॥ అసమాలంబ మశబ్దము
రస గంధ స్పర్శ రూప • రహితం బగుటం
బ్రసరించు నింద్రియములకు
వసంబుగా దొందఁ బరమ • వస్తువు పుత్రా! శాంతి.ఆర.ప174

183 తే॥ గీ॥ వెలుఁగుచుండెడి దీపంబు • వేఱువస్తు
వులఁబ్రకాశింపఁజేయున • ట్లలఘు నిత్య
బోధనజ్యోతి నింద్రియ•ములను మాన
సమును దనప్రభ విగతజా•డ్యములఁ జేయు॥ శాంతి.ఆర.ప176

184 క॥ విను పురుషుని కింద్రియములు
మనంబు గలిగించుఁ గ్రియల • మను జేసనకుం
దన తన తెలివునఁ గార్యము
ల కమలు చూపు సచివు • లట్ల మహీశా! శాంతి.ఆర.ప177

185 చ॥ అనలము దోఁచునే తరువు•నందుఁ గుఠారముఖంబులైన సా
ధనములఁ ద్రవ్వసజ్జనహి•తంబుగఁ ద్రిచ్చినగాక, యట్ల యి
త్తనువు నలంగఁజేసి పర•తత్త్వముఁ గాంతు మనంగరాదు వి
న్ననువున నాగమోక్తమధ•నం బొనరించినఁగాని భూరమణా.
శాంతి. ఆర. ప 179

186 క॥ డెందమున కింద్రియములకు
నొందగరాకున్న లేక • యున్నే తత్త్వం
బిందు నపరభాగంబునఁ
బొందవు చూడ్కులవి లేక•పోవునె? సుమతీ! శాం.ఆర.ప180

187 క॥ వల యురి రోదము గాలము
గలిగికదా మృగము పక్షి • గజము ఝషము ద
క్షులు పట్టుదు రట్లై త
జ్ఞులు విజ్ఞానంబు కలిమిఁ • జూతురు పురుషున్॥ శాంతి.ఆర181

188 క॥ పామెఱుఁగుఁ బాముకాళులు
ధీమంతుం డెఱుఁగనేర్చు • ధీసాక్షిత్వ
శ్రీమంతుఁ బరమపురుషుని
ధీమలనిర్మోచనంబు తెలఁగు నెఱుఁగన్॥ శాం. ఆర. ప 182

189 క॥ కలుగుం దోఁపమి యమవసఁ
గలుగునె యంతటన యమృత♦కరునకు నాశం
బలఘు పరవస్తువునకుఁ
గలదె యభావంబు మనసునఁ♦గానికలుచకా॥ శాంతి. ఆ౪.ప183

190 క॥ రవిబింబము రాహువు పయిఁ
గవిసినఁ బాసినను దోఁపక♦యుఁదోఁచియు నుం
డు విధమ యజ్ఞానంబున
యవిరతివిరతులయధీనుఁ♦డగు నాత్మునకుకా॥ శాంతి. ఆ౪.ప184

191 క॥ విను మానసప్రసన్నతఁ
దనుఁ గను పురుషుండు కలుష♦తం గానఁడు దే
ఱిననీట రూపుసూడఁగ
నను వై కలఁక నదిలేని ♦ యట్టుల పోలెకా॥ శాంతి. ఆ౪ ప185

192 తే॥ గీ॥ ధ్యానయోగనిశ్చల మగు ♦ నంతరంగ
మెడలవిడుచు గుణంబుల ♦ నిద్ధశాంత
మైన నిర్గుణవస్తువు ♦ నందుఁ గలయుఁ
బరమపద మది దానికిఁ ♦ బరము లేదు॥ శాంతి. ఆ౪. ప 188

193 క॥ అనుభవమ్ము సిద్ధింగు శాంతిం
గను నది నిర్భేదసత్త్వ ♦ కాశం బది దా
విను తలఁపునకును బలుకున
కు నగమ్యము గర్మముల క♦గోచర మనఘా! శాంతి. ఆ౪.ప199

194 క॥ అమృతత్వం బచ్యుత మమలం
బమేయ మవ్యయ మనంత ♦ మావ్వెలుఁగు య్యమా
ధ్యమ్ముల వలవడిన చిత్తము
శమాతిరేకమునఁ బొంద ♦ సంవేద్య మగుకా. శాంతి.ఆ౪. 201

195 క॥ వినుము నివాతస్థానం
బునఁ గంపనరహితదీప♦ము వెలింగెడు చా
డ్పున నంతరాత్మ వెలుఁగుచు
నునికి ప్రసాదంబు భంగి ♦ యుత్తమధిషణా! శాంతి.ఆ౫. ప156

196 క॥ వినుతప్రసాదవంతుఁడు
దనయందు నిరంజనముగఁ ♦ దన్ననిశంబుం
గనుఁగొనుచు నియతి నియతా
త్మనుఁడై యుండుటయొనర్చు♦శాశ్వతపదముల॥శాంతి.ఆ౫.ప157
197 క॥ తను నెఱిగిన నవ్యక్తము
[1]చనుపున బోధాత్ముఁడజర ♦ శాశ్వత విగతాం
జన విపులాచ్యుత పదముం
గని యుకురుఁ డగు నిజప్ర♦కాశస్థిరతల॥ శాంతి. ఆ ౬. ప102
198 క॥ శాంతి పరినిష్ఠునకు నే
కాంతికధర్మంబు కరత♦లామలక మగుం
జింతాతంతుతఁ ప్రిటనా
త్యంతవిదగ్ధంబుసూవె యాది ♦మనుజేంద్రా! శాం. ఆ౬. ప50 3
199 తే॥ గీ॥ యోగధర్మంబుకంటెను♦ నుత్తమంబు
గలుగనేరదు ధర్మమొ♦క్కటియు నపున
రాగమం బగు పదమున♦ కరయ నిదియ
మేటినిచ్చెన సంయమి ♦ కోటికెల్ల॥ అను. ఆ ౪. ప216
200 క॥ యోగంబుఁ దపంబుఁ బరి
త్యాగంబును గాక యొండు ♦ లగునె హితంబుల్
రాగము పరి దుఃఖంబును
ద్యాగముఁ బోలెడి సుఖంబు♦నరయం గలరే! శాంతి. ఆ౫. ప386
201 క॥ వినుయోగయుక్తునకు శ
త్రునిహతి జలబాధ యగ్ని♦దాహము మొదలై
చను నవ్వికారములు లే
వనఘ! యతఁడు గోరఁడైంద్ర♦మగుపదమైనల॥అశ్వ.ఆ౧.211
202 తే॥ గీ॥ తపము సత్యంబు కన్న వి♦ద్యయు సుఖంబు
విడువు దుఃఖంబు రాగంబు ♦ వినుము నరుఁడు
ముక్తి కుత్సహింపక భవ♦సక్తుఁడైన
నొందుపుట్టుపునం దది ♦ యొంద రాదు॥ శాంతి. ఆ౬. ప 311

1 చనువుల.

203 క॥ అమృతము విద్యయుఁ బరమహి
తము సేయుటఁ బుచ్చికొందు ♦ దానిని సుమతు
ల్దమకుఁ విషమువలన నై
న మహీశ్వర! నీచమగు జనము చే నైనన్॥ శాంతి.ఆ 3 ప435

204 ఆ॥ వె॥ సకలరత్నపూర్ణ ♦ సర్వవసుంధరా
చక్రదానవిధియు ♦ సరి యనంగ
రాదు విశ్వవేద♦రాశి సారాధ్యాత్మ
విద్య యిచ్చుటకు వి♦వేకధుర్య! శాంతి. ఆ 2. ప159

205 తే॥ గీ॥ అనఘ! విను కామమును గ్రోధ♦మును భయంబు
నిద్రయును లోభమును జాల ♦ నిందితములు
యోగిజనులకుఁ గావున ♦ నుడుగవలయు
వీని నైదింటి నచలావ♦ధానవృత్తి. శాంతి. ఆ 2. ప115

206 సీ॥ కమఠంబు తనయంగ♦కముల నెట్లట్లు కా
మముల విద్వాంసుండు ♦ మరలఁ దివుచుఁ
గామముల మరల్పఁ♦గా నోపు ధీరుండు
విరజస్కుఁడై ముక్తి ♦ తెరువుగాంచు
నింద్రియంబులు పది♦యింటిని గుదియించు
టెక్కుడు వెరవది ♦ యింధనముగ
నాత్మాగ్ని వెలుఁగు భూ♦తావళి నాత్మఁ
గాంచిన సూక్ష్మతత్త్వదర్శనము గలుగు
గీ॥ భూతపంచక జలధి రో♦గాతిశోక
సహితభోగ లవాంశకా♦శ్రయము దీని
విభులు గాముండు గ్రోధుండు ♦ వీరి గెల్వ
వచ్చు నప్పుడ యది కడ♦వంగవచ్చు॥ అశ్వ. ఆ౨. ప152

207 క॥ యోగులకు యోగబలమున
రాగము మోహంబులును జి♦రస్నేహము గా
మాగమము గ్రోధమును గుణ
యోగముఁ బెడవాప వరుస ♦ నున్నతి యొలయున్॥
శాంతి. ఆ2. ప576

208 ఆ॥ వె॥ ఏన కలను నాకు ♦ నెవ్వరివాని గా
నాత్మ దలఁతు నన్ను ♦ నట్టివాని
నెందుఁగానఁ గాన ♦ నెవ్వరివాఁడను
గానసంగ వలదె ♦ మాననీయ! శాంతి. ఆ ౬. ప241

209 తే॥గీ॥ నాకుఁ బ్రజ గతియిచ్చు నసంగవలవ
దే నవప్రజయయి పొడమెదఁ ♦ గాన నేను
నన్నుఁ గనుచున్న నది మోక్షణంబు సేయు
నాసపడ నట్టులగుటఁ బ్రజాభియుక్తి॥ శాంతి. ఆర. ప27

210 క॥ సమదృష్టిని లాయియుఁ గన
కము చూచుచు సత్సమాధి ♦ కలితం బగు వృ
త్తము నడిపిన శబ్దబ్రి
హ్మము షణ్మాసముల యోగిమతివర్తించున్॥ శాంతి. ఆ౫. ప122

211 క॥ సుత విను శబ్దబ్రహ్మని
యతి వర్తించి భువనత్రయమునను యోగా
న్వితుఁ డగు మునిగను నజు శా
శ్వతునచలుఁబు రాణతమునజరుఁబరమాత్మున్॥ శాం.ఆ౫.ప123

212 సీ॥ పురము శరీరంబు♦బుద్ధి తత్స్వామిని
సర్వార్థచింతన ♦ సచివపదవి
నడుచుచునుండు మనంబు శబ్దాద్యంబు
లై చెల్లు విషయంబు ♦ లైదు దగఁ బు
రోహిత వర్గంబు ♦ శోత్రాదులగు నింద్రి
యంబులు పౌరజనంబు లిట్లు
పరగెడు రాజ్యంబు ♦ పరిభోగమునకు దో
షకులైన దొరలు ర♦జస్తమములు

గీ॥ [1]వారికఱపులఁబడి బుద్ధి ♦నేరకుండి
మనసుతోడ వేర్పడిన తా♦నును మనంబు
నేకముఖతఁ గార్యముసూచు ♦ నేని దుష్ట
లడగుదురు భోగ మవ్యయ♦మగుఁ గుమార॥ శాం.ఆ౫. ప20

1. వారికఱపుల

213 తే॥గీ॥ విను నవద్వారపురమున ♦ వెలుగుచుండు
హంసుఁ డాతని నక్షరుఁ ♦ డమృతుఁ డండ్రు
పరమయోగు లాతత్త్వంబు ♦ భంగి గాంచు
యోగ్యసత్క్రియాభ్యాసవై ♦ భాగ్యవంతుఁడు॥ శాంతి, ఆ౫. ప113

214 తే॥గీ॥ ఆత్మతత్త్వ మేకంబ దీ♦పాంతరములఁ
గలుగఁజేయు ప్రదీపంబు ♦ కరణి నావ
హించు రూపాంతరముల న♦య్యేలమియును బు
ధుండు గనుఁగొని భ్రమయక ♦ యుండునొకట॥ అశ్వ. ఆ౨. ప155

215 ఆ॥వె॥ మనసు మనసునంద ♦ మడియించి యాత్మని
నాత్మయంద కాంచు ♦ నట్టియతఁడు
సర్వవిదుఁడు దన్ను ♦ సకలభూతవితతిఁ
గనుచునుండు నిర్వికల్పముగను॥ అశ్వ. ఆ౨. ప154

216 త॥ తనయంద తన్ను లెస్సగఁ
గనుటం గడచినసుఖంబు ♦ గలుగదు లోకం
బున నెందు దానికయ్యెడు
వినుతానుష్ఠానమునకు ♦ విసువవలయుఁ ॥ అశ్వ. ఆ౧. ప212

217 క॥ తన యొడ్డఁగిన తెరువున నె
మ్మన మంతర్వర్తిఁ జేసి ♦ మఱి బాహ్యగతిం
జననీకుండగ నదియుం
దనువునఁ బడ నిలుపవలయు ♦ నచ్చటదానిన్ ।అశ్వ.ఆ౧.ప214

218 తే॥గీ॥ దంతములు జిహ్వ గుత్తక♦తాలుతలము
కంఠనాళంబు హృదయంబ♦గణ్యచరిత !
మఱియు[1] లోఁబడ నెచటికి ♦ మనసు మలఁగె
డాఁగఁ దప్పక యచటన ♦ యాఁగవలయు॥ అశ్వ. ఆ౧. ప216

219 ఆ॥వె॥ పాలకడవ పెక్కు ♦ పసులలోపల డించి
నాతఁ డెట్లు దాని ♦ నరసికొనుచు
నుండు నట్లు లోన ♦ నునిచిన మనసు నే
మరక యాత్మ వెదకు ♦ తెఱఁగు మేలు॥ అశ్వ. ఆ౧. ప220

1. లోపల.

220 క॥ తను వేర్పఱిచి కేవల
మును శాంతమునైన తత్త్వ ♦ మును సంతతముం
గనుచున్న తన్ను నెఱుఁగం
గను చీఁకటిఁబాపు వెలుఁగు ♦ గలుగుం బుత్రా॥ అశ్వ. ఆ౧. ప224

221 క॥ తెలిసికొనఁ బడయు రొరు లా
ర్యులు పోయెడి తెరువు లరసి ♦ యును జదలం బ
క్షులు నీళ్ళలోన మీనం
బులు వోయెడుత్రోవ చూడఁ ♦ బోలు నెయ్యధిపా॥ శాం. ఆ౪. ప78

222 తే॥గీ॥ ఒకటి గాని రెంటి నిశ్చల ♦ యుక్తిఁ జేర్చి
మూటి నాల్గింటిఁ గడు వశ్య ♦ ములుగఁ జేసి
యేనిటిని గెల్చి యాఱింటి ♦ నెఱిఁగి యేడు
విడిచి వర్తించు వాడు వి ♦ వేకధనుఁడు॥ ఉద్యో. ఆ౩. ప37

223 సీ॥ తెలివి నొందిన బుద్ధి ♦ గల [1]మహాత్ముఁడు శుభా
శుభకర్మములయందు ♦ జొరకయుండు
గ్రమమున సౌఖ్యదుః ♦ ఖము లాదిగా నశే
షద్వంద్వములయందు ♦ సమతనుండు
విను మట్టి పుణ్యున ♦ కొనరింపవలయు కా
ర్యం బెఱింగించెద ♦ ననుదినంబు
నియతాశియును జితేం ♦ ద్రియుఁడునై పూర్వరా
త్రమ్మున నపరరా ♦ త్రమ్మునందు

గీ॥ యోగధారణనిరతుఁడై ♦ యుండవలయు
నపుడు బోధదీపంబు న ♦ నాత్మ నాత్మ
యందు గనుచు నివాతదీ ♦ పానుకారి
యై వెలుంగుచు నమృతమ ♦ యత్వమొందు॥ ఆర. ఆ౫. ప1(?)8

224 క॥ క్షేత్రజ్ఞుం డనఁగ నిఖిల
గాత్రవ్యాప్తత్వమహిమఁ ♦ గలిగి సమీరా
సూత్రణమున జీవుండును
గోత్రము నై సర్వ[2]వర్త ♦ కుండగుచుండున్॥ శాంతి. ఆ౪. ప93

1. మహాత్ముఁడు శుభాశుభకర్మంబులందుఁ జొరఁడు 2 వర్త

225 క॥ అగు నీతత్త్వము సత్త్వా
ది గుణత్రయవికృతి ¹కత్య♦తీతంబై పూ
ర్వగురుత్వంబునకుం జన
విగతత్వంబునకు నెలవు ♦ విమలవిచారా॥ శాంతి. ఆర. ప 94

226 ఆ॥వె॥ బుధుఁడు సూక్ష్మవిమల ♦ బుద్ధి నప్పురుషుని
నరసి కాంచి యతని♦యందు మనసు
డిగ్గవిడిచి మెగ్గు ♦ లగ్గును బొందక
శుద్ధశాంతిఁ బరమ ♦ సుఖము బొందు॥ శాంతి. ఆర. ప95

227 తే॥గీ॥ పుత్ర! వినుము నవద్వార ♦ పుణ్యపురము
నం దచింత్యకు వ్యాపకుఁ♦డై శయించు
నీ సమస్తభావంబుల ♦ నెనసి యిట్టు
లగుటఁ బురుషుండు నాఁ జను ♦ నవ్విభుండు॥ శాం.ఆర.ప275

228 ఆ॥వె॥ మణిమయములు గనక♦మయములు రజతమ
యములు మఱియు మృణ్మ♦యాదికములు
నైన పెక్కుపూస♦లందుఁ దార్రి దున్నట్లు
భూతకోటియందు ♦ బురుషుఁ డుండు॥ శాంతి. ఆర. ప 129

229 క॥ అమరుం డవ్యయుఁ డజరుం
డమేయుఁ డమలస్వభావుఁ ♦ డప్పురుషుఁడు దే
హమున మహీజమునం దన
ల మున్నగతి నుండు మధన♦లక్ష్యుండగుచున్॥శాంతి.ఆర.ప276

230 ఆ॥వె॥ వినుము యోగమధన♦మునఁ దోఁచు నత్తేజ
మది ప్రబోధసాంద్ర ♦ మఖలభూత
గణసమాశ్రయంబు ♦ గావున శ్రవణాద
ర్శనముఖ క్రియాక♦రంబు దాన॥ శాంతి. ఆర. ప277

231 తే॥గీ॥ సత్త్వమార్గాభిరతియాత్మ ♦ తత్త్వదర్శ
నంబు గావింపఁ దనుఁదాన ♦ నరుఁడు గాంచు
విశ్వమునఁ దాను దనయందు ♦ విశ్వమును వ
సించుటయుఁజూచుచును ముక్తిఁ♦జెందియుండు॥శాంతి.ఆఽ. 281

1 గత్యతీతంబై

## ౫ - మోక్షము.

232 తే॥గీ॥ విను మనేకవిధంబుల ♦ విస్తరిల్లు
ధర్మములయందు దొకండును ♦ దలఁప నిష్ఫ
లంబు లేదాత్మ మోక్షావ♦లంబియైన
ధర్మ ముత్తమమండ్రు త♦త్త్వజ్ఞు లధిప॥ శాంతి. ఆ౪. ప 5

233 సీ॥ పుణ్యంబు లగు కర్మ♦ముల నెపుడును జేసి
యింపారుచుండు నై♦హికసుఖంబు
త్రిదివంబుఁ బడసితి ♦ ధీయుత యత్యంత
యత్నలబ్ధంబైన ♦ యట్టిపదము
పదపడి యొకమాత్ర ♦ భ్రంశంబుఁ బొందఁ గా
మక్రోధముఖ చిత్త♦మలవిశేష
ములఁ బొరిఁబొరి జన్మ♦మును మరణంబును
గలుగంగ నేను ద ♦ ల్లులను దండ్రు
గీ॥ లను సహోదరులను బుత్రు ♦ లను ననేక
జాతికలితులఁ గాంచితిఁ ♦ జన్ము బాలు
వివిధభంగుల వానిఁ దా♦వితి సుహృద్వి
యోగ ధననాశ దుర్దశ ♦ లొందెఁ బెక్కు॥ అశ్వ.ఆ౧.ప158

234 క॥ కడు మరిగిన సౌఖ్యంబులు
విడుచుట చిత్తంబు దుఃఖ♦వివశముగ మహిం
బడుఁ జూవె పుణ్యలోకం
బెడలిన మనుజుండు తేజ♦మేది యబలుడై॥ ఆర. ఆ౬. ప 136

235 క॥ అదియునుగాక ఫలంబులు
తుదిముట్టం గుడిచి వెడలఁ ♦ ద్రోవఁబడుదు ర
ట్టిది సౌఖ్య మగునె శాశ్వత
పదంబె మోక్షంబుగాక ♦ భవ్యవిచారా! అశ్వ. ఆ౧. ప284

236 క॥ విను మనఘ! యింక సుకృతం
బునకుం జొర దుష్కృతంబు ♦ పొంతకుఁ బోనే

ననుపము నచ్యుతు నవ్యయు
ననంతుఁ జెందెద ననామ♦యత నవిష్ణుక్॥ శాంతి. ఆ౫.ప405

237 క॥ పాపాత్ములు నరకము పు
ణ్యోపేతులు దివమువిధి ని♦యుక్తి నవశతం
బ్రాపింతురు గావున ని
ర్లేపం బగుమోక్ష మొంద♦లే రట్టిజనుల్॥ అశ్వ. ఆ౧. ప181

238 క॥ మానసశారీరము లగు
నానావేదనల వివిధ ♦ నరకగతుల దుః
ఖానేకత్వ మొనర్చు వి
మానసభవబంధసంప్రి♦మర్దనకృతులన్॥ అశ్వ. ఆ౧. ప 159

239 క॥ కృతకర్మఫలము తెగఁ గుడి
చి తనకుఁ దగినట్టి పుట్టు♦చెందు మగుడ ని
ట్టి తెఱంగున జీవాత్ముఁడు
గతాగతము లనుభవించుఁ ♦ గల్మషరహితా! అశ్వ. ఆ౧.ప180

240 క॥ ఊహించి తన్నుఁ గప్పెడు
మోహాతిశయంబు ద్రోచి ♦ మోక్షపదప్రా
ప్తీహను సంసారాబ్ధ్యవ
గాహనముం జేయకుండు ♦ గతకల్మషుఁడై॥ అశ్వ.ఆ౧. ప199

241 క॥ విను సుఖదుఃఖము లచిరము
లనియుం దను వశుచియనియు ♦ నఖిలపదార్థం
బును నశ్వర మనియుం గ
ర్మనిరూఢత జాడ్యమనియు♦మదినూహించున్॥ అశ్వ.ఆ౧.ప198

242 తే॥ గీ॥ నరుఁడు సుఖదుఃఖముల వెంట ♦ బారయనీక
మలఁచి యాత్మను జేర్చిన ♦ మానసంబు
లీనమగు నందు జలములలో♦న నిడిన
లవణకణము చందమ్మున ♦ నవనినాథ! శాంతి. ఆ౪ ప357

243 క॥ మనమున ధర్మము నర్థం
బును గామము గెలుకొనక ♦ పౌరషాచ్చమ్ములై

చను సుఖదుఃఖములును మద
మును దైన్యముఁబొందకునికి మోక్షకరమగుర్॥ శాంతి.ఆ3.ప466
244 క॥ భూతములు జరామరణో
పేతంబులు గాన మోక్ష ♦ మెదఁ గోరుట మే
లాతత వర్గత్రయ సం
జాత మనోదుఃఖ భార♦సహుఁడగుకంటెన్॥ శాంతి.ఆ3.ప464
245 క॥ ఎయ్యెడకుఁ జనిన బురుషుం
డెయ్యెడకును మగుడకుండు ♦ నెక్కాలము నే
నయ్యుత్తమపదవికిఁ జన
నెయ్యనవున నైన నుత్స♦హించెదబుద్ధిన్॥ ఆర.ఆ౬. ప140
246 ఆ॥ వె॥ ఒడలి యస్థిరత్వ ♦ మూహించి యాత్మయం
దధికనిష్ఠగలుగు ♦ నతఁడు సకల
భూతకోటివలనఁ ♦ బొందఁడు భయము రో
గాదిదుఃఖములకు ♦ నగపడండు. అశ్వ. ఆ౧. ప210
247 క॥ తనగృహమున నభ్యాసం
బున మెలఁగెడు నంధుచంద♦మున సంసారం
బునఁ దిరుగు మూఢుఁ డెఱుఁగఁడు
వినుతంబగు మోక్షపదము ♦ విమలవివేకా! శాంతి. ఆ౫. ప532
248 క॥ జననము జరయును మరణం
బును మొదలుగఁ గలుగు దుఃఖ♦ములు లోకమునం
గనుఁగొని బుధుండు మోక్షం
బున కుద్యోగించు నియతిఁ♦బూతహృదయుఁడై॥ శాం.ఆ౪. ప311
249 తే॥ గీ॥ భూతముల పుట్టుచేష్టయుఁ ♦ బొలియుటయును
జూచు నేరుపు గలవాఁడు ♦ చూడనేర్చు
మోక్షమార్గంబు చిక్కంబు♦ మూఢమైన
సత్త్వుఁడగు [1]లోలగతి నెట్టు♦ముక్తి గలుగు॥ శాంతి.ఆ౫ ప462
250 క॥ జనిరుగ్జరామరణములు
గని ప్రకృతివిధంబు తెన్న♦గా నెఱుఁగుట త

(1) లోకగతి

జ్జనితక్లేశమునకు విసి
విన మర్త్యులు పరమపదము• వెదకుదు రనఘా! అశ్వ. ఆ౧.ప201

251 ఉ॥ చెందుచునుండుఁ బుణ్యములు• చేసి సురత్వము మర్త్యకర్మఁడై
యొందు నరత్వముం దురిత•యోగమునం బశుకీటభావముం
బొందు సుఖంబు దుఃఖమును • బొందఁగ జీవుఁడు దీనిభేదశ
క్తిం దెలియంగనేర్చిన మ•తింగల యాతఁడుగోరు మోక్షముం॥
శాంతి. ఆ౫. ప607

252 తే॥గీ॥ ధనములును దానములు తపో•ధనము వాజి
పేయ రాజసూయంబులు • [1]వేయుఁగోరి
చేయుటలు గావు మోక్షద•ర్శిత్వ మొకఁడ
మందు జరకు మృత్యువునకు • నిందువదన! అను. ఆ౫. ప237

253 తే॥గీ॥ భూతములను గుణంబుల • బుద్ధి మనసు
నడఁచికొని జీవు డొందు నా•రాయణునిఁ ద
దీయ మాహాత్మ్యమున మాన•నీయ పరమ
పదము గనుఁగాన నిష్పుణ్య•పాపుఁ డతఁడు॥ శాంతి. ఆ౫. ప618

254 క॥ తనదేహము దోషములం
[2]గనుఁగొను వెరవున నొకండు • గలుగు విముక్తిం
గనుపని కుద్యోగించుట
కనఘా! పెక్కండ్రు లేర• హంకృతికతనన్॥ శాంతి. ఆ౫.ప609

255 క॥ విను సత్వరజ స్తమముల
పెనుకువ కవ్రుల వెలుఁగొందు • పెంపుగలుగు తు
ర్యనిరంజనతత్త్వము పర
మనఘా! యది భావనీయ•మను వేదంబుల్॥ శాంతి. ఆర.ప332

256 క॥ విను కేవలుఁ డగు జీవుఁడు
తనుఁ బరముంగాఁగ జూచి • త ల్లీనత్వం
బున వెలుఁగునది నిరామయ
మనంతమగు పదమునూ వె•యతులవివేకా! శాంతి. ఆ౬. ప59

1 వేయునోపి. 2 గనుఁగొన వేవురకు నొకఁడు.

257 ఆ॥ వె॥ నిమిష మేనిఁ బరమ♦నియతి నాత్ముని నాత్మ
యందఁ గనిన తెలివు ♦ నారఁబడసి
బోధ మహితమునులు ♦ పొందు నవ్యయగతి
బొందఁగందుఱ ప్రకృతి♦పొందుఁ దొఱఁగి॥ అశ్వ. ఆ౨. ప180

258 క॥ ప్రకృతిగుణంబులఁ గొని బహు
వికృతపురూపముల నట్లు ♦ వెట్టిగొలిపె నే
నకలంకుండ నరూపుఁడఁ
బ్రకృతిఁ దొరగి నిలిచెదను ని♦రంజనమహిమన్॥ శాంతి. ఆ౬. ప51

259 గీ॥ ప్రకృతి చేసెనె యీయప♦రాధ మరయ
నాయదియకాక వేఱొకం♦డో యనంగ
కలితుఁ డగు నేను దానితోఁ ♦ గలయనేల
గలిగె బహురూపనులు దాన ♦ గాదెనాకు॥ శాంతి. ఆ౬. ప52

260 క॥ మమతంగాదే బహుజ
న్మము లయ్యెడు దీని విడిచి ♦ నానాయోని
భ్రమణంబుం బాసెద న
త్యమలుఁడనగునాకుఁబ్రకృతి♦యాశ్రయ మేలా? శాంతి. ఆ౬. ప53

261 తే॥గీ॥ ఎన్నిరూపులు గొనివచ్చి ♦ యెట్లు పొడవు
చూపె నేనియు దాని నేఁ ♦ జూడ మమత
నా నహంకార మనఁ గల్గు ♦ వానిఁ జేర
నీక త్రోచినఁ బ్రకృతి దా♦నెట్లు దోఁచు॥ శాంతి. ఆ౬. ప54

262 క॥ ప్రకృతి దన యిచ్చఁ గ్రీడా
రథకముగ సత్త్వాదిగుణ వి♦తానము నానా
వికృతులఁ బొందింప ననం
ఖ్యకవిధమై పరఁగుచుండు ♦ నది మనుజేంద్రా! శాంతి. ఆ౬. ప96

263 క॥ దీపమున ననేకములగు
దీపములు పరంపరాను♦దీప్తాకృతులై
వ్యాపించుచందమున గుణ
రూపంబులఁ బరఁగుఁ బ్రకృతి♦రోషవిదూరా! శాంతి. ఆ౬. ప97

264 క॥ ప్రకృతికిని గుణములం గొని
యకలంకం బైన యంత•రాత్ముని వేవే
ల్వికృతులఁ బొందించుట వా
యక కలుగుందత్స్వభావ•మది యరయంగన్॥ శాంతి. ఆ౬. ప99

265 క॥ గుణములఁ బొందఁడు పురుషుఁడు
గుణమహితాప్రకృతి యిచ్చు•గుణముల కేమే
గుణములు దాననుగుణులై
గుణిత్వ మా నిర్గుణాత్ము•కున కొలయించున్॥ అను. ఆ౮. ప 222

266 తే॥గీ॥ వీని నెల్లన సత్కోటి•గా నెఱింగి
కొనుచుఁ బ్రకృతి నపేక్షించి•తనకుఁ దాన
కాని యొం డెద్దియును లేమి•గాంచినపుడు
పురుషుఁ డపగత ధూమాగ్నిఁ•బోలి వెలుఁగు॥ అను. ఆ౮. ప223

267 తే॥గీ॥ అట్లుగాక యహంకార•మావహిల్లి
ప్రకృతి దానని సృష్టికిఁ•బ్రళయమునకుఁ
గర్తయైన వికారాత్మ•కత్వ మొందు
ప్రకృతివికృతులు గాని యా•ప్రభువునపుడు॥ అను. ఆ౮. ప224

268 క॥ ధృతి పూనమిఁ బ్రకృతి న్వశ
గతుఁ డగుచుఁ దమోమయత్వ•కలితంబుగ న
వ్రితతా సుఖత్వమును సుఖ
మతిఁ బురుషుం డనుభవించు•మదనధ్వంసీ! అను. ఆ౮. ప225

269 ఆ॥వె॥ జలముఁ గదిసియుండి•జలముచే నార్ద్రింబు
గాక యుండునట్టి•కమలదళము
భంగి నంతరాత్మ•ప్రకృతిఁ బొందియును ద
ద్వికృతి బొందకుండు•వీతదోష! శాంతి. ఆ౬. ప109

270 తే॥గీ॥ ఇంద్రియంబులు మనమునం•దివురఁ జేసి
మనసు దిగిచి యహంకార•మును నడంచి
బుద్ధిలోన నహంకృతి•బుచ్చి బుద్ధి
బ్రకృతిఁ గలప దద్ధ్యానత•త్పరతగలుగు॥ శాంతి. ఆ౬ ప117

271 క॥ చేతనుఁ డగుపురుషుని ని
శ్చేతన యగుప్రకృతిపొంది♦చేతనతాప్రి
స్థిత యగుం బరతత్త్వము
లాతత్త్వం బను మహాబ్ధి♦ యందలి తరఁగల్॥ అను. ఆర. ప221

272 క॥ నిశ్చేతనయును నెంతయు
దుశ్చేష్టయు నైన ప్రకృతి ♦ దొరఁగి సముద్య
న్నిశ్చయవృత్తి నిరామయు
నిశ్చల నిర్మలపదైక ♦ నిరతుఁడ నగుదుర్॥ శాంతి. ఆ౬. ప55

273 ఆ॥వె॥ ప్రకృతి దొరఁగి తన్నుఁ♦ బరికించుజీవుండు
పరముఁగాంచునపుడు ♦ ప్రకృతి సగుణ
తానిరూఢి యడఁగి ♦ తన్మయత్వము నొంది
జీవ కేవలత్వ♦సిద్ధి యొలయు॥ శాంతి.ఆ౬.ప58

274 తే॥గీ॥ కమలదళముఁననున్న జలము విధమున
బ్రకృతినుండి తదీయ సం♦బంధవికృతి
లేని తనుఁ గని వెలుఁగు ని♦ర్లేప నిశ్చ
లాజరామరపదవి జీ♦వాహ్వయుండు॥ అను. ఆర. ప233

275 క॥ తనయందుఁ దోఁచు విషయము
లనుభవగోచరము లగుట ♦ నది మాయాసం
జనిత స్వప్నంబై యా
త్మునికిం దనుఁ[1] గానలేని♦ మోసము దెచ్చుర్॥ శాం.ఆర.ప123

276 క॥ విను మాయవిధం బిట్టిది
యని యారయ వెరవు గలుగ ♦ దవనిం జరణం
బనఘా! మోహనిజంతువు
చను చొప్పరయంగ రాని ♦ చందముఁబొందుర్॥శాం.ఆర.ప190

277 క॥ గుణమూర్తి మాయదానిని
గణుతించెద నన్నఁ దెగదు ♦ గ్రాహ్యత్వంబుర్
గుణములఁ బెడవాపంగా
గణనాతీత మగు వెలుఁగుఁ♦గనుఁ[2]దా నంతర్॥శాంతి.ఆర.ప191

1 గానలేమి, 2 దానతనర్.

278 క॥ మాయాశబలుండై యిటు
సేయక పోరామి భూత♦సృష్టి యొనర్చున్
మాయ వెడవాప భూతని
కాయాభావ మగు నదియ ♦ కవిజనముఖ్యా! శాంతి. ఆ౫. ప123

279 సీ॥ కావున ముక్తికిఁ ♦ గారణం బగుదాని
నేర్పడ జెప్పెద♦నెఱిఁగికొనుము
దానంబు శమమును ♦ దమమును బ్రహ్మచ
ర్యవ్రతంబును వ్రత ♦ రక్షణంబు
దయయును బరధన ♦ దారవర్జనమును
నియమంబు నింద్రియ ♦ నిగ్రహంబు
జననీ జనక గురు ♦ జనపూజలును దేవ
తాతిథి పితృదేవ♦తార్చనములు
గీ॥ సత్యమును శౌచమును శుభ ♦ సంవిధాన
నిరతియును ధైర్యమును గాంభీర్య ♦ నిరసనమ్ము
కలిమిపుణ్యవృత్తం బిది ♦ గలుగు నరుఁడు
మొనయు నీనినూతఁగఁగొని♦ మోక్షమునకు॥ అశ్వ ఆ౧ ప192

280 సీ॥ [1]జలనిధి తరఁగల♦చాడ్పునఁ బొడముచు
నడఁగుచునుండు భూ♦తాత్మనందు
భూమిప్రభృతిభూత♦ములు వానిగుణములు
గంధాదు లింద్రియ ♦ గ్రాహ్యకోటి
యనఘ! శ్రోత్రం బాది ♦ యగు నింద్రియ శ్రేణి
దర్వియుఁబోలె సా♦ధనతనొందు
మన సింద్రియములకుఁ ♦ బెనుప్రాపు బుద్ధిత
న్ముఖమున నిశ్చయం♦బునకుఁ దేరఁ
గీ॥ బురుషుఁ డవ్విషయంబులఁ ♦ బొందునట్లు
గాకయుండ నింద్రియములఁ ♦ గ్రమ్మరించి
మనసుతోఁగూర్చి బుద్ధి లో♦నన యడంప
బుద్ధి నిర్విషయస్థితిఁ ♦ బురుషు నొందు॥ శాంతి. ఆ౮. ప 121

(1) జలధితరంగల.

281 సీ॥ అట్టివా రిట్టివా ♦ రగుట మేల్గని కొను
మజనంబుఁ బూతంబు ♦ నైనచోట
నాసీనుఁడై హృద♦యంబున నొకచింత
యనులేక యూరడి ♦ యుండి యడరి
తోఁచు తోఁపులనెల్లఁ ♦ దోడ్తోడ డుల్చి ని
రాలంబనుండైన ♦ యతఁ డొకండు
సర్వమిత్రుండును ♦ సర్వసహుండును
నిర్జితేంద్రియుఁడును ♦ నిర్భయుండు
గీ॥ గామకోపహీనుఁడు శమ ♦ ఘనుఁడునైన
యతఁ డొకండు మానాభిమా ♦ నాపగమము
సర్వభూతాత్మకత్వద♦ర్శనము గలుగు
నతఁ డొకండు వీరలు గందు♦రనఘ! ముక్తి॥అశ్వ.ఆ౧. ప202

282 క॥ అవయవము లెట్లు కూర్మము
నివురించును లోని కడఁచు ♦ నెరి నట్టుల భూ
తవితతి భూతాత్ముండును
ప్రభవ ర్తననివ ర్తనముల ♦ పాల్పడఁజేయుఁ॥ శాంతి, ఆ౫.ప162

283 క॥ తలఁపునన వాసుదేవుఁడు
గలిగింపను నిలుప నడఁప♦గానోపు జగం
బులు మఱియును గీ్రడార్థము
పలువోకలఁ [1]బోవుచుండుఁ♦బౌరవనాథా! ఉద్యో. ఆ౨. ప316

284 క॥ సుర సంయమి గరుడోరగ
నర కిన్నర గిరి సరి ద్వ♦న పయోధులు ద
త్కారణీయములం జేయుం
బురుషుఁడు దివ్యాంతరంగ♦మునఁదలఁచినుతా! శాంతి.ఆ౫.ప65

285 క॥ చేతన రహిత క్షేత్రముఁ
జేతనముం [2]బొందఁజేయు ♦ జీవాత్మ [3]దశా
న్వీతుఁడు పరమాత్ముఁడు వి
ఖ్యాతుఁడు త్రైలోక్య సంపత్ ♦ కల్పనుఁ డనఘా!అర.ఆ౫.ప105

(1) బుచ్చుచుండు (2) బొరయఁజేయు (3) దశో పేతుఁడు,

286 క॥ భూతములయందు వెలిఁగెడు
భూతాత్ముని నెఱుఁగుదురు ప్ర♦బుద్ధులు నిత్య
జ్యోతిర్మయు నవ్యయు న
ద్వైతంబగు బుద్ధిసూక్ష్మ♦ధర్మమువలనన్॥ ఆర. ఆ౨. ప106

287 క॥ మనసుగాని మనసు బుద్ధిం
గాని బుద్ధిని దర్శనంబు ♦ గాని దర్శనము
న్నైను క్రమమున నొదిగించిన
గను బుధుఁ డక్షరుని విష్ణు♦ఘనబోధమయున్ ॥ శాంతి.ఆ౪.ప200

288 క॥ విను దేహియు దేహము వే
రను నిశ్చయదృష్టి గల్గు ♦ నాతఁడు చాలు
స్మనసు మగిడింప నది ని
ర్మనస్కతఁ బొనర్చి మోక్ష♦మార్గముఁ జూపున్ ॥ అను.ఆ౨.252

289 మ॥ [1]మన మేకాగ్రతఁ బొందఁజేయ జనస♦మ్మర్దంబు వర్జించి శూ
న్యనికేతాద్రి గుహా వివిక్త వన దే♦వాగార ముఖ్యంబులై
న నివాసంబుల నుండఁగావలయుఁ ద♦న్మస్నించినం గీడు చే
సిన హర్షంబు నమర్షముం హృదయముం♦జెందింప కక్షోభ్యుఁడై
శాంతి. ఆ౨. ప121

290 క॥ మనసును నింద్రియములునుం
దనయం దొడుగంగఁజేయ ♦ దాను దెలివి నొం
ది నిరంజనత్వసిద్ధిం
[2]గని గతధూమానలంబు♦కరణి వెలుంగున్ ॥ శాంతి.ఆ౨.ప120

291 క॥ హరి యాత్మ యెల్లవారికి
నరవర! తనయాత్మపై మ♦నంబున దృఢత
త్పరభావములేని జనులఁ
బొరయు నె యాపదలు వేర ♦ బోధన మేలా? శాంతి. ఆ౬. ప474

292 క॥ ఏకాంతికజనములు సు
శ్లోకుం డగు హరిమనంబు♦లో నుండుదు రా

1 మననేకాగ్రత 2 గని బుధ,

లోకింప వారి కతనికి
నేకత్వము గలదు తెల్ల మిది వేదములన్॥ శాంతి. ఆ౭. ప509

293 క॥ పురుషోత్తముండు పురుషుఁడు
నిరువు రగుటగలదు గలిగె నేనియుఁ బురుషుం
బురుషోత్తమునందుఁ గలవు
వెరవున నేకత్వమహిమ విజ్ఞాతమగున్॥ శాంతి. ఆ౭. ప160

294 క॥ ఇది విజ్ఞానము కృత్యము
తుదివిజ్ఞానంబు నడఁగు దుర్లభము ప్రశాం
తి దశాహీనాత్ముల క
ప్పద మది మోక్షంబు మమత వాసినఁగల్గున్॥ శాంతిఆ౭.161

295 క॥ మానవపతిసత్తమ! యీ
జ్ఞానము బ్రహ్మాది దివిజసంయమిమత మె
వ్వానికి మోక్షంబునకుం
దాన తెరువు తెరువు లొండుదలఁపం గలవే! శాంతి.ఆ౭. ప163

296 క॥ శమ నిరతియు నాత్మజ్ఞా
నముఁ జువ్వె విబుధులలక్షణంబులు పర్యా
ప్తము లివి రెండు గలుగ మో
క్షము సాధించుటకు వేఱకల్పన లేలా? శాంతి. ఆ౫. ప177

297 క॥ విను మమకారవివర్జిత
మనస్కులకుఁ బుణ్యపాప మార్గంబులు లే
మిని నేలోకము [1]దిగ్విమ్మర
కనఘా! పొందుదురు శాశ్వతానందంబున్॥ శాంతి.ఆ౭.ప115

298 క॥ ధనయోగము దుర్లభ మని
యును గ్లేశము సులభమనియు నూహించుచు నె
మ్మనమున మర్త్యత్వముఁ కీ
డనియెఱుఁగు నతండు గను మహానందంబున్॥ శాంతి.ఆ౫. ప465

299 ఆ॥ వె॥ ఆదిని ధనరహితుఁడగు నిరంజనుఁ జెంది
గుణము లెడలవిడిచి క్రోధలోభ

1. దిగ్విమ్మర రనఘా.

ములకుఁ జోరవయిాని ♦ మునిహృదయగ్రంథి
విరియ నడఁచి మోక్ష♦విభవ మొందు॥ శాంతి. ఆ౫. ప175

300 క॥ ఇనుమును గనకము నిందయు
వినుతియు సమములుగ గొనుచు ♦ వివిధాంగకముల్
తనలోన నడఁచు కమఠము
వనువున నింద్రియము లడఁచు ♦ [1]నతఁడు శివుఁ గనున్॥
శాంతి. ఆ ౬. ప286

301 క॥ అనఘ! దురన్నము శాల్యో
దనమును భూమియును మృదుల♦తల్పం బజిన
మ్మును సురుచిరచీనాంబర
మును సరియెవ్వనికి నతఁడు♦ముక్తిం బొరయున్॥ శాంతి. ఆ౫. ప463

302 తే॥గీ॥ నేలయెల్లను నేలిన ♦ నృపులు పుట్టి
వీఁగిపోకయుఁ జూపాది ♦ గాఁగ గలుగు
శక్తు లెడలినఁ జెడు మేని ♦ చందమును ద
లంపనేర్చినతఁడు మోక్ష♦లక్ష్మిఁ జెందు॥ శాంతి. ఆ౫. ప464

303 క॥ భూతంబుల దర్శింపమి
[2]భూతస్పర్శనము భూత♦ములయెడ సంభా
షాతురతల నొందమి సూ
రే తెరువు వి మోక్షసుఖగ♦రిష్ఠత వడయున్॥ శాంతి. ఆ౬. ప314

304 క॥ విన జూడం బడినం దె
ల్లను సమతం బరముఁ గనుచు ♦ లౌల్యనిరసనం
బున సుఖదుఃఖాది ద్వం
ద్వనిరూఢుఁడుగాగయున్న♦తడుముక్తిఁ గనున్॥ శాంతి. ఆ౬, ప285

305 క॥ కోరికయు నొల్లమియు లే
కేరూపున భూతములకు ♦ నెగ్గగు తెఱఁగుం
జేరకయు కామవృత్తిఁ ద
పోరతి నున్నతఁడు బ్రహ్మ♦ముం బ్రాపించున్॥ శాంతి. ఆ౬. ప284

(1) నతఁడుగను శివున్, (2) భూతాస్పర్శనము.

306 క॥ అపరిగ్రహ సర్వారం
భ పరిత్యాగములు గలుగు ♦ పండితునకు దుః
ఖపుఁదెరువు వాటిలదు మో
క్షపథము[1]చొప్పడ,దదాత్మ♦సౌఖ్యంబొందున్॥ శాంతి.ఆ౬.ప313

307 ఆ॥వె॥ నిత్యతృప్తుఁడైన ♦ సత్యయజ్ఞుని యెడ
దేవతలును నధిక♦తృప్తు లగుదు
రమరతృప్తివలన ♦ సర్వ్యయానందంబు
సంఘటిల్లుఁజూవె ♦ సంయమీంద్ర! శాంతి. ఆ ౫. ప233

308 తే॥గీ॥ వేదసారంబు సత్యంబు ♦ వినుఁడు సత్య
సారమూర్తి దమము దమ♦సార మనఘు
లార ! మోక్ష మీపరిపాటి ♦ గారవమున
నాదరించు జనములకు ♦ నందుముక్తి॥ శాంతి. ఆ౫. ప549

309 ఆ॥వె॥ హింస లేక యునికి ♦ యింద్రియజయము [2]వై
రాగ్య మచపలత్వ ♦ మనుగుణములు
నాల్గు గలుగునట్టి ♦ నరునకుఁ గరతలా
మలక మంతరాత్మ ♦ మహిమ యెల్ల॥ శాంతి. ఆ ౬.ప315

310 క॥ ధ్యానైక తత్పరాత్ముఁడు
గానఁ బడయు నజరు నిర్వి♦కల్పు విమలు ని
త్యానంద సత్యశుద్ధ
జ్ఞానమయుం బరము నచలు♦శాశ్వతుని శివున్॥శాంతి. ఆ౬118

311 తే॥గీ॥ సర్వ సంకల్ప వర్జన♦శాలి యగుచుఁ
బరమశాంతి చిత్తంబునఁ ♦ బట్టుకొల్పు
నతఁడ యింధనానలమున♦ట్లఁ బొందు
వికృతివర్జితమైన ని♦ర్వృతి కృతాత్మ! అశ్వ. ఆ౧. ప205

312 తే॥గీ॥ వివిధసంకల్పయుక్తము ♦ విడిచి యాత్మ
యందు నిష్ఠమై నగ్నిస♦మాహితముగఁ
జేసి నిస్పృహుఁడై విష్ణుఁ ♦ జిత్తవృత్తిఁ
జేర్చువాఁ డవ్యయస్థితిఁ ♦ [3]జెంద నేర్చు॥ అను. ఆ౧. ప384

(1) చొప్పడితదాత్మక సుఖంబొందున్ (2) వైరాగ్య (3) జేరనేర్చు.

313 ఆ॥వె॥ జ్యోతి యాత్మయందు • యున్నదిగాన శ
క్యము సమాహితాత్ముఁ • డైన మునికి
నొరులవలనఁ దనకు • నొరులకుఁ దనదెస
భయములేకయున్నఁ • బరముఁ గాంచు॥ శాంతి. ఆ౬. ప 283

314 తే॥గీ॥ ఎల్లయందును దా వసి•యించు నెల్ల
యదియుఁ దనయందు వసియించు • టండ్రు వాసు
దేవుఁడను పేరి కర్థంబు • తెల్లమింత
యెఱుఁగుజనులందుఁదగవసి•యించుశుభము॥ఉద్యో.ఆ౨.ప326

315 ఆ॥వె॥ శ్రద్ధ గలిగి లోక•సంగ్రహాసంగంబు
నీడ విడిచి యెవ్వఁ • డీశుపాద
ముల భజించువాఁడు • మోక్షలక్ష్మీపతి
యగు నొకింత సంది•యంబు వలదు॥ అశ్వ. ఆ౧. ప228

316 క॥ ముక్తుండు జరామరణ వి
యుక్తుండై హర్షశోక • రోగ మెడలి స
ద్భక్తులకును సత్పద మీ
శక్తుండగుఁ జువ్వె బ్రహ్మ•చర్యము పేర్మిన్॥ అశ్వ. ఆ౧. ప209

317 క॥జగములకెల్ల శరణ్యుం
డగుచు నమృతసిక్త మైన•యట్టి మనసుతో
విగతాఖిల లేపస్థితి
గగనము నట్లుండు నతఁడు • గణనాధికుఁడై॥ శాంతి.ఆ౫.ప147

318 క॥ పరమం బనంగ వేదాం
తరహాస్యాత్మకత వెలుఁగు • తత్త్వము నిక్కం
బరయఁగ క్షేత్రజ్ఞుఁడ యను
పరిణతి గలయతఁడుసర్వ•పదవిమఁడుసుఁడీ॥అశ్వ. ఆ౨. ప208

319 క॥ పునరావర్తనరహితుం
డనఘా! పరమాత్ముఁ జెంది • నట్టి పురుషుఁ డ
వ్విను తావస్థను మోక్షం
బని చెప్పుదు రంతకంటె • నధికము గలదే॥ శాంతి.ఆ౫.ప619

320 క॥ విను మాత్ముఁడు క్షేత్రజ్ఞుం
డన భూతాత్ముఁ డనఁ బురుషుఁ ♦ డనఁ బరమేశుం
డన బుద్ధిసాక్షియును నన
జనవర! పిలుతుఁ డనఁగఁ బరఁగు♦శాంతిపర్వణా॥ శాం.ఆర.ప122

321 క॥ వ్యాపకుఁడు సృష్ట బ్రహ్మ ప్ర
జాపతి నాఁ బరఁగి నిత్య ♦ సత్యాత్మతో
దీపితుఁడై పురుషుఁడు ని
ర్లేపుఁడు నిర్దేశముం గ♦లిగి వెలుగొందుఁ॥ శాంతి. ఆ౫. ప64

322 క॥ తేజోరూపము బ్రహ్మము
ప్రాజాపత్యం బనంగ ♦ బరఁగి పురుషుఁ[1]డుఁ
భ్రాజిష్ణు నిత్యసత్యా
వ్యాజమహిమ వెలుఁగుచుండు♦నకలంకమతిఁ॥ శాం. ఆ౫.63

323 తే॥గీ॥అతనిఁ బొందు నుపాయంబు ♦ నంతరంగ
నిగ్రహముగాఁగ నార్యు ల♦నుగ్రహింతు
రోపి చిత్తవికారంబు ♦ లుడిపి యేక
బుద్ధిఁ గొలువఁ బ్రసన్నుఁడై ♦ బొందు నతఁడు॥ఉద్యో.ఆ౨.ప327

324 తే॥గీ॥ఆపరంజ్యోతి పేళు ల♦ర్యముఁడు వరుణుఁ
డనిలుఁ డగ్ని సోముఁడు విష్ణుఁ ♦ డజుఁడు శివుఁ డ
నంగఁ బరఁగు శబ్దముల స♦న్నుతులు దానిఁ
బ్రియతులయి భజియింతురు ♦ నియతులార॥ అశ్వ.ఆ౨.ప166

325 తే॥గీ॥ అంబు పవమాన సూర్యచం♦ ద్రానలాది
వివిధ తత్త్వంబులును నీవ ♦ విశ్వలోక
సంప్రవర్తనకరుఁడవు ♦ శాశ్వతుండ
వచ్యుతుండవు పుండరీ♦కాక్షనీవు॥ భీష్మ. ఆ౧, ప216

326 క॥ జగములకు నాదికారణ
మగు పరమజ్ఞేయ మీవ♦యని కనిమెద భూ

---

1 డుఁ బ్రాజిష్ణు

గగన దిగంతరమంతయు
నగణితమూర్తీ! భవన్మయంబై తోఁచెన్॥ భీష్మ. ౩౧. ప212

327 క॥ లోకోత్పత్తిస్థితి విల
యాకలన వినోది మునిగణార్చితగుణ ర
త్నాకల్ప నిర్గుణాత్మ క
శోక భయాపహ పదాబ్జ శుభకరమూర్తీ॥ భీష్మ. ౩౨.ప264



## ౫ స్తుతిప్రకరణము.

### ౧-నారాయణస్తుతి.

1 క॥ పరమబ్రహ్మం బనఁగాఁ
బరతత్త్వం బనఁగఁ బరమ♦పదమనఁగా నీ
శ్వరుఁ డన విష్ణుఁ డన జగ
ద్భరితత నారాయణుండు♦దా వెలుఁగొందున్॥ అను.అ౪.ప366

2 ఆ॥ వె॥సర్వశాస్త్రవాక్య♦సమితి [1]నాలోకించి
మరియు దృఢవిచార ♦ మహిమఁ దెలిసి
నిశ్చయింపఁబడియె ♦ నిష్ఠ నారాయణు
నెపుడుఁ దలపవలయు ♦ నిదియొకండు॥ అను. అ౪. ప366

3 క॥ నారాయణపరములు నిజ
మారయ బ్రహ్మంబుఁ బరము ♦ నంచితసత్త్యో
దార తపంబులుఁ గావున
నారాయణపరత వినిన ♦ నాల్గిటినిచ్చున్॥ శాంతి. ఆ౨.ప52

4 క॥ విను మొకయించుకసేపై
నను నారాయణునిఁ దలఁచి ♦ నను సుగతిఁ గనున్
మనుజుఁ డనిన మది నెప్పుడు
ననిచినయాతనికి బ్రాతె ♦ యుత్తమధిషణా! అను.అ౪.ప371

5 క॥ ప్రణుత యగు నమోనారా
యణాయ యను నక్షరాలి ♦ నంతఃప్రాప్తి
క్షణమున జిహ్వకుఁ దెచ్చిన
బ్రణవార్థంబైనపదముఁ ♦ బడయుదురునరుల్॥ అను.అ౪.ప371

6 క॥ నారాయణ పదవాచ్యం
బారయ బ్రహ్మంబు దాని ♦ ననిశము వినియున్
సారమతిం దలఁచియు నిం
పారఁగఁబొగడియురమించు♦టతులహితమగున్॥ అను.అ౪.ప373

1. నాలోడించి.

7 తే॥గీ॥ విందు నారాయణపరాయ♦ణుండు పాత
కముల గెలిచి వెలుఁగుటయ♦కాదు తన్ను
నాశ్రయించినవారికి ♦ నతుల మైన
వెలుఁగు నొసఁగంగఁ జాలుట♦వేధచేత॥ అను. ఆర. ప374

8 క॥ ఓంకారవాచ్యునకు నన
హంకార నిరూఢభావ ♦ నారాధ్యునకున్
హ్రీంకారమయ సునోజ్ఞా
లంకారోల్లాసనిత్య ♦ లాలిత్యునకున్॥ విరాట. ఆ౧. ప32

9 క॥ త్రిభువన శుక దృఢపంజర
విభవ మహితునకు సమస్త ♦ విష్టప నిర్మో
క భుజంగపతి కఖిలజగ
దభిన్నరూపునకు భావ ♦ నాతీతునకున్॥ విరాట. ఆ౧. ప33

10 క॥ శ్రుతిసీమంతమణికి నా
శ్రితవాంఛా స్ఫూర్తికరణ♦చింతామణి కా
నత దురిత తమోద్యుమణికి
గ్రతుభూషణమణికి లోక ♦ రక్షామణికిన్॥ విరాట. ఆ౧. ప34

11 క॥ పరమశమ నిరత సంయమి
వర మానసకుముద హాస ♦ వర్తన చంచ
చ్చరణ నఖ చంద్రికా వి
స్ఫురణ విచిత్రప్రకాశ♦శోభాఢ్యునకున్॥ విరాట. ఆ౧. ప35

12 క॥ హరిహరనాథునకు మరు
త్సరిదాకల్పిత మనోజ్ఞ ♦ చరణశిర స్సుం
దరమూర్తికి భానన త
త్పరచేతోయుక్త భక్త ♦ పరతంత్రునకున్॥ విరాట. ఆ౧. ప36

13 క॥ శరణాగత సంశ్రిత భయ
హరణాసుర నికర శేఖ ♦ రానర్ఘమణి
స్ఫురణాపరిచయ రంజిత
చరణా వనమాలికా భు♦జంగాభరణా॥ విరాట. ఆ౧. ప38

14 క॥ జలనిధి హిమన ద్భూధర
కలిత జనన కేళికౌతు ♦ కవ్యక్తావ్య
క్త లలిత సౌందర్య స్ఫుర
దలఘుతను శ్రీసనాథ ♦ హరిహరనాథా॥ విరాట. ఆ ౧. ప40

15 క॥ పరమాత్ముని నారాయణుఁ
జిరంతనుని భక్తశేము♦షీ నిష్ఠాస్వీ
కరణైకాయనుని నమ
స్కరణంబునఁ దలఁతు నతుల ♦ షడ్విధభూతిన్॥
శాంతి. ఆ ౪. ప248

---

## ౨ - శివస్తుతి.

---

16 సీ॥ సర్వజగన్నిత్య ♦ సాక్షి లోకైక శు
భావహమూర్తి ని♦రామయుండు
[1]భూమ్యాదినిజమహా ♦ భూతంబులకు నుదా
త్తంబునునైన భూ♦తంబు శివుఁడు
దనముఖమున నగ్ని ♦ జనియించుటను సభ
క్తికసమారాధన ♦ కృతుల నియతిఁ
బాటించువారికి ♦ భవమోక్షణంబు గా
వించు వేడుక మది ♦ [2]నించినాఁడు.
గీ॥ వితతి చతురాత్మకత్వవి♦శ్రుతి వహించి
కరుణఁ దత్తత్పదస్థిరా♦కలన కల్యు
లగు సపర్యారతులకు న♦య్యైవిధంబు
[3]నిత్యపదవుల నొసఁగు మ♦హేశ్వరుండు॥ అను. ఆ౫. ప404

17 ఆ॥వె॥ ఇంద్రుఁ డజుఁడు విష్ణుఁ ♦ డివ్వాని వైదిక
స్తోత్రములఁ బ్రసాది♦తుఁడుగఁ జేసి
యెలమిఁ గొలుతు రమ్మ♦హేశ్వరుఁ గొలుచువా
రెందు నెపుడుఁ గీడు ♦ నొందర ధిప! శాంత. ఆ 3. ప49

(1) ప్రథమభూతంబులకుఁ బ్రధమతమంబు (2) నించువాఁడు (3) నిత్య
(4) బ్రసాదితునిగ

18 ఆ॥వె॥ ఆదిదేవుఁ డగు మ♦హాదేవుమీఁద నె
వ్వానిమనసు భక్తి♦వైభవమున
నుల్లసిల్లు నతని ♦ కెల్లకార్యముల డ
గ్గరవుచూవె గ్రహవి♦కార[1]గతులు॥ ఆర. ఆ౫. ప257

19 ఆ॥వె॥ అఖిలదేవతామ♦యాత్ముఁ డద్దేవుఁ డ
ట్లగుట నిఖిలదైవి♦కాపదుదయ
నిరసనం బొనర్చు ♦ నియతి నప్పరమేశుఁ
గొలిచి యిపుడ కీడు ♦ దొలఁగఁ ద్రోతు॥ సౌప్తి. ఆ౧. ప110

20 క॥ జగములు గలిగింపగ నవి
తగువర్తన మొంద నిలుపఁ ♦ దతిత్రో వానిం
దెగఁజేయ నీవ నేర్పరి
వగుట శ్రుతులు చెప్పు నిర్మ♦లాద్భుతమూర్తీ! ద్రోణ.ఆ౨.ప365

21 క॥ ప్రకృతి యనఁ బురుషుఁ డనఁగా
వికృతు లనం బరఁగుచున్న ♦ వీనికి నెల్లన్
సకలాత్మక ! నీవిభవమ
యకృత్రిమాధారభూత♦మైయుండు శివా! ద్రోణ. ఆ౨. ప366

22 క॥ అవ్యక్త మపరిమేయము
సువ్యక్త మనాదిభక్తి ♦ సుగమ మగమ్యం
బవ్యయము త్రిలోచన ! నీ
దివ్యమహిమ యోగమోప♦దేశము రుద్రా! ద్రోణ.ఆ౧ ప367

23 క॥ వేదములు [2]ధర్మవాచక
వాదంబులుఁ దద్విలాస♦వంతం బగు నా
త్రిదేవోత్కరము భవ
త్ప్రాదుర్భావములు గావె♦ బాలేందుధరా! ద్రోణ.ఆ౫.ప412

24 క॥ సురలాదిగఁగల జీవులు
పురుషార్థ చతుష్టయంబుఁ ♦ బొంది సుఖిత్వ
స్ఫురణము నొందుట నీ దగు
కరుణాతిశయంబు వడసి ♦ కాదె కపర్దీ॥ ద్రోణ. ఆ౫. ప411

---

1 క్రతులు, 2 వాక్యము.

25 క॥ స్థావరములు జంగమములు
నీవలనం గలిగెఁ దద్వి♦నిర్మలరక్షా
ప్రావీణ్యము దగఁ బ్రభువుల
కేవారలకైన నీవ ♦ యిత్తు మహేశా! ద్రోణ. ఆ౫. ప410

26 ఉ॥ ఆదికి నాదిలోకముల ♦ కన్నిటికిం బ్రభుఁ డవ్యయుండు వే
దాది పవిత్రవాచక స♦[1]హస్ర పరిస్ఫుట వాక్యరూపుఁ డం
హోచానకనప్రకారక శు♦భోదయకారణ దివ్యనాముఁ డం
బాదయితుండు దృజ్మహిత♦ఫాలుఁడు లోలుఁడు భక్తియుక్తికిన్.
ద్రోణ. ఆ౫. ప425

27 ఉ॥ నీలగళుండు శంకరుఁడు ♦ నిత్యుఁడు సత్యసురూపుఁ డుజ్జ్వల
త్కాల మహానలప్రశమ♦క ప్రచురామృతవృష్టి విస్ఫుర
ద్బాలమృగాంకశేఖరుఁడు ♦ దైత్యకులప్రవిదారణక్రియా
లోల పరశ్వధుండు[2]సక♦లుండు గలుండు ప్రియుండు శాంతికిన్.
ద్రోణ. ఆ౫. ప427

28 క॥ యోగీంద్ర చిత్తకమలా
భోగమధుప విభుఁడు ప్రకృతి♦పురుషాత్ముఁడు ని
ర్భోగస్వరూపుఁ డవ్య
క్తాగోచరుఁ డధికసులభుఁ ♦డమలాత్మునకున్॥ ద్రోణ.ఆ౫ ప426

29 ఆ॥ వె॥ అజుని విశ్వరూపు ♦ నమరుని సర్వామ
రాధినాథు నాద్యుఁ ♦ సాంగవేద
వేదితవ్యు నాత్మ♦వేద్యు నీశాను న
వ్యయుఁ దపఃఫలాత్మ ♦ నాశ్రయింతు. శాంతి. ఆ౬. ప415

30 క॥ వరదు శరణ్యశశాంక
స్ఫురితశిరోభాగు సర్వ♦భూతేశ్వరు శం
కరు సాంఖ్యయోగనిష్ఠా
పరసులభు ననంగదమనుఁ ♦ బరమాత్ము శివున్. కర్ణ.ఆ౧.ప269

31 క॥ స్తుత్యానుభావ నిర్మల
నిత్యానందస్వరూప ♦ నిగమశిరోధి

---

1. మగ్రపరిస్ఫుట వాక్యగోచరు., 2 సకలుం డనులుండు.

స్థిత్యపనయనోన్ముఖ చి
త్సత్త్వాత్మక భక్తలోక ♦ దౌర్గత్యహరా॥ కర్ణ. ఆ౧. ప271

32 చ॥ అనిమిష సిద్ధ సంయమి వి♦హంగ భుజంగమ ముఖ్యులెల్ల ని
న్ననిశము గొల్చి నీదయఁ గృ♦తార్థతఁబొందుదు రెందు నీవు నె
మ్మనమున సంతసిల్లుదు స♦మస్తజగంబులు శాంతిఁబొందు నీ
కినుకకు మాఱులేదు శివ♦కీర్తన యీ భువనత్రయంబులన్॥
అర. ఆ౭. ప 377

33 చ॥ రవి శశి వహ్ని లోచన సు♦రప్రతివీరవిమర్దనక్రమా
భువనమయాత్మకా భుజగ♦భూషణ పోషితభక్తసంయమి
స్తవనకథావధాన పర ♦ దర్పక దర్పహరా నిరస్తసం
భవ మరణాది వైకృత య♦పారగుణాగుణ దోషవర్జితా!
ద్రోణ. ఆ౨. ప 364

34 క॥ అజగవశార్ఙ్గాలంకృత
భుజగర్వనిరస్తదైత్య ♦ భూమస్తుత్యా
త్రిజగద్ధారణనిత్యా
భుజగసమాచరితశయన ♦ భూషణకృత్యా॥ విరాట. ఆ౧.ప 39

35 ఉ॥ [1]తెల్లముగాఁగ నేను శివ♦దేవు నెఱుంగుదు భూతసంచయం
బెల్ల జనింప నిల్ప గల♦యింపఁగఁ జేయు నతండె యవ్విభుం
డుల్లమునం దలంప భువ♦నోత్కర విశ్వవిధానయుక్తి వ
ర్తిల్లుచు నుండు భక్తికి వి♦ధేయుఁడ చేయుఁడు కౌరవేశ్వరా
సౌప్తి. ఆ౨. ప 109

36 శా॥ భావం బేకముఖంబుఁ జేసికొని యా♦పద్ధ్వాంతభాను న్మహా
దేవుం బర్వతకన్యకాప్రియు దయా♦ర్ద్రీభూత చేతస్కు లో
కావిర్భావ [2]వివర్ధనా లయకృతి ♦ వ్యాపారపారంగతున్
దేవేంద్రప్రముఖామరార్చితుని భ♦క్తిప్రార్థిత న్గొల్చెదన్॥
సౌప్తి. ఆ౧. ప 109

37 ఆ॥ వె॥ దైవమెల్ల దలఁప ♦ నీవ సమస్తజ
గంబులకును నేడు ♦ గడయు నీవ

(1) తెల్లమి (2) వివర్ధనాలయ.

కర్మఫలదుఁడవును ♦ గర్మప్రదుండవు
నీవ కరుణ నన్నుఁ ♦ గావు మభవ॥ శల్య. ఆ౨. ప 162

38 క॥ నినుఁ దనుగా నతినిర్మల
మనస్సమాధిప్రకర్ష ♦ మగ్నత వలనం
గనుఁగొని తదూర్జిప భజన
మొనరించుమహాత్ముఁడమృత ♦ మొందుబశుపతీ॥ ద్రోణ. ఆ౫. ప413

39 క॥ శతరుద్రీయము నే నరుఁ
డతిభక్తిని శివుని మనము ♦ నందు నిలిపి యుం
చితముగఁ బఠించు సులభం
బతనికి సర్వంబు నిందు ♦ నందు నరేంద్రా॥ అను. ఆ౫. ప386

40 క॥ ఈనామ నిర్వచనములు
మానవుఁడు పఠించినను స ♦ మాహితమతియై
వీనుల నించిన సౌఖ్యము
నానందము నిందు నందు ♦ నతనికి గల్గున్॥ అను. ఆ౫. ప401

41 ఆ॥ వె॥ అగ్ని వాయు వాస ♦ వాదిత్య వసు మరు
దాది దేవతా మ ♦ యాత్ముఁడైన
శివునిమహిమఁ బ్రీతిఁ ♦ జెప్పుట వినుట స
ర్వార్థసాధకంబు ♦ లగు నృపాల! అను. ఆ౫. ప396

42 క॥ శివ నారాయణ యచ్యుత
భవదీయములైన మధుర ♦ భాషణములు నా
చెవు లానిన నమృతరస
ప్లవనంబునఁబోలెఁ బ్రమద ♦ భరితుఁడనైతిన్॥ శాంతి. ఆ౨. ప118

## 3 - విష్ణు స్తుతి.

43 క॥ అజు విశ్వాధీశ్వరు స
ర్వజగత్ప్రభ వవ్యయ ప్ర ♦ వర్తనకరు నం
బుజలోచను నెవ్వారలు
భజింతురు పరాభవమునఁ ♦ బడ రప్పాణ్యుల్॥ అను. ఆ౫. ప332

44 తే॥ గీ॥ ధరణి మొదలైన పంచభూ♦తములకంటె
మనసుకంటెను బుద్ధికం♦టెను మహత్త
రంబు గాలంబు గాల త♦త్త్వంబు మిగిలి
యుండు విష్ణుం డిజ్జగముల♦కొడయుండతండు॥ శాంతి. ఆర. ప197

45 క॥ ఆదియు మధ్యము నంతము
నాదేవేశునకు లేమి ♦ నవ్యయుం డతం డీ
వేదములకు నానావిధ
వాదములకుం జేరుగడ భ♦వక్షేపి నృపా! శాంతి. ఆర. ప198

46 ఆ॥ వె॥ పూజ్యుడవు పురాణపురుషుండ వీశుండ
వప్రమేయుండవు చ♦రాచరంబు
లయిన భూతరాసు ♦ లచ్యుత! నీయంద
పుట్టు నిలుచు లయము♦బొందుచుండు॥ ఆర. ఆ౭. ప126

47 తే॥ గీ॥ క్షరము నక్షరమును [1]నీవ ♦ సకలమునకుం
గర్తయును నీవ యాద్యంత♦గతులు నీవ
యొకడవై వెలుంగుడు పురు♦షోత్తమాభి
ధాన! వాచ్య వినమ్రవా♦త్సల్యకల్య! శాంతి. ఆ౨. ప10

48 క॥ ఆదిమపురుషుండ వగుటను
వేదంబులు సెప్పు నవియు ♦ వెరచుం బలుకంగా
నీదృక్ప్రకారుం డని దా
మోదర ; నీపెంపెఱుంగ ♦ నొరుల కలవియే? శాంతి. ఆ౧. ప390

49 క॥ దేహస్థు నదేహు నఖిల
దేహసము న్నిన్ను భక్తిం ♦ దెలుతురు దురిత
వ్యూహమ్ము పుణ్యచయమున
మోహత నిరసించు యోగి♦ముఖ్యులు కృష్ణా! శాంతి. ఆర. ప237

50 క॥ చతురాశ్రమముల లోపల
నతులమతీ! యెందు నిల్చె ♦ నతులిత భక్తిన్
మతిం గేశవుం గూర్చక స
ద్గతి పెరకర్మముల నేల♦కలుగంగ నేర్చున్॥ అను. ఆర. ప375

(1) నీవకర్తయును వి,

51 తే॥గీ॥ అశ్వమేధసహస్రంబు ♦ లాచరించి
పడయరాని మహోన్నత♦పదము నస్మ
దీయ భక్తిరసైక ప♦రాయణుండు
పడయనేర్చు సుకరముగ ♦ బ్రహ్మపుత్ర! శాంతి.ఆ౪.ప257

52 క॥ కను టరిది యొండుమెయి వి
ష్ణునిభక్తిం గనుము నీవు ♦ సువ్రత! యద్దే
వుని వినుము భక్తవత్సలుఁ
డను నామము గలిమి దృశ్యుఁ♦డగుభక్తులకున్॥ అను.ఆ౪.ప376

53 క॥ భక్తియు నార్జవమును సం
యుక్తము లై యున్నయట్టి ♦ యుల్లంబున నా
సక్తి నిలుతు నిం దొకఁడు వి
యుక్తంబై నను వసింప ♦ నుర్వీశవరా! శాంతి.ఆ౨. ప115

54 క॥ రోషముఁ గామము రాగ
ద్వేషములును లేక భక్తి ♦ తిరమై యోగా
శ్లేషునిఁగాఁ గొలుఁతు రవి
శ్లేషమనో [1]నిలయవృత్తి ♦ సిద్ధులు నిన్నున్॥ శాంతి.ఆ౪.ప235

55 క॥ అంతశ్చర మారుతములు
శాంతములుగఁజేసి యనల ♦ సత్వము శమనున్
దాంతియుఁగల జనములు గను
నంతర్హితు గొలుతు జలశ♦యనుయోగాత్మున్॥ శాం.ఆ౨.ప29

56 క॥ [2] అపరభవముఁ బ్రాపించిన
యపుణ్యపుణ్యములు గలుగు ♦ నతిశాంతులు భ
వ్యపుగతిఁ బొందెడు నానం
దపురూపుని విష్ణుఁ దలఁచె♦దను మోక్షాత్మున్॥ శాంతి.అ౨.30

57 తే॥ గీ॥ ప్రియాతులగు సద్ద్విజులు వారి ♦ బరమభక్తి
యుక్తి నెపుడుఁ బఠించుచు ♦ భుక్తిముక్తి
దాయి వగు నిన్ను సతతము ♦ దలఁచుచును న
మస్కృతులు నేసి యవ్యయ♦మహిమఁగందురి॥ శాం.ఆ౧.ప392

1, నిలయమూర్తి, 2. ఉపరము ము.

58 క॥ దురితములఁ జెఱుప శుభములు
బెఱిగింపంజాలునట్టి ♦ పేరులు నీకుం
బురుషోత్తమ! కడుఁ బెక్కువి
పరమార్థద్యోతకములు ♦ భావింపంగన్॥ శాంతి. ఆ౧. ప391

59 క॥ భూతముల మ్రింగి లోక
వ్రాతము జలమయముచేసి ♦ వశ్యాత్మత స
ద్రాతిశయంబున బాలుం
డై తేలెడువానిఁ దలఁతు ♦ హరిమాయాత్మున్॥ శాం. ఆ౨. ప32

60 తే॥గీ॥ స్థావరములు జంగమములు ♦ ధాత లోన
గాఁగఁ బ్రళయంబు బొందిన ♦ కాలములను
నిలుచు నెవ్వఁ డొకండ యా ♦ నిత్యసత్య
లలితు శార్ఙ్గి బ్రసన్నుఁగా♦గొలుతు నియతి॥ శాం. ఆ౮. ప219

61 తే॥గీ॥ అంబుదంబులు కేశంబు♦లందు నదులు
సర్వతనుసంధులందును ♦ జలధు లుదర
దేశములయందు నున్నట్టి ♦ దేవదేవు
గొలుతుఁ దోయాత్ము దేవకీ♦కొడుకుఁ గృష్ణు॥ శాం. ఆ౨. ప33

62 క॥ అమృతమయ ఋగ్యజుస్సా
మముల యుపనిషద్వచస్స♦మాజములకు వా
చ్యమయిన పురుషోత్తము ని
క్కమురూపగువాని భక్తి♦గమ్యుఁ దలంతున్॥ శాం. ఆ౨. ప22

63 తే॥గీ॥ చరణ నాభి శీర్షంబులు ♦ ధరయు నంత
రిక్షమును దివమును జగ♦చ్చక్షు రగ్ని
దిశలు దృఙ్ముఖశ్రోత్రములు ♦ దీప్తుఁ డే మ
హాత్మునకు నట్టి సర్వలో♦కాత్ముఁ దలఁతు॥ శాంతి. ఆ౨. ప31

64 ఆ॥వె॥ హరి సహస్రశీర్షు ♦ బరము సహస్రాక్షు
వేదమయు సహస్ర♦పాదు నలఁతు
లైనవారికంటె ♦ నలఁతి పెద్దలకును
జాలబెద్దయగు దయాళుఁ గొలుతు॥ శాంతి. ఆ౨. ప21

65 క॥ ముని దివిజాదికలోకము
లనంతుఁడన జగతికెల్ల ♦ నాధారంబై
పెనుపొందెడు శేషాత్ముని
వినుతింతు న్విష్ణుభక్తి ♦ విభవవిధాయిన్॥ శాంతి.ఆ౨.ప36

66 క॥ సువ్యక్త క్షేత్రంబున
నవ్యక్తాకృతిని రూఢి ♦ నాసీనుండై
భవ్యత నొందెడు క్షేత్రా
త్మవ్యపదిష్టుఁ బ్రణుతింతు ♦ దామోదరునిన్॥ శాంతి.ఆ౨.ప27

67 సీ॥ శుచియును హంసుండు ♦ శుచిషత్తుఁ బరముండుఁ
బరమేష్ఠియును నగు ♦ భవ్యుఁ గొలుతు
మునులును సురలు నె♦వ్వని యున్నరూపెఱుం
గరు సర్వవిదుని నా♦పురుషుఁ గొలుతు
శ్రుతులు సెప్పఁగ మహో♦మతులు దుఃఖౌషధ
ముగ నెఱిఁగెడు పుణ్య♦మూర్తిఁ గొలుతు
లోకంబులెల్లఁ గ♦ల్గుట నిల్చుటాదుగుట
[1]తనయందె యగు మహా♦త్మునిఁ గొలుతు
గీ॥బక్షి రత్నచయంబు బు♦ష్పవ్రజంబుఁ
బంజరము తాడు నార యు♦పాశ్రయముఁగ
నుండుచాడ్పున విశ్వంబు ♦ నుండుటకు ను
పాస్పదంబగు పుండరీ♦కాక్షుఁ గొలుతు॥ శాంతి.ఆ౨.ప20

68 తే॥గీ॥ ఒకఁడు పండ్రెండుమూర్తులై ♦ యుండునట్లు
గా హిరణ్యవర్ణం బగు ♦ గర్భ మదితి
దాల్చి యెవ్వానిఁ గనియె ♦దైత్యఘ్ను నట్టి
దేవు సూర్యాత్మకునిఁ బ్రణు♦తింతు విష్ణు॥ శాంతి.ఆ౨.ప24

69 క॥ సురపితృకోట్లం బూర్వా
పర పక్షములందు నమృత♦పానప్రీతిం
బొరయఁగఁ జేయుచు వెలిఁగెడు
హరి సోమాత్మకునిఁ గొల్తు ♦ నాత్మేశ్వరునిన్॥ శాంతి.ఆ౨.ప25

---

1 తనయందమగు.

70 తే॥ గీ॥ విశ్వసృజులైన మునులచే ♦ వితత మగు స
హస్రవత్సరకలిత మహాధ్వరమునఁ
గళ్యపబ్రహ్మ యెవ్వనిఁ ♦ గనియెఁ గనక
పక్షుఁ దార్క్ష్యాత్ముఁ దలతు నప్పద్మనాభు॥ శాంతి.ఆ౨.ప26

71 క॥ ఆదిత్య మరు ద్వసు రు
ద్రాది దివిజగణము లెల్ల ♦ నవయవరూపో
త్పాద కలితు లెవ్వానికి
నా దేవుని సంస్తుతింతు ♦ హరి వేదాత్ముఁ॥ శాంతి. ఆ౨. ప37

72 క॥ మాస ర్త్వయనాబ్ద మయో
ద్భాసితరూపుఁడయి సృష్టి ♦ ప్రళయంబు దగం
జేసి పొలుపారు శౌరి ను
పాసింతును యోగభోగ్య ♦ బలుఁ గాలాత్ముఁ॥ శాంతి.ఆ౨.ప35

73 క॥ మీఁ నయి తా నతలగతం
బైన నిగమచయముఁ దెచ్చి ♦ యజునకు నొసఁగం
గా నేర్చిన సుమనస్స
న్మానితవిగ్రహు భజింతు♦మత్స్యాత్ము హరిఁ॥ శాం.ఆ౨.ప39

74 క॥ అమృతమథనమున మంథన
గము లీలోద్ధరణ కేలిఁ ♦ గైకొని సురసం
ఘమునకుఁ బ్రియ మొనరించిన
యమేయుఁ గూర్మాత్ము నంబు♦జాక్షునిఁ గొలుతుఁ.
శాంతి. ఆ. ౨. ప40

75 క॥ వారాహరూపమునఁ బెం
పారిన తనదంష్ట్ర నొకట ♦ నవని సగిరికాం
తారంబుగ నెత్తిన యా
శౌరిం గ్రోడాత్ముఁ గొల్తు ♦ సమ్యగ్భక్తిఁ॥ శాంతి. ఆ౨. ప41

76 ఆ॥ వె॥ నారసింహవపు రుదారభావము నొంది
ఘనహిరణ్యకశిపు ♦ ఖరనఖముల
వ్రచ్చి దీప్తమూర్తి ♦ వరలు నృసింహాత్ము
నాత్మభవుని భక్తి ♦ నాశ్రయింతు॥ శాంతి. ఆ౨. ప42

77 క॥ వామనరూపంబున ను
ద్దామబలుఁ బలి నడంచి • త్రైలోక్యాతి
క్రమతఁ బేర్చిన యద్భుత
ధాముఁ గ్రాంతాత్ముఁ దలఁతు•దామోదరునిన్॥ శాం.ఆ౨.43

78 ఆ॥వె॥ పరశురాముఁ డనఁగ • భవ్యుండు జమదగ్ని
కుద్భవించి యిరువ•దొక్కమారు
మనుజపతుల నెల్లఁ • దునిమిన క్రోధాత్ము
నధికభక్తి శార్ఙ్గి • నాశ్రయింతు॥ శాంతి. ఆ౨. ప44

79 క॥ క్షత్రాత్ముఁ గొలుతు దశరథ
పుత్రున్ శ్రీరాముఁ డనఁగఁ • బొలిచిన దేవున్
శత్రుభయదు రావణు నొక
మాత్రం దునుమాడినట్టి • మధుసూదనునిన్॥ శాంతి.ఆ౨.ప45

80 క॥ హల ముసల ధరునిఁ గరుణా
నిలయహృదయు రాము రౌహి•ణేయు సితాంగున్
జలద నిభాంబరు నీశుం
దలఁతును గోవిందు శౌర్య•ధను భోగాత్మున్॥ శాంతి.ఆ౨.ప46

81 ఆ॥వె॥ అరణి నగ్ని వోడము•కరణి దేవకియందు
విప్రకర్మ యజ్ఞ • వేదగుప్తి
కై జనించె నెవ్వఁ • డవ్వాసుదేవనం
దను భజింతు నేక•తానురూఢి॥ శాంతి. ఆ౨. ప23

82 మ॥ యదువంశంబున వాసుదేవుఁ డనఁ • గ్రీడార్థంబు జన్మించి దు
ర్మదదైత్యావనిఁ గూల్చి పార్థునకు సా•రథ్యంబు త్రైలోక్యస
మ్మదమారంగ నొనర్చి దేవముని స•న్మానోద్ధతిన్ భూభరం
బుఁ దొలంగించిన చక్రి నంబురుహనా•భుం గొల్తు గృష్ణాత్మునిన్.
శాంతి. ఆ౨. ప47

83 క॥ [1]కలికాలచరిత ధర్మము
నిలుపంగలయట్టి కృష్ణు•నిం గల్క్యాత్మున్

1. కలకాల.

దలఁతుఁ దురగవాహను న్లేం
చ్ఛులనెల్లను గీటడంచు ♦ శుభచారిత్రుల్॥ శాంతి. ౭౧. ప48

84 ఆ॥ వె॥ యజ్ఞధరుఁడు పంచ♦యజ్ఞుఁడు లక్ష్మికి
నునికిపట్టు యోగ♦మునకు నెలవు
సర్వమునకు నిష్ట♦సదనంబుగా నొప్పు
వానినాశ్రయింతు ♦ వరదుఁ బరము॥ శాంతి. ౭౪. ప223

85 సీ॥ అవ్యక్తు శాశ్వతు ♦ నఖిలప్రభవభూమి
భక్తవత్సలు విష్ణుఁ ♦ బరమపురుషు
నక్షయుఁ బ్రాంజలి♦నై యాశ్రయించెద
బుండరీకాక్షుని ♦ భువనసాక్షి
నిత్యుఁ బురాణు వ♦ర్ణించెదఁ బరు సహ
స్రాక్షు నక్షరుని [1]లో♦కాధినాథు
భవ్యుఁ గొల్చెద భూత♦భవ్య జగత్ప్రభు
సర్వతోముఖు భూత♦సంప్రవృత్తి
ఆ॥ వె॥ నమృతు నచ్యుతుని న♦నంతు హృషీకేశు
రవిసమానప్రభు హి♦రణ్యగర్భు
నబ్జనాభు సత్యు ♦ నాద్యంతరహితు భూ
గర్భుఁ బ్రభువు భక్త♦గమ్యుఁ దలఁతు॥ శాంతి.౭౪.ప216

86 క॥ ఎవ్వఁడు సచరాచరగురుఁ
డెవ్వనినాభీసరోజ ♦ మీాౘె విధాత
న్నివ్విటిలు జగము లన్నియు
నెవ్వనిచే నమ్ముకుందు ♦ నెప్పుడుఁగొలుతుఌ॥ శాంతి.౭౪.ప218

87 క॥ కాలము పర్జన్యుండును
నేలయు సస్యంబుఁ గ్రియయు ♦ నిష్క్రియయును ధ
ర్మాలోకమునై మహిమ
న్లీల నలువు వాసుదేవు♦నిం బ్రణుతింతుఌ॥ శాంతి.౭౪. ప220

88 క॥ సర్వము నందును దానుఌ
సర్వము దనయందు నుండు ♦ సంచారంబుల్

1. లోకైక.

సర్వమునకు దనవలనన
సర్వాత్మకు నట్టి వృష్ణి♦సత్తముఁ దలఁతున్॥ శాంతి.ఆ౨.ప38
89 క॥ ప్రకృతి వికృతులను షోడశ
వికారములఁ బెరసి ప్రకృతి ♦ వికృతిత్వముఁ బొం
దక యుండఁ గాంతు రెవ్వని
సకలమునులు దలఁతు నట్టి♦సాంఖ్యాత్మహరిన్॥శాంతి.ఆ౨.28
90 క॥ లోకం బంతయు నెవ్వం
డేకాంశంబునను నిర్వ♦హించుచు నగ్రా
హ్యాకారుండై వెలుఁగు ద
యాకరు నప్పద్మనాభు ♦ నభివర్ణింతున్॥ శాంతి. ఆ౪. ప227
91 క॥ [1]అగమనుని బోధ్యుని నఖిల
జగద్భరణుఁ బరు నమూర్తి ♦ సాగరునిఁ బ్రబో
ధగరిష్ఠు బంచకాల
జ్ఞ గుణాత్మకు నిర్గుణత్వ♦శోభితుఁ గొలుతున్॥ శాంతి.ఆ౪. 224
92 క॥ వ్యక్తమునకు బ్రభవం బ
వ్యక్తం బాతత్త్వమునకు ♦ నవుల నను వచో
యుక్తికిఁ బరాయణం బగు
భక్తపరాధీను భవ్య భావ్యు ♦ నుతింతున్॥ శాంతి. ఆ౪.ప225
93 క॥ గుణములకు నాదియై ని
ర్గుణమ్ములకు నాద్యుఁడగు న♦రూపుని లక్ష్మీ
ప్రణయపరు నజుని సూక్ష్మం
బ్రణుతింతుఁ బ్రసన్నుఁగాఁబ♦రముసర్వగతున్॥ శాంతి. ఆ౪.232
94 క॥ మఱిగత సాంఖ్యులు యోగా
న్వితులు నగు మహాత్ము లెవ్వ♦నిం గని పునరా
గతి లేని సుగతి వడయుదు
రతర్క్యుఁడై భవుని దలఁతు♦నప్పరమాత్మున్॥ శాంతి. ఆ౪.ప229
తే॥గీ॥ అచలు సూక్ష్ము [2]శరణ్యు స♦హస్రశీర్షు
నభయకారి నశీర్షు నా♦రాయణుని స

(1) అగమనునిం బాంధు (2) వరేణ్యు.

నాతనుని యోగమూర్తిలో • కాతిరిక్తు
ఘ్రిపుని నీశ్వరు హరి భక్తి • తోడఁ గొలుతు॥ శాంతి. ఆ౪. ప217

96ఆ॥ వె॥ క్షరములైన భూత • సంఘంబులందెల్ల
నక్షరస్వరూపుఁ • డై వెలుంగు
సకల బుద్ధివృత్తి • సాక్షిసూక్ష్మాత్ముఁ న
స్పందబోధఘను ము • కుందుఁ దలఁతు॥ శాంతి. ఆ౨. ప 49

97 క॥ అనలునకు రవి శశాంకుల
కును గ్రహగణ తారకముల • కును దేజం బె
వ్వనివలన నావహిల్లెడు
ననుపాధిక తేజుఁ గొల్తు • నవ్విశ్వాత్ముఁ॥ శాంతి. ఆ౪. ప221

98 క॥ ఇనునడుమ [1]వెలింగెడు సో
మునిమధ్యమునం జలత్వ • ముం బొందని ని
ల్పున వెలయు దీప్తియగువా
ని నిరంజను నంతరాత్ము • నిం బాటింతుఁ॥ శాంతి. ఆ౪. ప230

99 క॥ కలయుంగ నెల్లయెడలుం
దలలును లోచనములును వ • దనములు నగు ని
ర్మలు నిర్వికారు నిన్నుం
గొలిచెద సర్వైకసాక్షి • [2]గోవిందుహరీ॥ శాంతి. ఆ౪. 223

100 క॥ జ్ఞానధ్యానపరాయణు
లైన మహాత్ములు జితేంద్రి • యత్వమహితు లె
వ్వానిం బొందిన మరలరు
వానిశరణుఁ జొచ్చి బ్రతుకు • వాఁడసుకృతినై॥ శాంతి. ఆ౪. 226

101 తే॥గీ॥ అచరములును జరంబులు • నైన భూత
సముదయంబులు మణులు సూ • త్రమున నున్న
కరణి నీయంద యున్నవి • గాన సమత
నేకభక్తి నేఁ గొలెద • నిన్ను దేవ॥ శాంతి. ఆ ౪. ప 240

102 తే॥గీ॥ బుద్ధియును బ్రాణమును నిన్నుఁ • బొరయఁ జేయ
జాలు భక్తా నా కొసఁగుము • జలధిశయన

(1) వెలుంగుచు (2) గోవింద హరీ.

పూర్వకర్మఫలంబులు ♦ పొందుగాక
యవి ఋణంబులు గడ తేరు♦తై సుఖింతు॥ శాంతి.ఆ౮.ప245
103 తే॥గీ॥ విష్ణుమయ మగ్ని హవియును ♦ విష్ణుమయము
విష్ణుమయము సర్వంబును ♦ విశదబుద్ధి
నిట్లుగుటఁ గందుఁ గావున ♦ నించుకేని
గల్మషము నాకు లేకున్కి ♦ గానవచ్చు॥ శాంతి. ఆ౨. ప 53
104 క॥ కర్తయును భర్తయును సం
హర్తయు జగములకు నీవ ♦ యాశ్రితజన ఘో
రార్తి నిరాస నిపుణ సం
కీర్తన యోగీశ్వరేశ ♦ కృష్ణ ముకుందా॥ శాంతి. ఆ ౨. ప 111
105 క॥ మొదల గలిగించి జగములఁ
బదిలంబుగ నునిచి వానిఁ ♦ బదపడి తనయం
దొదిగించి మఱియు నిమ్మొయి
నుదారగతి నడపు చిన్మ♦యుని హరిగొలుతున్॥ శాంతి.ఆ౬.414
106 సీ॥ పరమేశ! పుణ్య సు♦బ్రహ్మణ్య భక్తవ
త్సల మహాదేవ వి♦శ్వప్రకాశ
[1]శరణు హృషీకేశ ♦ వరద నారాయణ
రాజీవనయన హి♦రణ్యనాభ
యఖిలలోకనమస్కృ♦తాంఘ్రిసరోరుహ
యజ్ఞాంగ యచ్యుత ♦ యమృతరూప
నీకు మ్రొక్కెదఁ గరు♦ణింపవే యతసీకు
సుమవర్ణ పీతాంబ♦రము ధరించి
ఆ॥వె॥ యున్న నిన్ను నెవ్వ ♦ రుల్లంబునందు ద
లంతు రట్టివార♦లకు భయంబు
గలుగ దెందు నేమి ♦ కార్యంబులం దెప్డు
వినుతమంగళాయ♦తనము లగుట॥ శాంతి. ఆ౨. ప 50
107 మత్త॥ దేవ దేవశ్రుతిప్రమాణవి♦ధేయ మాధవ జంగమ
స్థావరాత్మకమైనలోకము ♦ సర్వముం భవదీయ మా

1. శరణ.

యావిధేయము విశ్వరూపుఁడ ♦ వవ్యయుండవు నీవ స
ద్భావనస్థితి నిన్నెఱింగినఁ ♦ బాయుఁ బాపము లచ్యుతా!
ఆర. ఆ౪. ప 376

108 తే॥గీ॥ నిన్ను నెప్పుడు వలఁచెద ♦ నన్ను నీవు
వత్సలుఁడవయి "వీఁడు నా♦వాఁ" డనంగ
వలయుఁ జమ్మయ్య మఱువక ♦ వాసుదేవ!
దేవదేవ మునీశ్వర♦భావనీయ! 246

109 క॥ కరుణింపుము సంశ్రితభయ
హారణధురీణా! సహింపు ♦ మజ్ఞానము నీ
శరణము వేఁడెదను భవ
చ్చరణంబులు గనుఁగొనంబ్రి♦సాదింపఁగదే॥ ఉద్యో.ఆ౩.ప408

110 క॥ అంబుదశుభగాత్రుం బీ
తాంబరధరుఁ గమలదళని♦భాక్షుఁ హరిఁ జూ
డం బడసి లోచనము లమృ
తం బానినమాడ్కి సమ్మదంబున దేలెఁ॥ ఉద్యో.ఆ౩.ప254

111 తే॥గీ॥ దేవదేవ! [1]దేవాత్మక! ♦ దేవవంద్య!
శంఖచక్రగదాపద్మ ♦ చారుహస్త!
వాసుదేవ! త్రివిక్రమ ♦ వరద పరమ
పురుష ప్రణుతి యొనర్చెదఁ♦గరుణఁజూడు॥ అను.ఆ౫.ప461

112 క॥ శరణాగతుండ భక్తుఁడఁ
బరమపదవి గోరెదను శు♦భంబుగ నన్నుం
బరికించి యేది మేల
య్యెరవు దొరఁకొనంగ జేయు♦వేకమలాక్షా॥ శాంతి.ఆ౨.ప54

113 తే॥గీ॥ తపమునకు విద్యకును జని♦స్థానమైన
జననరహితుని యజ్ఞాత్మ ♦ శౌరి వాక్ష
యాధ్వరార్చితుఁ జేసితిఁ ♦ నా జనార్ద
నుండు మద్భజనమునఁ బ్రీ♦తుండుగాత॥ శాంతి. ఆ౨. ప55

1. శ్రీవాత్మక.

114 తే॥గీ॥ అమల ధర్మార్థకామమో♦క్షములఁగుఱిచి
యొలయు తెరువెద్దియును నిందుఁ♦దలుగు నదియ
యొండెడలఁ గల్గు దీన లే♦కుండుఁజొప్పు
తక్కొకండును లేదు వే♦దజ్ఞులార॥ స్వర్గా. ఆ౧. ప82

115 క॥ మానసముల నింద్రియముల
నేనియుఁ జేయంగఁబడిన ♦ యేనఃపుంజం
బీనిర్మ లేతిహాసము
వీనుల నొక్కింత వినిన ♦ విరియు సకలమున్॥ స్వర్గా. ఆ౧. ప88

116 క॥ మంగళము విష్ణుదేవుఁడు
మంగళ మెమ్మెఁదలంప ♦ మధురిపుఁ డుద్య
న్మంగళ మంభోజాక్షుఁడు
మంగళ మఖిలము విహంగ♦మధ్వజుఁడరయన్॥ శాంతి. ఆ౨. ప51

